HETU VADI

# హేతువాది

Monthly Journal devoted to Science, Rationalism & Humanism

## "హేతువాది"
## రజతోత్స సంచిక

2007 ఆగస్టు, 11, 12 తేదీలలో
'హేతువాది' రజతోత్సవాలు
వేదిక
రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్ - ఇంకొల్లు

268




సంపుటి : 25
సంచిక : 11
ఆగస్టు. 2007
వెల : రు. 50/-

రజతోత్సవ సంవత్సర ప్రచురణ

ప్రధాన సంపాదకులు : రావిపూడి వెంకటాద్రి

హేతువాది

సంపుటి : 25 సంచిక : 11

ఆగస్టు, 2007

ప్రధాన సంపాదకులు :

**రావిపూడి వెంకటాద్రి**

☎ : 08594 - 233403

cell : 9989223042

**E.mail :**
**Ravipudi2007@rediffmail.com**

చందాలు, విరాళాలూ, వ్యాసాలు

పంపవలసిన చిరునామా :

**మేడూరి సత్యనారాయణ**

మేనేజింగ్ ఎడిటర్

ఇంకొల్లు - 523 167, ప్రకాశం జిల్లా

ఫోన్ : 08594 - 244589

Cell : 98499 35117

Fax : 08594 - 244431

E.mail :

meduri_satyanarayana@yahoo.com

| | |
|---|---|
| జీవిత చందా | రూ. 1,000/- |
| సాలుచందా | రూ. 100/- |
| విడిప్రతి | రూ. 10/- |

**ABROAD Subscription**

| | | |
|---|---|---|
| Annual | $100, | £ 75 |
| Life | $1000, | £ 750 |

ఇందులో....



18

ఎడిటోరియల్

KLVA10SM244 153 80

# భావాల వ్యవస్థీకరణను బద్దలు కొట్టేదే హేతువాదం

మనం 2004 జూన్ 4,5,6 తేదీలలో ఒంగోలులో ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ రజతోత్సవాలు జరుపుకున్నాం.

2006 జనవరి 7,8 తేదీలలో తిరువనంతపురం (కేరళ)లో భారత హేతువాద సంఘ ప్లాటినం జూబ్లీ ఉత్సవాలు జరుపుకున్నాం.

మరల ఇప్పుడు 2007 ఆగస్ట్11,12 తేదీలలో ఇంకొల్లులో "హేతువాది" మాసపత్రిక రజతోత్సవాలు జరుపుకుంటున్నాం.

ఈ శతాబ్దారంభంనుంచి జరిగిన, జరుగుతున్న ఈ సంఘటనలు హేతువాద ఉద్యమ చరిత్రలో మరపురాని అంశాలుగా గుర్తుంటాయి.

సంఘాలు నిర్మించుకోవడం తేలికే. కాని, వాటిని నాలుగుకాలాల పాటు మనగలిగేట్లు కాపాడుకోవడం కష్టం. ఆ కష్టాన్ని మనం దాటగలుగుతున్నాం.

మానవుడిలో ఏనాడు విచక్షణా జ్ఞానం పుట్టిందో, ఆనాడే హేతువాదం పుట్టిందనేది హేతువాద సంఘ అవగాహన.

కానీ, భావాల వ్యవస్థీకరణతో హేతువాద ధోరణి కుంటుబడుతూ మతవ్యవస్థలు అవతరించాయని కూడా హేతువాద అవగాహన.

అందువల్ల, కేవలం మతాలపైననేకాక, మతాలకు తీసిపోని యితర వ్యవస్థీకృత సిద్ధాంతాలపై కూడా "హేతువాది" తన విమర్శను గురిపెట్టింది. ఈ సందర్భంగానే మరో నాలుగు మాటలు చెప్పాలనుకుంటున్నాను.

****

'విస్సన్న చెప్పిందే వేదమా?' అనే చిరంతన ప్రశ్న ఒకటివుంది. "కాదు" అనేదే హేతువాదం చెప్పేసమాధానం. ఈ వాస్తవాన్ని మానవ చరిత్ర యావత్తూ చాటుతూనే వుంది. కాకుంటే, ఇన్ని మతాలు, మతశాఖలు, తత్వాలు, సిద్ధాంతాలు బయలుదేరేవేకావు. అందులో ఒకటి సబబయితే, మరొకటి బయలుదేరే అవకాశం లేదు. కాగా, సబబైన మార్గాన్ని ఎన్నుకోడానికి మనిషికి ఒకే ఒక సాధనమున్నది. అది హేతువాదమే.

మానవుడు ప్రకృతివాస్తవికతను ఎప్పటికప్పుడు గుర్తించి జ్ఞానం ఆర్జిస్తున్నాడు. ఆ జ్ఞానం వాస్తవికతను గురించిన సత్యానికి ఎప్పటి కప్పుడు కొత్త మదింపు వేస్తుంది. 'అంతా' మనకు ఒకేసారి తెలియదు. జ్ఞానం అంచెలంచెలుగా పెరుగుతుంది. జ్ఞానం పెరిగేకొలది సత్యం కూడా దానికి సమాంతరంగా పెరుగుతుంది. ఇది మనకు అందిన వాస్తవిక సత్యాన్ని (objective truth) గురించి మనకున్న అవగాహనను నిర్దేశిస్తుంది.

నిన్నటి కంటె నేడు, నేటికంటే రేపు మనకు వాస్తవిక సత్యం అదనంగా అందే అవకాశంవుంది. కాబట్టి, జ్ఞానమూ, దాన్ని బట్టి సత్యమూ– రెండూ సాపేక్షాలే(relative) కాని, పరమం(absolute)కావు. పారమ్యం (abosluteness)అనేది సత్యదూరం.

అందువల్ల, సత్యపరిధినిబట్టి ఎప్పటికప్పుడు సిద్ధాంతాలు, తత్వాలు రూపొందుతాయి. ఏ సిద్ధాంతాలూ, తత్వాలూ పరమంకావు. విమర్శకు అతీతమున్నూ కావు.

మారుతున్న ప్రకృతి వాస్తవికత(objictive reality)నుంచే సిద్ధాంతాలూ, తత్వాలూ రూపొందుతున్నాయి. ప్రకృతి నిరంతర నిర్విరామ పరిణామంలో వున్నదనేది శాశ్వత వాస్తవికతేకాని, సిద్ధాంతంకాదు. కాగా, వాస్తవికత ఆధారంగా యేర్పడే సిద్ధాంతాలను పెరిగిన జ్ఞానపరిధికి అనుగుణంగా మార్చుకోవాలి. అంతేకాని, అసలు సిద్ధాంతాలు, తాత్విక దృక్పథాలే ఏర్పరచుకోకుంటే మానవ సామాజిక జీవనం వడిదుడుకులుకు లోనవుతుంది. నిజానికి, సిద్ధాంతాలన్నీ, తాత్విక వైఖరులన్నీ ఆయా సమయాలకు మనిషికి లభ్యమైన జ్ఞానం ఆధారంగా రూపుదిద్దుకొనేవే. అయితే, ఆ సిద్ధాంతాలు, తత్వాలు- ఏవీ వ్యవస్థీకృతం కారాదు. ఎదుగూ బొదుగూ లేని బండ సిద్ధాంతాలుగా, మొండి వైఖరులుగా మారరాదు. అలామారే వాటన్నిటినీ హేతువాదం తిరస్కరిస్తుంది.

"హేతువాది" పత్రిక మొట్టమొదట నే ఈ దృక్పథాన్ని చేపట్టింది. గత 25 సంవత్సరాలుగా అనేక సిద్ధాంత రాద్ధాంతాలను పట్టి చూచింది. ఇక ముందుకూడా అదే దృక్పథాన్ని అనుసరిస్తుంది.

****

ఐతే, సిద్ధాంతాలెందుకు వ్యవస్థీకృతమై మతాలుగా మారతాయి?

నిజానికి, ఆయా సిద్ధాంతాలేర్పరచుకున్న వారంతా ఎంతోకొంత మేధావివర్గానికి చెందినవారే. కాని, ఒకసారి ఒక నిర్ణయానికి వచ్చిన తరవాత ఆ నిర్ణయాన్ని మార్చుకోడానికి ఆయా మేధావులకు 'అహం' అడ్డు వస్తుంది. దాని చుట్టూ తాను పోగుచేసుకున్న 'మంద' వద్ద తన పరువుపోతుందనే పిరికితనం వెంటాడుతుంది. అందువల్ల, తనమందతో ముతా కట్టిన 'సిద్ధాంతి' మతనాయకుడుగా మారిపోతాడు. మతాలుగానీ, వాటి శాఖలుకానీ అలా యేర్పడ్డవే. అందువల్లనే అవి మొండి శిఖండులుగా మారిపోయాయి. అనుయాయులంతా విశ్వాసులుగాను, మతనాయకులంతా పరాన్నజీవులు(parasites)గాను మారిపోయారు. ఒకరిది భావదాస్యం, మరొకరిది భావనియంతృత్వం.

****

ఆధునిక విజ్ఞానం వంటి నిత్యసత్య సంశోధక మార్గం ఉనికిలోకి రాకముందు అలా జరిగిందటే, మనం అర్ధం చేసుకోవచ్చు. కానీ, ఆధునిక విజ్ఞాన యుగంలో కూడా అదేరీతిన ఆ మత విశ్వాసాలు కొనసాగడంలో, సమర్ధించడంలో అర్ధంలేదు.

ఎందుకంటే, విజ్ఞానశాస్త్రం విశ్వాసాలను నెలకొల్పదు. అంతకుముందటి నిర్ణయాలు తప్పని అనంతర పరిశోధనలవల్ల రుజువైతే, ఆ నిర్ణయాలను వదలుకోడానికీ, కొత్తనిర్ణయాలను ఆమోదించడానికీ శాస్త్రీయవిజ్ఞానం సర్వదా సంసిద్ధమే. విజ్ఞాన శాస్త్ర చరిత్రలో అలా యిప్పటికెన్నో సార్లు జరిగింది.

కాంతి, శబ్దం, విద్యుదయస్కాంత తరంగాలు ప్రయాణించడానికి ఈథర్ అనే మాధ్యమం అవసరమని, శాస్త్రజ్ఞులొకప్పుడు భావించారు. ప్రయోగాల అనంతరం అలాంటి మాధ్యమం (ఈథర్) లేదని తెలుసుకొని, ఆ భావాన్ని వదలుకున్నారు. పరమాణువు అభేద్యమని

శాస్త్రజ్ఞులొకప్పుడు సిద్ధాంతీకరించారు. ప్రయోగాల ద్వారా దాన్ని విడగొట్టడం సాధ్యంకావడంవల్ల, అది అభేద్యంకాదని తీర్మానించుకున్నారు. కుళ్లిన పదార్థాలనుంచి స్వచ్ఛందంగా కొత్తజీవులుత్పన్నమవతాయనే నమ్మకం ఒకప్పుడుంది. అలా స్వచ్ఛందంగా జీవులుత్పన్నంకావని పాశ్చర్ ప్రయోగాలు రుజువుచేసిన తరవాత ఆ నమ్మకాన్ని శాస్త్రజ్ఞులు వదలుకున్నారు. ఆధునిక విజ్ఞానం పాతనమ్మకాలను త్రోసివేస్తూ, కొత్తనిర్ణయాలను చేసుకుంటూ వచ్చిన ఘట్టాలు విజ్ఞానశాస్త్రచరిత్రలో చాలా వున్నాయి.ఐతే, ఏ మతమయినా ఇలా తన మౌలిక సూత్రాలను మార్చుకోవడం ఎన్నడయినా జరిగిందా? లేదు.

భూమిగోళమనీ, అదిగ్రహమనీ, అది తన చుట్టూ తాను రోజు కొకసారి తిరుగుతూ, సూర్యుడిచుట్టూ ఏడాదికొకసారి తిరుగుతున్నదనీ, చంద్రుడు ఉపగ్రహమనీ, అది భూమిచుట్టూ సుమారు 29 రోజులకొకసారి తిరుగుతున్నదనీ ఏ మత పవిత్ర గ్రంథంలోనైనా వుందా? "అదిగో అక్కడ వుంది, ఇక్కడవుంది" అని ఆదిమ భాషలకు కృత్రిమ వ్యాఖ్యానాలు చేస్తే,అది శాస్త్రీయ సత్యంకాదు. ఆధునిక శాస్త్ర విజ్ఞానం ఏదైనా ఒక కొత్త విషయాన్ని కనుగొన్నపుడు అది వేదాల్లోవున్నదని చూపడానికి ప్రయత్నించే కొత్త 'జాతి' ఒకటి ఒక శతాబ్దిగా ఈదేశంలో పనిచేస్తోంది. వేదాల్లో అన్నీవున్నాయిష అని వాగే కృత్రిమ పండితులు చంద్రుడు ప్రజాపతి మనసునుంచీ, సూర్యుడు అతని కళ్లనుంచీ పుట్టాయని చెప్పిన వేదమంత్రానికి ఏ కృత్రిమ అర్థాన్ని సాధిస్తారు? (చంద్రమా మనసో జాతశ్చక్షోసూర్యో అజాయత (రు 10-90-13)

ఒకాయన సూర్యశబ్దానికి 'కాంతి' అనే అర్థాన్ని యివ్వగా, ఇంకొకాయన సూర్యుడి వైశాల్యం, అది భూమికి వుండే దూరం, భూమి చుట్టూ అది తిరిగే వేగం లెక్కకట్టగా, ఇతరులు సూర్యుడి రథాశ్వాలకున్న పగ్గాలనే కాంతి అని వర్ణించి అవన్నీ వేదాల్లో వున్నాయని దస్తరాలపై దస్తరాలు రాస్తున్నారు. అయినా, కళ్లలో నుంచి కాంతిపుడుతుందా? అలాంటి వాటి బండారాన్ని బయటపెట్టడానికి మరోగ్రంథమే వ్రాయవలసి వస్తోంది.

అయితే, మతాలు కానీ, మత గ్రంథాలు కానీ అతి ప్రాచీనమైనవైనందువల్లనూ, అవి భారతీయ (హైందవ) సంస్కృతికి ప్రతిబింబాలు కావడంవల్లనూ పాశ్చాత్య సంస్కృతికి అలవాటు పడ్డ హేతువాదులు వాటిని విమర్శిస్తున్నారనే ప్రవాదం, దుర్వాదం ఒకటివుంది. మానవతకు దూరమైన వారే ఆ నిందలు వేస్తారు. నిజానికి, హేతువాదులు మానవవాదులేకాని, ఏజాతీయ వాదులూ కారు. సంస్కృతి అనేది మానవులకు చెందింది. అది నిత్యసంస్కరణ పొందాలి. కాని, హిందూసంస్కృతిపేరుతో కులాల కుళ్లును, మనుషులమధ్య ఉచ్చనీచతారతమ్యాలను నెలకొల్పి, ముదిబండ ఆచారసంప్రదాయాలను మనుషుల మెదళ్లలో దోపేది మానవసంస్కృతికాదు. కేవలం ప్రాచీనత కారణంగా హేతువాదులు దేన్నీ తిరస్కరించరు.

ప్రాచీనులెవరైనా మౌలిక సత్యాలు చెప్పివుంటే, వాటిని హేతువాదులు నిరాకరించరు. రెండువేల సంవత్సరాలకు పూర్వమే న్యాయ వైశేషిక సాంఖ్య దార్శనికులు కొన్ని మౌలిక సత్యాలను వెల్లడించారు. పదార్థాలు ఇంద్రియాలను తాకడం వల్ల జ్ఞానం ఉత్పన్నమవుతుందన్నారు. కార్యకారణాలు ద్రవ్య అంతర్గతమార్పులు తప్ప అన్యం కావన్నారు. లేనిదాని నుంచి ఏదీరాదన్నారు. ఉన్నదానికి మూలం దాని వెలుపలలేదు పొమ్మన్నారు. హేతువాద, నాస్తికదృక్పథాలకు భిన్నంగా ఇవిలేవు కాన, కేవలం పురాతనత్వకారణంగా హేతువాదులు వీటిని

నిరాకరించరు. కానీ, వాటికి అదనపు సమాచారాన్ని చేకూర్చి సమన్వయం సాధిస్తారు.

ఐదు భూతాల (నేల, నీరు, నిప్పు,గాలి,ఆకసం) కలయికగా "ప్రపంచాన్ని" మతవాదులు వర్ణించారు. వారుచెప్పిన వేవీ భూతాలు (మూలద్రవ్యాలు) కావు. అందులో మొదటినాలుగింటినీ మూలద్రవ్యాలుగా చార్వాకులు (నాటి నాస్తికులు) అంగీకరించారు. అంతమాత్రాన ఈనాటి హేతువాదులు, నాస్తికులు ఆ అసత్యాన్ని ఆమోదించే సమస్య తలెత్తదు. అంటే, సత్యాసత్యాలను అంగీకరించడంలో ప్రాచీనమా, అర్వాచీనమా అన్న ప్రశ్న హేతువాదులదికాదు. అంతా ప్రాచీనమైనది మాత్రమేకాక, అది తన సూత్రాలకు అనుగుణమైనదైతే తప్ప, ఏమతమూ సత్యాన్ని సత్యంగా ఆమోదించదు.

ఇదంతా ఎందుకు చెప్పుకోవలసివస్తున్నదంటే హేతువాదం ఒక ఊటబావి, తోడే నీరు తోడి పోస్తుంటే, కొత్తనీరు ఊరుతూనేవుంటుంది.

**"హేతువాది"** పత్రిక కూడా ఒక ఊట బావే. వ్రాయగలిగింది వ్రాస్తుంటే, వ్రాయవలసింది ఉబికివస్తూనే వుంటుంది. అందువల్ల **'హేతువాది'** రచయితలు కూడా ఊట బావులుగా, భావజల ధారలుగా మారాలి. రాసిందే రాయకుండా ఎప్పటి కప్పుడు కొత్త మౌలిక విషయాలను తమ రచనా వస్తువులుగా స్వీకరించాలి. అలా చేయగల కార్యకర్తలు, రచయితలు హేతువాద సంఘ జమీనులో చాలమంది ఉన్నారు.

ఇక్కడ నాకోచిన్న సంఘటన గుర్తుకు వస్తున్నది. హేతువాద సంఘస్థాపన ఆంధ్రలో జరిగిన తొలినాళ్లలో కూడా పలుచోట్ల అధ్యయన శిబిరాలు చాలా జరిగాయి. "హేతువాది" పత్రిక ప్రారంభమైన రెండేళ్లకు ఒక హేతువాద మిత్రుడు "హేతువాదంగురించి చాలా చెప్పాం కదా, ఇంకా చెప్పేదేముంది?" అని నాతో అన్నపుడు నాకు నవ్వువచ్చింది. "ఎంత ఆర్జించినా శాస్త్రజ్ఞానం ఇంకా పెరుగుతూనే వుంటుంది. దాన్ని హేతువాదానికి అన్వయించి యింకా యింకా చెప్పవలసింది మిగులుతూనే వుంటుంది" అన్నాను. ఆ అన్వయంతో ఈ 25 సంవత్సరాలనుంచి "హేతువాది" చెపుతూనే వుంది. అయినా, ఇంకా యింకా చెప్పవలసింది యెంతెంతోవుంది.

"మతంలేని శాస్త్రం కుంటిది, శాస్త్రంలేని మతం గుడ్డిది" అన్న ఐన్‌స్టీన్ వాక్యాన్ని ఉదహరించి "మరి, హేతువాదులు మతం వద్దంటారేమిటి?" అని 1981లో ఏలూరు బహిరంగ సభలో ఒక ప్రశ్న నా ముందుకు వచ్చింది. సమాధానం చెప్పాను. అది ఆధారంగా "హేతువాది" ప్రారంభసంచిక (సెప్టెంబరు 82)లో "ఐన్‌స్టీన్, మతం-దైవం" పై సుదీర్ఘ వ్యాసం వ్రాశాను. ఎంతో మంది మేధావుల మన్ననలందుకొన్న ఆ వ్యాసం తమకు కొరుకుడు పడలేదని నాతో చెప్పిన మిత్రులు కూడా వున్నారు. అయినా, అనంతరం "హేతువాది" ప్రచురిస్తూ వచ్చిన వ్యాసాలు కొంత జటిలత్వం తగ్గినా, ప్రధానంగా మౌలిక సమస్యలపై గురిపెట్టినవే.

హేతువాద దృక్పధానికీ, నిత్యాభివృద్ధి చెందుతున్న శాస్త్రవిజ్ఞానానికీ భిన్నమైన జడతత్వాలన్నిటినీ "హేతువాది" విమర్శించడమే కాక, వాటికి ప్రత్యామ్నాయాలను కూడా ప్రతిపాదిస్తూవస్తున్నది. "హేతువాది"లో ఏయే విధమైన రచనలు చోటుచేసుకున్నవో, వాటన్నిటినీ ఇక్కడ ఏకరువు పెట్టడం సాధ్యంకాదు. "హేతువాది"కి అనుబంధంగా బయలుదేరిన హేమా పబ్లికేషన్స్ జమీనులో యిప్పటికే 100 కు పైగా ప్రచురించబడ్డ గ్రంథాలే అందుకు సాక్ష్యం. కేవలం మూఢనమ్మకాలను మతాచారసంప్రదాయాలను, బాబాలను, అమ్మలను విమర్శించడం



ሀ

మాత్రమే హేతువాదమని భావించే వారి తీరుకు భిన్నంగా "హేతువాది" మానవుణ్ని మానసిక బానిసత్వానికి గురిచేస్తున్న మౌలిక వైఖరులన్నిటిమీదా తన విమర్శను కేంద్రీకరించింది. భావవిప్లవం ఏ మార్గంలో ప్రయాణం చేయాలో సూచించింది.

"హేతువాది" ద్వారా ఇప్పటి దాక జరిగిన కృషికి నేనెంతో సంతోషిస్తున్నాను ఈ కృషిలో సహకరించిన మిత్రులందరికీ కృతజ్ఞతలు వెల్లడిస్తున్నాను. ఐనా, ఇంకా నేను అసంతృప్తిగానే వున్నాను- అందుకు కారణం ఇంతకంటె ఎక్కువ కృషి చేయలేకపోవడమే. నిజానికి, ఈ సమాజంలో మనం ఎంత సాధించినా, ఇంకా సాధించవలసింది ఎంతో మిగిలిపోతుంది. అయినా మనమన పరిమితుల్లో చేయగలిగినంత చేయడం నియతధర్మంగా మనం ముందుకు సాగాలి. తృప్తి ఇంతటితో ఆగిపోడానికీ, అసంతృప్తి ముందుకు సాగడానికీ సూచకాలు. ఇంకా ఇంకా ముందుకు సంతోషంతో, సమధికోత్సాహంతో ముందుకు సాగడానికి మన అసంతృప్తి మనకు దోహదం చేయాలి.

హేతువాదులంతా జ్ఞాన ఊట బావులుగా, నిత్య భావజలధారలుగా మారాలి.

---

"అసత్యాలను వేటాడటం నా వృత్తి . ఇది మెప్పులేని వృత్తి. సత్యం అర్ధయుక్తమైనదైతే, దాన్ని యెవరో ఒకరు చెప్పాలికదా! సత్యాసత్య విచక్షణాజ్ఞానం నాకు అలవడిన నాటినుంచీ నేను అసత్యాలను వేటాడుతూనే ఉన్నాను. దానివలన నాకు పేరు ప్రతిష్టలు లభించలేదు... అయినా.

' నేను అసత్యాలను వేటాడుతూనే వుంటాను. అంత గొప్పవాడననుకోవడానికి కావలసిన విజ్ఞాన సౌష్ఠవం కూడా నాకు లేదు. అమాయకుల అజ్ఞానాన్ని దోపిడి చేయడం వల్లనూ, అహంకారాన్ని పెంచడంవల్లనూ ఈ దేశంలో నాయకత్వం సులభంగా దొరుకుతుంది. సహజంగా పలుకుబడి గలిగిన నాయకులంతా కపట నాయకులే. మామూలు ప్రజల అజ్ఞానాన్నీ, దురభిమానాన్నీ ఉపయోగించుకోవడం వల్ల తేలికగా పలుకుబడి వ్యాపిస్తుంది. తమ అనుచరులను మోసం చేయడం వల్ల వారు సులువుగా విజయం పొందుతారు. సంప్రదాయం అనుచరుల్ని తప్పుదారిన నడిపిస్తూనే వుంటుంది. గతం మీద విప్లవం తెస్తేనే తప్ప భవిష్యత్తును జయించలేము. అందువల్ల అభ్యుదయ కాముకులకు పేరు, ప్రతిష్టలు రావడం అసహజం. ఒకవేళ అలా పేరు ప్రతిష్ఠలు రావడం సంభవిస్తే, వారు దారి తప్పుతున్నారనే అనుకోవాలి"

**- MN Roy.**



5

**INTERNATIONAL HUMANIST AND ETHICAL UNION**
1 Gower Street, London WC1E 6HD , United Kingdom
Tel + 44 20 76313170, Fax + 44 20 76313171, Website : www.iheu.org

28 July 2007

**Sri Ravipudi Venkatadri**
Editor, Hetuvadi
Chirala 523155
India

Dear Sri Venkatadri garu,

I am writing to share my delight on the occasion of the 25th anniversary celebrations of Hetuvadi – the rationalist magazine which you founded and which under your stewardship has attained heights which have few parallels either in the breath of its contents, the depth and expansiveness of its vision or the incisiveness of its writing.

Through these years Hetuvadi kept alive the flame of rationalism and humanism through scholarly articles, trenchant criticism and constructive comment. It has also kindled the urge for rationalist action amongst readers and activists.

Hetuvadi is also the legacy of the rationalist and humanist movements that have been built around you and your colleagues and as a beneficiary myself of the writings in Hetuvadi, I would like to congratulate you and thank you for the dedication and unfailing commitment with which you and your readers have kept the flag of rationalism flying. On this occasion, it may be appropriate to remember the sterling contributions of several important Humanists like Sri Raja Reddy, Sri Bapa Rao, Sri. Jaya Prakash Narayana, Sri Basava Punna Rao, Sri Seetaramayya, Sri Gandhi, Sri Bheemanna, Sri Murahari Rao and all the friends at Inkolle who helped keep the magazine vibrant and alive by contributing articles, giving advertisements and donating their time and money.

It is my sincere hope that Hetuvadi will flourish and am sure it can, if robust systems are put in place for servicing subscribers and obtaining advertisements, which can guarantee a long life for the magazine.

I look forward to meeting you again soon, and to participating in the events in Inkolle in the second week of August.

With warm regards
**BABU GOGINENI**
International Director



ఏ

# జ్ఞాన జ్యోతి

'హేతువాది' ని చూడగానే కొందరికి కంపరం, కొందరికి మోదం, ఇంకొందరికి ఖేదం. పత్రిక పట్ల ఎవరి స్పందనలు ఎలాఉన్నా నిజాన్ని నిర్భీతిగా, నిర్భయంగా, నిక్కచ్చిగా వివరించటం 'హేతువాది' ప్రత్యేకత. పొగడ్తలకు పొంగటం, విమర్శలకు వెరవటం దాని నిఘంటువులోనే కనిపించదు.

సకల ఉద్యమాల స్వరూప, స్వభావాలు ఓకేరీతిగా వుండవు. ఉద్యమాలలో, స్వభావాలను బట్టి వాటివాటి కార్యాచరణను నిర్ధారించుకుంటారు. వ్యవస్థీకృత ఉద్యమాలన్నింటికీ విజ్ఞానం గరిపే పత్రికలే ఉండాలనే నియమమేమీలేదు. కొన్ని పత్రికలు ఉద్వేగ ప్రేరణ రీతివిలాకాగా, మరికొన్ని ప్రశాంతసాగరంలా విజ్ఞానాన్ని గరిపేవి.

ఆందోళనోద్యమ పత్రికలకు ఉద్వేగ ప్రేరణ ప్రధాన ఆశయం కాగా, సాంస్కృతిక - భావ విప్లవోద్యమ పత్రికల ధ్యేయం వివేకశోధన. కొన్ని భావోద్వేగాలకు ఉద్దేశించగా కొన్ని మనిషి అంతర్గత క్షాళనకు ఉద్దేశించినవి. విజ్ఞానాన్ని సహేతుక జీవనతత్వంగా అభివ్యక్తీకరించే పత్రికలు బహుఅరుదు.వాటికి పాఠకుల సంఖ్యా పలుచనే. ఆకర్షణ, రెచ్చగొట్టటం కన్నా ఆలోచింపచేసి మార్పుకు శ్రీకారం చుట్టాలనే తపన ఈ పత్రికల ధ్యేయం.

రెండవ కోవకు చెందినదే నేటికి 25 వసంతాలు అప్రతిహతంగా పూర్తిచేసుకున్న 'హేతువాది'. ఆధునిక విజ్ఞానశాస్త్రం-తత్వంల సమీకృతరూపమే 'హేతువాది'. ఆధునిక విజ్ఞానశాస్త్ర తాత్విక ఫలితాలను జీవనవిధానంగా రంగరించి, తత్వమంటే మేధావుల మదనం కాదని-విజ్ఞాన శాస్త్రమంటే సాంకేతికత కాదని-నీతి అంటే మత సంప్రదాయ నీతి కాదని- వాటన్నింటికీ సమూల భాష్యాన్ని అందిస్తున్న ధీరోధాత్తత 'హేతువాది' సొంతం. విశ్వతత్వం నుండి జీవతత్వం వరకు, జీవం, ఆత్మ, పరమాత్మ, శాస్త్రం-పురాణం, మతవాదం-లౌకికవాదం, నుండి నేటి సమకాలీన రాజకీయాలవరకు సహేతుక వివరణలనందించింది. మనుషులను మనుషులుగా మార్చాలనేది దాని తపన. వారి వ్యక్తిత్వాన్ని ఇనుమడింపజేసి సాధికారికతను చలాయించగలిగే వాతావరణ రూపకల్పనే దానిధ్యేయం. మనిషిని మానసిక బానిసత్వం నుండి విముక్తిచేసి తనకుతానే స్వామిననే స్థాయికి పెంచటమేదాని ఆరాటం. ఆధ్యాత్మిక స్వేచ్ఛావంతులైన పౌరులతో సమూల క్షాళన పొందిన లౌకికసమాజ నిర్మాణమే దాని ధ్యేయం. దాని లక్ష్యం మనిషి. దాని గమ్యం మనిషి. నేటి మతసంస్కృతి స్థానే మానవసంస్కృతిని స్థాపించటం దాని ధ్యేయం. దానికి ఆలంబన ఆధునిక విజ్ఞానశాస్త్రం. భావవిప్లవ సైనికులను రూపొందించటమే దాని ఆశయం. వ్యాపారదోరణికి ఆమడదూరంలో నిలిచి నిబద్ధతతో పనిచేయటం దాని ప్రత్యేకత.

1982లో జన్మించిన నాటి నుండి నేటి వరకూ-పవిత్రం, ప్రపంచానికే తలమానికమని ఊదర కొట్టుకుంటూ కాల్పనిక జగత్తులో సాగుతున్న హైందవ సంస్కృతిని

చీల్చి చెండాడి దాని అమానుష, అమానవీయ, అనైతిక సామాజికన్యాయ లుప్తమైన సామాజిక నిర్మాణాల నిజస్వరూపాన్ని బట్టబయలు చేసింది. ఒక్క హైందవాన్నే కాక ఇస్లాం, క్రైస్తవం, వేదాలు, పురాణాలవంటి అపౌరుషేయ గ్రంధాల అసంబద్ధతలను సాధికారికంగా వెల్లడి చేసి పాఠకులను విద్యావంతులను చేస్తున్నది. పవిత్రత పేరుతో ప్రవక్తలు-మతాధిపతులు, మహాత్యాల పేరుతో అమ్మలు, బాబాలు, సాధువులు, సన్యాసులు చేసే దౌష్ట్యాలను నిర్భీతిగా వెల్లడించగలిగింది 'హేతువాది' ఒక్కటే.

భారత సమాజంలోని మానసిక రుగ్మతలైన చేతబడి, బాణామతి, చిల్లంగి, మంత్రాలు, వాస్తువు, జ్యోతిషం, జాతకాలు, యోగం వంటి అశాస్త్రీయ అంశాలు-సామాజక రుగ్మతలైన అంటరానితనం, సతీసహగమనం, తలాక్ వంటి ఆమానుష అంశాలపై సాధికారిక విమర్శలనందించిన తెగువ 'హేతువాది'ది. జ్ఞానం- సత్యం- స్వేచ్ఛ- నీతి దాని క్రమబద్ధమైన నడక స్వభావం. ఒకే దారంలో ఇమిడే వివిధ పుష్పాలే దాని వివరణలు. పరస్పర వైరుధ్యంగాని, అస్పష్టతగాని, సందిగ్ధతగాని, దాని నిఘంటువులోనే లేదు. ఒకే పథం- ఒకేమాట- ఒకే వేగం - 'హేతువాది' జీవిత పయనం.

హేతువాద మానవవాదోద్యమాలకు ఊపిరి 'హేతువాది'. నేటి ఉద్యమకార్యకర్తలు, ఉపన్యాసకులు, రచయితలే దాని విజ్ఞానస్థాయికి ప్రతీకలు. ప్రపంచస్థాయి హేతువాద, మానవవాద భావనా పఠిమ మన కార్యకర్తలలో ఉందంటే అది 'హేతువాది' చలవే. ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యమ పటిష్టతకు 'హేతువాది' అందించిన విజ్ఞాన స్థాయే కారణమనేది అందరూ అంగీకరించవలసిన సత్యం.

పత్రికను 25 యేండ్ల క్రితం స్థాపించి అనేక కష్టనష్టాలనెదుర్కొంటూ గాడి తప్పకుండా నేటికీ పత్రికను నడిపిస్తున్న ఘనత నిస్సందేహంగా రావిపూడిదే. 'హేతువాది' రచనలలో 70% వెంకటాద్రిగారి వేనంటే అతిశయోక్తి కాదేమో! అద్వితీయ మేధోసంపత్తి, విస్తార విజ్ఞానం, అకుంఠిత దీక్ష, అసంఖ్యాకంగా గ్రంధ మదనం చేసిన వెంకటాద్రి సారధ్యమే 'హేతువాది' ఉచ్ఛస్థితికి కారణం. కొందరు సంపాదకులు కొన్ని సంచికలు అచ్చువేసేసరికే వారి బుర్రలు ఒట్టిపోయి చేతులెత్తేసిన సంగతులు చాలా విన్నాం. కాని వెంకటాద్రిది సజీవధార_ అదే 'హేతువాది'కి జీవగర్ర. వెంకటాద్రిగారి తరగని మేధో సంపత్తి 'హేతువాది' ప్రతిష్టను ఇతోధికంగా పెంచింది.

మేధస్సు ఒక పార్శ్వ మైతే నిర్వహణ మరో పార్శ్వం. ఆర్థికలేమితో పత్రికను నడపటం ఇంకా కష్టం. పత్రిక ముద్రణ, ఆర్థిక వనరుల సమీకరణ చాలాకాలం వెంకటాద్రిగారే సమకూర్చుకున్నా ఆయనకు సహాయకులుగానూ, పత్రిక మేనేజింగు ఎడిటర్లు గానూ పనిచేసిన అంచా బాపారావు, కీ.శే. ముప్పాళ్ళ బసవపున్నారావు- ప్రస్తుతం పనిచేస్తున్న మేదూరి సత్యనారాయణగార్ల కృషి చిరస్మరణీయమైనది. వారికి హృదయపూర్వక ధన్యవాదాలు.

పత్రికను ప్రారంభించిన తొలినాళ్ళలో సైకిలుపై ఊళ్ళు తిరిగి పత్రికను పరిచయంచేసి, చందాదారులను చేర్పించిన రావూరి అర్జునరావు, గోరంట్ల రాఘవయ్య ఇంకా అనేక అజ్ఞాత కార్యకర్తల కృషికి వందనాలు.

విభిన్న అంశాలపై నూతన విజ్ఞానంతో పత్రికలో నాటి నుండి నేటి వరకు విజ్ఞాన పంట పండిస్తున్న రచయితలు- ఉవన్యాసకుల కృషి మరువలేనిది. ఏలాంటి పారితోషికం లేకుండానే సమగ్ర రచనలు చేస్తున్న రచయితలు ఈ పత్రికకు కొండంత ఆస్థి. కేవలం ఆర్థిక సంమృద్ధి పత్రికను నడిపిస్తుందనే భావం అక్షరాలా తప్పని 'హేతువాది' నడకే నిరూపించింది. నిరంతరం అస్తు బిస్తు ఆర్థికవనరులతో నడవటం కూడా 'హేతువాది' ప్రత్యేకతే. 'హేతువాది' అనేక గ్రంథాలకు, రచయితలకు ఔత్సాహికులకు జన్మనిచ్చిందనటం అతిశయోక్తికాదు.

86 వసంతాలు నిండుతున్నా తరగని వన్నెతో రెండంచుల చురకత్తి లాంటి 'హేతువాది'ని నడుపుతున్నారు వెంకటాద్రి. ఆయన దీక్షను, ఉద్యమస్ఫూర్తిని మేళవించుకున్న యువకులు పత్రికానిర్వహణలో రాటుతేలినప్పుడే 'హేతువాది' వన్నె శాశ్వతమవుతుంది. ఆ దిశగా సాధికారికతను పెంచుకోవలసిన బాధ్యత ఉద్యమకారులదే. అది అత్యవసరం కూడా.

నేను అధ్యక్షులుగా వున్న కాలంలో భారత హేతువాదసంఘ వజ్రోత్సవాలు- 'హేతువాది' రజతోత్సవాలు జరుపుకోవటం మరువలేని మదురానుభూతి. 'హేతువాది' వజ్రోత్సవాలను కూడా చూడాలని నా ఆకాంక్ష.

'హేతువాది' రజతోత్సవాల సందర్భంగా సారధి వెంకటాద్రిగారికి, మేనేజింగ్ ఎడిటర్ మేడూరి సత్యనారాయణకు- అందరిపేర్లు ఉదహరించకపోయినా రచయితలు - దాతలు - చందాదారులు - ఉద్యమ అభిమానులందరికీ శుభాకాంక్షలు. ధన్యవాదాలు. ఇదే పంథాలో ద్విగుణీకృత వేగంతో భావితరాలను ఉద్యమ పరిధిలోకి చేర్చాలని దానికి 'హేతువాది' వాంధికావాలని ఆశిస్తున్నాను. పత్రిక ప్రారంభసంవత్సరాన్ని చూశాం. కాని దాని రెండవకొనను చూడకూడదని ఆకాంక్షిస్తూ...

నమస్సులతో

ఇంకొల్లు
1-8-2007

**కుర్రా హనుమంతరావు**, యం.ఏ., బి.ఇడి.
అధ్యక్షులు
భారత హేతువాదసంఘం, ఇంకొల్లు



9

# అభినందన

హేతువాద, మానవవాద ఉద్యమాలకు ఆంధ్రప్రదేశ్‌లో ఒక సైద్ధాంతిక వేదికగా నిలచి, 25 సంవత్సరాలుగా ప్రజల్లో చైతన్యాన్ని పెంచుతున్న 'హేతువాది'కి అభినందనలు. ఇతోధిక కృషితో భావవిప్లవ బావుటగా రాబోయే తరానికి కూడా హేతువాద చైతన్యాన్ని అందించాలని 'హేతువాది'ని మానవ వికాస వేదిక అభిలషిస్తున్నది.

అభినందనలతో

**బి. సాంబశివరావు**
ప్రధాన కార్యదర్శి,
**మానవ వికాస వేదిక.**

---

# "హేతువాది" వర్ధిల్లాలి

**ము**ప్పై ఏళ్ళ క్రితం మన రాష్ట్ర ప్రజల్లో హేతువాద చైతన్యాన్ని రగిలించిన 'చార్వాక' తర్వాత పుట్టింది 'హేతువాది'. 'చార్వాక' అందించిన హేతువాద జ్యోతినందుకొని ఈ 25 ఏళ్ళుగా ఎన్నో వ్యాసాలతో, విషయాలతో, ఆంధ్రప్రదేశమంతటా తన వెలుగుల్ని విరజిమ్మింది 'హేతువాది'. మత పునరుద్ధరణవాదం అన్ని వైపులనుండి ప్రపంచాన్ని చుట్టుబోతున్న ఈ క్లిష్ట సమయంలో 'హేతువాది' రజతోత్సవ సంబరాలు జరుపుకోవటం నాస్తిక, హేతువాద, మానవవాద ఉద్యమ పత్రికలకు గర్వకారణం. కష్టనష్టాలకోర్చి, ఖర్చులను తట్టుకొంటూ ఇంతకాలం ఒక ఉద్యమ పత్రిక నడపటమే ఒక అద్భుతం, ఒక ఆశ్చర్యం. ఇప్పుడు మన రాష్ట్రమంతటా భావవిప్లవ ప్రభంజనమవసరం. ఆ అవసరాన్ని తీర్చుతూ 'హేతువాది' మరింత ఉజ్వలంగా ముందుకు సాగాలని మనసారా కోరుతున్నాను.

**- యన్. విక్రమ్,**
ఎడిటర్, 'స్వేచ్ఛాలోచన'
(మావన వికాస మాస పత్రిక)



10

# అభినందనలు

మా గౌరవమిత్రులు, హేతువాద మహోపధ్యాయులు, రచయిత రావిపూడిగార్కి నమస్కరించి వ్రాయునది.

మన 'హేతువాది' 2007 ఆగస్టు 11,12 తేదీలలో రజతోత్సవాలు జరుపుకొనుచున్న సందర్భంగా ఆనందంతో నేను మీకు మన మిత్రులందరికి శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను. 1976లో చార్వాక 1981లో ఆగిపోయింది. తదుపరి "హేతువాదం" కనుమరుగైంది. 'హేతువాది' మాసపత్రికను ఎవ్వరి ప్రమేయం, ప్రోత్సాహం లేకుండా ప్రారంభించి నేటికి నిరాటంకంగా కొనసాగిస్తున్నారు. 267 సంచికలు పూర్తి చేసి 268వ సంచికను 'రజతోత్సవ' ప్రత్యేక సంచికగా తీసికొని వస్తున్నందులకు మరియొకసారి అభినందనలు.

హేతువాది ద్వారా సైద్ధాంతిక ఆలోచనావిధానాన్ని అనేక అంశాలను తెలుసుకున్నాను.

వినమ్రతతో

**టి. శ్రీరామమూర్తి**

మాజీ రాష్ట్ర అధ్యక్షులు, భారత నాస్తిక సమాజం

---

ప్రముఖ కవి

***డా॥ నాగభైరవ కోటేశ్వరరావు,*** డి.లిట్.,

# ఉద్యమాభినందనలు

శ్రీ రావిపూడి వెంకటాద్రిగారు కాకలుతీరిన హేతువాది. 86 సం॥ల వయస్సులోనే 20 సం॥ల యువకునిలా కృషి చేస్తున్న వెంకటాద్రిగారు ఆంధ్రదేశం గర్వించదగ్గ హేతువాద ఉద్యమ సారధి. హేతువాదాన్ని శాసించి, భాషించి, ఆచరించే రావిపూడివారి పట్ల నాకు అపారమైన గౌరవం. వేలాదిమందిని హేతువాదం పట్ల ఆకర్షితులను చేసి ఆ ఉద్యమానికి మూలస్థంబంగా నిలిచారు. పాతికేళ్లుగా తనచేతి మీదగా 'హేతువాది' పత్రికను అకుంఠితదీక్షతో, ఉద్యమస్ఫూర్తితో నడుపుతున్న వెంకటాద్రిగార్కి, ఉద్యమంలో భాగస్వాములైన మాష్టారు శిష్యులకు, ఉద్యమ అభిమానులకు నా అభినందనలు. రావిపూడివారి మానసపుత్రిక హేతువాదిపత్రిక వెండిపండుగ జరుపుకుంటున్న శుభతరుణంలో రజతోత్సవ శుభాకాంక్షలు.

– నాగభైరవ కోటేశ్వరరావు, హైదరాబాద్.

# సామాజిక పరివర్తనా ప్రస్థానంలో....

- అలూరు ప్రఫుల్ల చంద్ర

'హేతువాది'-శాస్త్ర, హేతువాద, మానవవాద రంగాలకు అంకితమైన శాస్త్రీయ పత్రిక. తెలుగులో హేతువాద, మానవవాదాలకు తాత్విక భూమికలను ఏర్పరచి ప్రచారం చేసిన ఏకైక పత్రిక. అంతే కాదు. హేతువాద-మానవవాద తాత్విక భూమికల అనువాదాలు చదివి విదేశాలలోని ఆయా రంగాల ప్రముఖుల ప్రశంసలు పొందిన పత్రిక. "కొన్ని పుస్తకాలను రుచిచూడాలి, కొన్నిటిని మింగాలి, కొన్నిటిని నమిలి జీర్ణం చేసుకోవాలి" అన్న బేకన్ మహాశయుడి ఉద్ఘాటనలో చివరి అంశానికి ప్రతీకగా నిలచిన పత్రిక 'హేతువాది'. అంతే కాదు, హేతువాదానికి-నాస్తిక, భౌతిక, అజ్ఞేయ-మొదలైన వాదాల భేదాలను సవివరంగా తెలిపింది 'హేతువాది'.

విజ్ఞాన శాస్త్ర గతిని మలుపు త్రిప్పిన శాస్త్రజ్ఞుల కృషిని- సంస్కరణలనే ఆచిరో ప్రాణంగా ఎంచి అందుకోసం ధనమాన ప్రాణాలను త్యాగం చేసిన వారి సంస్కరణాభిలాషను-

భావవిప్లవం కోసం కృషి చేసిన హేతువాద-మానవవాద నాస్తిక, భౌతికవాద రంగాలలోని ప్రముఖులపై, వారి రచనలపై ప్రత్యేక వ్యాసాలను-

హేతువాద-మానవవాద యుగకర్తల శతజయంతుల ప్రత్యేక సంచికలను ప్రచురించింది.

మత ఛాందసవాదాలకు ఎదురొడ్డి పోరాడుతూనే వుంది. శాస్త్ర ప్రయోజనాలను మతాలు వినియోగించుకొని, శాస్త్రాన్ని నిందిస్తుంటే శాస్త్ర తరపున హేతువాది తన పోరాటాన్ని నిరంతరం కొనసాగిస్తూనే వుంది. మతానికి - శాస్త్రానికి పోరాటం పాశ్చాత్య దేశాలతో ముగిసినా, ఇంకా ఇక్కడ ముగిసినట్లు లేదు. మతం ప్రచ్ఛన్న దాడులు చేస్తూనే వుంది. శాస్త్రం పైన ఆ దాడులను 'హేతువాది' ఎదుర్కొంటూనే ఉంది. అలాంటి పాత్రను తెలుగులో నిర్వహిస్తున్న పత్రిక బహుశ ఇదేనేమో.

సమాజంలో మూఢ నమ్మకాలు పెల్లుబికినప్పుదు వాటిని పోకార్చదానికై ప్రసిద్ధశాస్త్రజ్ఞుల వ్యాసాలను ప్రచురించింది. పరిశీలనా నివేదికలు ప్రచురిస్తుంది. ప్రజల వెన్నుతట్టి వారిని మూఢవిశ్వాసాల ముళ్ళబాటల నుండి నాగరికతా ప్రస్థానం వైపుకు మళ్ళాలని ప్రబోధిస్తూనే ఉంది.

జ్యోతిషం వాస్తులపై ప్రత్యేక సంచికలు వెలువరించింది. జ్యోతిషం వాస్తువులపై యుజిసి కోర్సులు ప్రారంభించాలని భావించకముందే, రాష్ట్రంలోని తెలుగు విశ్వవిద్యాలయంలో కోర్సుల ప్రారంభానికి నిరసన తెలిపిందది. ప్రభుత్వానికి ఇది మార్గం కాదని ఇవి అశాస్త్రీయ ధోరణులని సూచించింది. బహిరంగ లేఖలు వ్రాసింది.

కుల సంఘాలు, మత సంస్థలు, చివరకు ప్రభుత్వాలు సైతం లౌకికవాదాలకు తిలోదకాలిచ్చి అశాస్త్రీయ ధోరణులనుసరించినపుడు-మెదడు వాపు వ్యాధికి బెల్లడొనా వంటి రోగాలకు మందులనిచ్చే వైద్యులకు భూమి పంపిణీ (శాస్త్రీయమైనదని ఆ వైద్య విధానం బుజువు

కాకుండా), ప్రభుత్వ భవనాలలో వాస్తువుననుసరించడం, ప్రభుత్వ కార్యాక్రమాలలో మతధోరణి ననుసరించి పూజలు మొ॥ నిరసిస్తూనే ఉంది.

మత ఛాందసవాదాలకు ఎదురొడ్డి నిలచి హేతువాద మానవవాద భావాలను ప్రతిధ్వనించిన అనేక మంది రచయితలు, ఉద్యమకారులు, లౌకికవాదులు ఆయా ప్రభుత్వాల రాజ్యహింసకు బలైనప్పుడు వారికి అండదండగా నిలబడింది. వారికి సంఘీభావం తెలిపింది. ఆయా ప్రభుత్వాలకు నిరసనను తెలిపింది.

లౌకిక వాదానికి సదా తన తోడ్పాటు నందిస్తూనే వుంది. సమాజంలో, ప్రభుత్వాలలో, దేశాలలో ఎక్కడ అలౌకిక ధోరణులు పెచ్చరిల్లినా నిరసిస్తూనే వుంది.

హేతువాద మానవవాద రంగాలలో పరభాషలలో ప్రసిద్ధుల రచనలు, అనువాదాలను ప్రచురిస్తోంది. శాస్త్ర సాంకేతిక రంగాలలోని అద్భుత ఆవిష్కారాలను ప్రజలకు అందిస్తూనే వుంది. వాటిని తాత్వికపరంగా వాఖ్యానిస్తూనే వుంది. ఆ క్రమంలో క్లోనింగ్, జెనెటిక్ ఇంజనీరింగ్, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బయోటెక్నాలజీ వంటి నవీన అవిష్కారాల వివరాలను తన పాఠకుల కందించింది.

ఐక్య రాజ్యసమితి, యునెస్కో, అంతర్జాతీయ మానవవాద నైతిక సంఘంవంటి అంతర్జాతీయ నైతిక సంఘాలు బాలలపైన మహిళలపైన,వృద్ధులపైన, మనవ హక్కులపైన ప్రచురించిన ప్రసిద్ధ నివేదకలను ప్రచురించింది. ఆయా నివేదికలు, డిక్లరేషన్ పొందుపరచడంలో తన వంతు కృషిని కొనసాగించింది.

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘానికి, భారత హేతువాద సంఘానికి అనధికారకంగానే అధికారిక ప్రతికగా తన సేవలందించింది. పై సంస్థల ద్వైవార్షిక మహాసభలకు, ప్రత్యేక పరిస్థితులలోను, భారత మానవ సంఘానికి - దాని ద్వైవార్షిక మహాసభలలోను, అంతర్జాతీయ మానవవాద నైతిక సంఘం 14వ కాంగ్రెసు ముంబాయిలో జరిగినప్పుడు ప్రత్యేక సంచికలను వెలువరించింది. ఒక రకంగా చెప్పాలంటే భారతదేశంలోని హేతువాద మానవవాదోద్యమాలకు నిలువెత్తు దర్పణంలా నిలచిందీ పత్రిక.

ఎన్నో రకాల వాదాలకు-వేదికగా నిలచింది. కళలు, మత సంస్థలు, హక్కులు, మత సాహిత్యం వంటి విషయాలపై ఆరోగ్యకరము-ఆలోచనాయుతమైన చర్చలు నిర్వహించింది.

మతగ్రంథాలైన భగవద్గీత, ఖురాన్, బైబిలు వంటి మూల గ్రంథాలపై విస్తారమైన సాహిత్యాన్ని సృష్టించింది. మత ఛాందసవాదంపై తన ధిక్కార స్వరాన్ని సాగిస్తూనే వుంది. సమాజ వక్రతలను సదా సవరిస్తూనే ఉంది.

ఇంత చేసినా ప్రతి సంచిక వెలువరించడానికి 'పురిటినొప్పులు' పడుతూనే వుంది. పత్రికకు నిజానికి నిధి లేదు. పాఠకుల, అభిమానుల, ఉద్యమకారుల తోడ్పాటుతోనో, లేదా ప్రధాన సంపాదకుడి గ్రంథ రచన మీద వస్తున్న కొద్దిపాటి ఆదాయంతోనో పత్రిక కోసం ఓ నిధిని ఏర్పాటు చేద్దామన్న కల కలగానే మిగిలింది. ఆర్థికబాధలు మాత్రం పత్రికను వీడలేదు. దానికి తోడు రచనల కొరత కూడా ఉద్యమాలకు సంబంధించిన ప్రత్యేక పత్రిక కావడంతో ఆ తరహాలోను, ఆ స్థాయిలోనూ వ్యాసాలను సేకరించడం ఇబ్బందికరంగానే వుంది. దానికి తోడు



15

పత్రిక తన ఆర్థిక బాధల దృష్ట్యా పారితోషికాల నివ్వలేని స్థితిలో వుంది.

అయినా, పత్రిక ఏనాడూ తన నిబద్ధతను కోల్పోలేదు. ఆరంభంలో ఏ విలువలకు కొలమానాలకు అంకితమైందో ఆ పథం వీడలేదు. వ్యతిరేక పరిస్థితులెదురైనప్పుడల్లా విజయం సాధిస్తూనే వుంది. నిజానికి పత్రికా నిర్వహణలో పేర్లు ఎన్ని ఉన్నప్పటికీ, ప్రధాన సంపాదకుడే పూర్తి బాధ్యత వహించవలసి వస్తున్నది.

అయితే ఇన్ని ఈతి బాధలెదురవుతున్నా, పత్రిక తన పథం మారలేదనీ, వీడబోదని చెప్పడానికి ప్రధాన సంపాదకుడు తన మిత్రుడికి వ్రాసిన ఈ లేఖ ఓ మంచి సాక్ష్యం (ఒక సహ ఉద్యమకారుడు లేవనెత్తిన అనేక అంశాలకు పత్రిక నిర్వహణ, పత్రిక పాలసీలకు సంబంధించి జవాబుగా అప్పుడు పత్రిక నిర్వహణా బాధ్యత వహిస్తున్న ఓ మిత్రుడికి వ్రాసినదీ లేఖ)

**RAVIPUDI VENKATADRI**
Editor : Hetuvadi
Dear Praphulla,

I started Hetuvadi to enlighten primarily 'our' people and secondarily others on our stand of Rationalism and Humanism; It definitely means that the stand is dictated to me by my underslanding of Rationalism and Humanism. I am not a kid not to know what is inimical to rationalism and humanism, I don't compromise with anything that is contradictory to my philosophical understanding and the resultant practices. I am not a politician to make feats on compromises. I know with whom to co-operate and on what to do so. I wish that Hetuvadi shall not undermine my attitude. since I know well that Tenali People are capable of doing justice to my wish. I placed the burden of carrying out Hutuvadi on your shoulders. And I am glad you are doing it upto my expectations.

But in the event it is run against my stand-the stand with which I am convinced as Rationalist and Humanist- I am ready to transfer the ownership and editorship to whomsoever the present E.C. of A.P.R.A asks me to do so. Also I have no objection to keep myself aloof from our organisations and their responsibilities. in such a situaton. Our people must be able to judge things for them selves and take correct decisions as to what to do and what not to do. We must not defer from the right path.

Hetuvadi's aim is purposive and not propagandist. The

purpose is educationg and enlightening. Nothing bash should be published in it. I am confident that everone of my article is self contained and self explanatory. Nobady can raise theortical questions or objections on them. Some may differ with my conclusion, and in fact the religionists too. And many others who do not contribute to our ideas do differ. Dealing with those differences is often the theme of my articles; if more explanation is felt required, I may be asked to give. But Iam not to be expected to answer all fool's and foolish questions. As Mr. Bondi has remarked a fool can ask more questions than a to be reminded of my lapses which I will attend to and answer if I feel necessary.

You can deal with theoritical questions. You can re-direct such letters to me which you don't want to comment upon. But please don't send such letters as would contain only bash. Just don't publish bash and rubbish.

I have several times made it clear that, the secondary aim of Hetuvadi is also to guard our friends from being tempted by delusory things and it is a part of enlightnmant.

I hope you will correctly understand me.

Don't publish what deserves a place in waste-basket.

you are free to discuss the contents of this letter with friends.

Let us not hasten to find a place in fools' paradise:

ఇలాంటి నిబద్ధతలో సాగుతున్న ఈ పత్రిక సామాజిక పరివర్తనా ప్రస్థానంలో, హేతువాద-మానవవాద ఉద్యమ ప్రస్థానంలో 267 సంచికలను వెలువరించి నేడు 268వ సంచికను రజతోత్సవ సంచికగా వెలువరించ బోతున్నది.

ఈ ప్రస్థానంలో ఇంతవరకు తమ సహాయ సహకారాలు అందించిన రచయితలు, ఉద్యమకార్యకర్తలు, హేతువాదులు, శ్రేయోభిలాషులు పాఠకులందరికి వినయంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నది.

అలానే ఆర్థికంగా సహాయపడిన దాతలు, వ్యాపార ప్రకటనలందించి పత్రికకు ఆర్థికంగా సహాయపడిన పలు సంస్థలు, పత్రిక మీద అభిమానంతో ఆధికంగా సహాయపడిన అనేక మంది ప్రవాసాంధ్రులు అందరికీ కృతజ్ఞతలు.

ఇక ముందు కూడా ఇదే విధమైన సహాయ సహకారాలందించి సామాజిక పరివర్తనా ప్రస్థానంలోను, ఉద్యమ ప్రస్థానంలోను పత్రిక మరింత నీటుగా తన కృషిని కొనసాగించేటట్లు సర్ణోత్సవాలవైపు ప్రయాణించేందుకు తోడ్పడతారని ఆశిస్తూ... - అలూరు ప్రఫుల్ల చంద్ర



15

# రజతోత్సవ "హేతువాది"

-పియస్సార్

కష్టమైన నేమి కల్ల చెప్పనటంచు
హితుడు తప్పకుండ హితము చెప్పు
పరుదు స్వార్థపరుడు మెఱ మెచ్చులను బల్క
గొంకడింతయేని కుప్పుస్వామి — కవిరాజు త్రిపురనేని రామస్వామి

"హేతువాది" మాస పత్రిక రజతోత్సవం జరుపుకోవడం భావవిప్లవాన్ని కాంక్షించే అభ్యుదయ వాదులందరూ గర్వించదగిన విషయం. ఏ పత్రికనైనా ప్రారంభించడం చాలా తేలిక. క్రమం తప్పకుండా పత్రికను విడుదల చెయ్యడం మాత్రం కష్టం. నిరంతరాయంగా పత్రికను వెలువరించడంలో వున్న యిబ్బందులు స్వయంగా అనుభవించిన వారికే తప్ప యితరులకు తెలియవు. అందునా, పత్రికలలో వ్యాపార ధోరణి బాగా పెరిగిపోయిన ఈ రోజుల్లో లాభాలమాట అటుంచి నష్టాలను భరిస్తూ పత్రికను వెలువరించడమంటే కత్తిమీద సామే అవుతుంది. సమాజ హితాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రజలలో వున్న అజ్ఞానపు చీకట్లను తొలగించి, మౌఢ్యపు గొలుసులలో బందీలుగా వున్న వారి బంధనాలను తెంచేందుకు, వారిలో వైజ్ఞానిక ధృక్పథాన్ని పెంచి భావ విప్లవ బాటలో పయనింపజేసేందుకు తాను పట్టిన దీక్షను ఏనాడూ విడవకుండా "హేతువాది" పాతికేళ్ళను పూర్తిచేసుకోవడం చరిత్రలో లిఖించదగిన అంశం.

"హేతువాది" మాసపత్రిక 1982 సెప్టెంబరులో పుట్టింది. ఒకనాడు ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘంలో జరిగిన పరిణామాల కారణంగా ఒక చారిత్రక అవసరంగా హేతువాది పుట్టింది. వేల సంవత్సరాలుగా సమాజంలో పాతుకు పోయిన అశాస్త్రీయ భావాలను, మత మౌఢ్యాన్ని, మూఢ విశ్వాసాలను, స్వర్గనరకాలను, దేవుళ్ళు-దెయ్యాలు, బాబాలు-అమ్మలు, మంత్రతంత్రాలను తూర్పారబట్టడానికి, వారిలో శాస్త్రీయ దృక్పథాన్ని పెంచేందుకు, హేతువాద ఉద్యమపరంగా కార్యకర్తలకు, అభిమానులకు సైద్ధాంతిక దిశానిర్దేశం చేసేందుకు భావవిప్లవం లక్ష్యంతో ఈ పత్రికను ప్రారంభించి ఇన్నేళ్ళపాటు నిరంతరాయంగా వెలువరించిన ఘనత యాజమాన్య-సంపాదకీయ బాధ్యతలు మోస్తున్న **రావిపూడి వెంకటాద్రిదే**. మధ్యలో కొందరు హేతువాద మిత్రులు పత్రిక బాధ్యతను పంచుకున్నప్పటికీ, వెంకటాద్రిగారు తన బిడ్డలకన్నా పత్రికపైనే ఎక్కువ శ్రద్ధ చూపారనడం అతిశయోక్తి కాదేమో! "హేతువాది" పత్రిక పాతికేళ్ళ ప్రస్థానం గురించి చెప్పుకునే ముందు పత్రికలూ వాటి తీరుతెన్నుల గురించి, హేతువాది ప్రారంభానికి దారితీసిన పరిస్థితుల గురించి, ఉద్యమపరంగా "హేతువాది" నిర్వహించిన పాత్ర గురించి తెలుసుకుందాం.

ఆర్థికంగా ఎన్ని కష్టాలెదురైనప్పటికీ భారత హేతువాద సంఘానికి అనుబంధంగా పనిచేస్తున్న ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం పక్షాన 1982 సెప్టెంబరులో ప్రారంభమైన "హేతువాది" మాసపత్రిక నేటికీ నిరంతరాయంగా వెలువడటం సామాన్య విషయం కాదు. బహుశా "హేతువాది" తలకెత్తుకున్న లక్ష్యాలను బోలిన లక్ష్యాలతో నడిచే ఏ పత్రికా యింతటి ఘనత సాధించలేదు. ఈ సందర్భంగా హేతువాది ప్రారంభానికి దారితీసిన పరిస్థితులను

ఒకసారి మననం చేసుకుందాం.

భావప్రచారానికి సాహిత్యం ఒక మంచి ఆయుధం. సాహిత్యం పుస్తక రూపంలో గాని లేదా పత్రికరూపంలో గాని వెలువడవచ్చు. పుస్తక రూపంలో సాహిత్య సృష్టి చెయ్యాలంటే ఆ పనికి పూనుకునే వ్యక్తి తానెంచుకున్న అంశానికి సంబంధించి లోతైన అధ్యయనం చేస్తే తప్ప ఆ పనికి న్యాయం చెయ్యలేడు. ఒక్కోసారి ఆ పని ఒకే వ్యక్తివల్ల కాకపోతే ఒకరిద్దరితో కలిసి ఆ పని చేయగలుగుతాడు తప్ప ఎక్కువమంది భాగస్వాములై ఒక పుస్తకాన్ని తీసుకురావడం కష్టసాధ్యమైన పని. కాని, పత్రిక ద్వారా పుస్తక రూపంలో కన్నా ఎక్కువ సమాచారాన్ని విభిన్న కోణాలనుండి తీసుకెళ్లడం సాధ్యమవుతుంది. దీనికి ప్రధాన కారణం పత్రిక సంపాదకత్వ బాధ్యతలు వహించే వ్యక్తి ఆలోచనలు, భావాలు, లక్ష్యాలతో ఏకీభవించే ఎవరైనా ఆ పత్రికద్వారా తమ భావాలను, ఆశయాలను వ్యాప్తి చెయ్యడానికి అవకాశం ఉండటమే. ఫలితంగా, లెక్కకు మించిన వ్యక్తులు వివిధ అంశాలపై రాసిన వ్యాసాలను పత్రికద్వారా పాఠకులకు అందించవచ్చు.

గతంలో వచ్చిన సాహిత్యాన్ని పరిశీలిస్తే సమాజ అభ్యుదయానికి దోహదపడే సాహిత్యం అతి తక్కువనే చెప్పాలి. పత్రికలు కూడా దీనికి మినహాయింపు కాదు. హేతువాద, నాస్తిక, మానవాద సంఘాల లక్ష్యాలకు అనుగుణంగా తెలుగునాట కనిపించే సాహిత్యగ్రంథంగా **స్వామినేని ముద్దు నరసింహం** వ్రాసిన 'హితసూచని'ని చెప్పుకోవచ్చు. ఆ గ్రంథం ముద్దు నరసింహం మరణించిన ఆరేళ్ళకు 1862లో వెలువడింది. పూర్తిగా కాకపోయినా, ఆ దిశలో నడిచిన తొలిపత్రిక కందుకూరి వీరేశలింగం సారథ్యంలో రాజమండ్రి కేంద్రంగా 1874లో ప్రారంభమైన 'వివేకవర్ధని'. కేవలం హేతువాద, నాస్తిక భావజాలానికి కట్టుబడి పత్రికను నడపడం ఆంధ్రప్రదేశ్‌లో చార్వాక పత్రికలోనే ప్రారంభమైంది. 1940లో ముదునూరులో గోరా స్థాపించిన నాస్తిక కేంద్రం, 1943లో రావిపూడి వెంకటాద్రి తన స్వగ్రామం నాగండ్లలో మిత్రుల సహకారంతో కవిరాజు త్రిపురనేని స్మారక చిహ్నంగా స్థాపించిన **కవిరాజాశ్రమం** అప్పట్లో పరిమితంగానే తమ ప్రభావం చూపాయి. అప్పటికి నాస్తికత్వం, హేతువాదం పేరుమీద జిల్లాసంఘాలు కాని, రాష్ట్రసంఘం కాని లేవు. అలాంటి భావాలున్న వారు అనేకులున్నప్పటికీ స్వాతంత్ర్య పోరాట ఉధృతిలో వారంతా వివిధ రాజకీయ పార్టీలలో చేరి హేతువాద, నాస్తిక భావాలకు పెద్దగా ప్రాధాన్యత యివ్వనందున ఉద్యమరూపం దాల్చడానికి చాలా కాలం పట్టింది.

ఈ స్థితిలో 1949లో మద్రాసులో ఏర్పడిన భారత హేతువాద సంఘం ఆధ్వర్యాన శ్రీలంక హేతువాద సంఘ అధ్యక్షుడు **ఏ.టి.కోవూరు** 1975 నుంచి 1977 వరకు ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య పట్టణాలలో జరిపిన పర్యటనలు ఈ భావజాలం వున్నవారిలో ఉత్తేజాన్ని నింపాయి. బాబాలు, అమ్మలు చూపే మహత్యాలలోని గుట్టును వెల్లడి చేయడమే గాక ఆయన చేసిన మతవిమర్శ తెలుగునాట అలజడి రేపింది. ఏ.టి.కోవూరు ప్రభావంతోనే 1976లో తోటకూర వెంకటేశ్వర్లు సారథ్యాన విజయవాడ కేంద్రంగా "చార్వాక" పత్రిక ప్రారంభమైంది. అదే ఊపులో అనేక గ్రామాలు, పట్టణాలు, నగరాలలో స్థానిక హేతువాద సంఘాల స్థాపన జరిగింది. 'చార్వాక' పత్రిక అనతికాలంలోనే రాష్ట్రంలోని నలుమూలలకు చొచ్చుకుపోయి విశేష ఆదరణ పొందింది. అంతేకాక, ఆ పత్రిక ఆధ్వర్యంలో జరిగిన అధ్యయన తరగతులు

రాష్ట్రవ్యాప్తంగా వున్న కార్యకర్తల సమీకరణకు దోహదపడ్డాయి. ఫలితంగా, 1979లో భారత హేతువాద సంఘానికి అనుబంధంగా ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం ఆవిర్భవించి ఏలూరులో ప్రథమ మహాసభలు జరుపుకుంది.

1981లో ఎస్.వి.రావు ఆధ్వర్యాన నరసరావుపేట నుంచి "హేతువాదం" పత్రిక వెలువడటం ప్రారంభించింది. 1982లో ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘంలో చీలిక వచ్చి ఎస్.వి.రావు, కత్తి పద్మారావు, ఈశ్వర ప్రభు వంటి కొందరు వేరే రాష్ట్ర సంఘం స్థాపించుకోవడంతో రావిపూడి వెంకటాద్రి తన అధ్యక్షతన కొనసాగుతున్న ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘానికి దిశా నిర్దేశం చేయడానికి ఒక సొంత పత్రిక అవసరమని భావించి 1982 సెప్టెంబరులో **"హేతువాది"** పత్రికను ప్రారంభించారు. సంఘ ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రంగా ఉండటం, రాష్ట్రసంఘం ఏర్పడిన రెండు మూడేళ్లకే సంఘంలో చీలిక ఏర్పడి కార్యకర్తలు కూడా గ్రూపులుగా చీలిపోయే పరిస్థితి ఏర్పడటంతో సంఘంనుంచి ఏ రకమైన అండదండలు లభించకపోయినప్పటికీ రావిపూడి వెంకటాద్రి స్వీయభారం వహించి పత్రిక నిర్వహణకు పూనుకున్నారు.

హేతువాద, నాస్తిక ఉద్యమాల మీద అభిమానం వున్నవారు హేతువాద సంఘంలోని చీలిక పట్ల విచారం వ్యక్తం చేస్తుంటారు. ఆయాసంఘాల ధ్యేయం నాస్తికత్వము, హేతువాదమే అయినప్పుడు వాటిలో చీలికలెందుకొచ్చాయని కాస్త బాధతో కొందరు, ఎగతాళి చేద్దామనే ఉద్దేశ్యంతో మరికొందరు అప్పుడప్పుడు ప్రశ్నిస్తూ వుంటారు. నాస్తిక సంఘాల ప్రస్తావన ఇక్కడ అనవసరం కనుక హేతువాద సంఘంలో చీలిక ఎందుకొచ్చిందన్నది యిక్కడ చెప్పుకోవడం అవసరం. 1979 జనవరి 21న మద్రాసులో జరిగిన సినీనటి హలం వివాహాన్ని రావిపూడి వెంకటాద్రి నిర్వహించారు. ఆనాడు ఆయన ప్రసంగాన్ని విన్న భారత హేతువాద సంఘ ప్రధాన కార్యదర్శి, మన తెలుగువాడు అయిన **అత్తలూరి సూర్యనారాయణ** వెంకటాద్రిని తన యింటికి పిలిచి ఆంధ్రప్రదేశ్‌లో హేతువాద సంఘాన్ని స్థాపిస్తానని, దానికి రాష్ట్రసంఘ అధ్యక్ష బాధ్యతలు తీసుకోవాలని ప్రతిపాదించారు. దానికి వెంకటాద్రి తాను స్వేచ్ఛావాదినని, తాను నమ్మిన భావాలలో స్పష్టత వ్యక్తం చేయడంకోసం ఎంతటివారినైనా విమర్శించే అలవాటు వున్నవాడినని సంఘాల పేరుతో ఉండే నియమ నిబంధనలకు లోబడి పనిచేయడం తనవల్లకాదని ఆ ప్రతిపాదనను తిరస్కరించారు. కాని, ఆ తర్వాత ఆయన సన్నిహితులైన **ఎమ్.వి.రామమూర్తి** గారి ఒత్తిడితో రాష్ట్రసంఘానికి అధ్యక్షులుగా వుండటానికి అంగీకరించారు. అంతకుముందు రాష్ట్రస్థాయిలో హేతువాద సంఘం లేకపోయినా హేతువాదం, నాస్తికత్వం, మానవవాదం కోణాలనుంచి అప్పటికే ఆయన 11 పుస్తకాలు రాసి వున్నారు. 1975-77 సంవత్సరాల మధ్య ఏ.టి.కోవూరు జరిపిన పర్యటనల ఫలితంగానూ, చార్వాక పత్రిక రాష్ట్రం నలుమూలలకు చేరిన ఫలితంగానూ, బాబాలను-అమ్మలను తిరస్కరించేవారు, దైవంపట్ల, మతంపట్ల నమ్మకం లేనివారు ఎందరో హేతువాదం గొడుగునీడన చేరారు. ఏ రాజకీయ పార్టీతోను సంబంధం లేనివారు, వివిధ రాజకీయ పార్టీలలో సభ్యత్వం వున్నవారు ఈ భావాలకు ఆకర్షితులై హేతువాద సంఘంలో చేరినట్లే స్వతహాగా మతంపట్ల, దైవంపట్ల నమ్మకంలేని కమ్యూనిస్టులు కూడా ఉత్సాహంగా హేతువాద సంఘంలోకి వచ్చారు.

రావిపూడి వెంకటాద్రి రాష్ట్ర హేతువాద సంఘ అధ్యక్ష బాధ్యతలు స్వీకరించిన తర్వాత తాను స్వయంగా రాసి 1981లో ప్రచురించిన "భావ విప్లవం - వర్గ చైతన్యం", "మార్క్సిస్టు వాస్తవికత" పుస్తకాలను చూసి మార్క్సిజం పట్ల విశ్వాసం వున్న హేతువాదులు జీర్ణించుకోలేక పోయారు. అంతకు కొద్దికాలం ముందే రంగనాయకమ్మ హేతువాద, నాస్తిక వాదాలను విమర్శిస్తూ, మార్క్సిజాన్ని సమర్థిస్తూ 3 పుస్తకాలు వ్రాయడం జరిగింది. వాటిపై స్పందించిన బి.రామకృష్ణ, సి.వి. మార్క్సిస్టు కోణంనుంచే నాస్తిక హేతువాదాలను సమర్థిస్తూ పుస్తకాలు రాసారు. ఈ నేపథ్యంలో మార్క్సిజంపై కఠిన విమర్శతో వెంకటాద్రి పుస్తకాలు రాయడం జీర్ణించుకోలేని రాష్ట్ర కార్యవర్గంలోని మార్క్సిస్టు అభిమాన హేతువాద నాయకులు, వారిని అభిమానించే మార్క్సిస్టు - నాన్‌మార్క్సిస్టు కార్యకర్తలు వెంకటాద్రి తీరును విమర్శించారు. దానికి, వెంకటాద్రి ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం పుట్టకముందే తాను మార్క్సిజాన్ని విమర్శించి వున్నానని, తన విమర్శకు ఎవరైనా సమాధానం రాయవచ్చని, మార్క్సిజాన్ని విమర్శించరాదని పరిమితులు విధిస్తే హేతువాదులకు మతగ్రంథాలను విమర్శించే హక్కు కూడా లేనట్లేనని సమాధానమిచ్చారు. అలా వెంకటాద్రిపై మొదలైన వ్యతిరేకత కారణంగా హేతువాదుల్లో చీలిక వచ్చి 1982 జూన్ నాటికి చీలికవర్గం వేరే రాష్ట్ర సంఘాన్ని ఏర్పాటు చేసుకోవడం జరిగింది.

ఈ సందర్భంగా యిక్కడ ఒక విషయం చెప్పుకోవాలి. 2001లో తెలుగు అకాడమి, హైదరాబాదువారు "ఆంధ్రప్రదేశ్‌లో హేతువాద మానవవాద ఉద్యమాల చరిత్ర" రాయమని వెంకటాద్రిగారిని కోరినపుడు వయోభారం రీత్యా ఆ పనిని ఆయన ఒక్కరే చేయలేక నన్నుకూడా సహరచయితగా ఆయన తీసుకోవడం జరిగింది. ఆ క్రమంలో హేతువాద, నాస్తిక, మానవవాద ఉద్యమాల్లో పనిచేసిన పలువురు ప్రముఖులనుండి, ఆయా సంస్థలనుండి వ్యక్తిగత వివరాలను, సంఘ కార్యకలాపాల సంక్షిప్త చరిత్రను పంపమని కోరడం జరిగింది. హేతువాద సంఘం చీలిక సమయంలో అవలి పక్షాన చేరిన ప్రముఖుల్లో ఒకరైన 93 యేళ్ల ఈశ్వర ప్రభును వ్యక్తిగతంగా ఇంటర్వూ చేయడానికి నేను, తోటకూర వెంకటేశ్వర్లు, ఎమ్.బసవపున్నారావు కలసి ఆయన యింటికి వెళ్లడం జరిగింది. తాను బాల్యంనుంచీ ఏరకంగా నాస్తిక భావాలకు లోనయిందీ వివరించి, హేతువాద సంఘంలో తాను చేసిన కృషిని మననం చేసుకుంటూ చాలాసేపు మాతో ముచ్చటించిన ఈశ్వరప్రభు 1982లో ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘంలో వచ్చిన చీలిక గురించి ప్రస్తావిస్తూ కొంత విషాదానికి లోనయ్యారు. 1982లో సంఘంలో చీలిక వచ్చినప్పుడు, ఆ వర్గానికి తాత్కాలిక అధ్యక్షుడిగా ఈశ్వరప్రభునే ఎన్నుకున్నారు. ఆనాటి సంఘటనలను గుర్తు చేసుకుంటూ హేతువాద సంఘంలో చీలిక రావడానికి తనూ కారకుణ్నేనని, అది చీలిక వాదులంతా చేసిన ఒక చారిత్రక తప్పిదమనీ ఆయన బాధపడ్డారు. అంతేకాక, చీలిక అనంతరం చీలికవర్గంలో ప్రధానపాత్ర పోషించి ఆ తర్వాత కొద్దికాలానికే హేతువాద సంఘాన్ని వీడి యితర ఉద్యమాలలోకి పోయిన ఒక ప్రముఖుడి మాటలు నమ్మి తామంతా మోసపోయామనీ, ఆ వ్యక్తి వెంకటాద్రితో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలను మాకు చూపకుండా ఆయనపై లేనిపోని కల్పిత విషయాలు చెప్పగా, అవి నిజమేనని నమ్మి వెంకటాద్రిగారికి వ్యతిరేకంగా యితరులతో చేతులు కలిపామని, ఉద్యమాన్ని చీల్చినా దాన్ని పటిష్ఠం

చేయలేకపోయామని, తప్పు తెలుసుకున్నా యిప్పుడు మళ్లీ ఏకమయ్యే పరిస్థితి లేదని ఆవేదన వ్యక్తం చేశారు.

నిజానికి, కమ్యూనిస్టు నాయకత్వాలు దైవానికి, మతానికి వ్యతిరేకులమని చెప్పడమే తప్ప భారతదేశంలో గాని, ఇతర దేశాల్లో గాని ఆ పార్టీ నాయకశ్రేణి నాస్తిక, హేతువాద, మానవవాద ఉద్యమాల్లో ప్రత్యక్షంగా పనిచేసిన చరిత్ర వాటికి లేదు. సిద్ధాంత రీత్యా వారు నాస్తికత్వాన్ని అంగీకరించినట్లు కనిపించినా, వారి ప్రథమ ప్రాధాన్యత రాజకీయాధికారమే. ఓటు బ్యాంకు రాజకీయాలపై వున్న ఆసక్తి కారణంగానే కమ్యూనిస్టులు జనాభాలో మెజారిటీగా వున్న ఓటర్లను దూరం చేసుకోవడం ఇష్టంలేక నాస్తిక-హేతువాద ఉద్యమాలకు దూరంగా వుంటున్నారు. పైగా కార్మిక వర్గ నియంతృత్వం పేరుతో స్వేచ్ఛను వ్యతిరేకించే మార్క్సిజం మానవవాద లక్ష్యాలకోసం కృషిచేసే సంఘాలతో కలసి పనిచేస్తుందనుకోవడం భ్రమే. మానవ విలువలకు, మానవవాదానికి స్వేచ్ఛే ప్రాణం. ఈ అవగాహన లేకనే మార్క్సిస్టు అనుకూలుర వెంట వెళ్లిన కార్యకర్తలు వేరుకుంపటి పెట్టినా దాన్ని బలోపేతం చెయ్యలేక పశ్చాత్తాపానికి లోనయ్యారు. మొత్తం మీద కొందరి అహేతుక, కుటిల్వ వైఖరి కారణంగా ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘంలో వచ్చిన చీలికవల్ల కొద్దిమంది కార్యకర్తలు నిస్తేజానికి గురైన కారణంగాను, చీలికవర్గం వెంట నడిచిన మరికొందరు దాని కార్యకలాపాలు క్రమేపీ తగ్గుముఖం పట్టిన కారణంగాను ఉద్యమానికి దూరమయ్యారు. హేతువాద ఉద్యమం ఉచ్ఛస్థితిలో వున్న రోజుల్లో వచ్చిన చీలికవల్ల ఎంతో కొంత హాని జరిగిందని అంగీకరించక తప్పదు.

1981లో "హేతువాదం" పత్రిక నరసరావుపేట నుండి విడుదలయ్యే నాటికే తెలుగునాట సంచలనం రేపిన "చార్వాక" పత్రిక ఆగిపోయింది. చీలిక అనంతరం వెంకటాద్రి ప్రారంభించిన "హేతువాది" మాసపత్రికకు 'చార్వాక' పేరు పెట్టాలన్న ఆలోచనతో తోటకూర వెంకటేశ్వర్లు అనుమతి కోరగా ఆయన సమ్మతించినప్పటికీ కొన్ని కారణాలవల్ల అది వెంటనే వీలుపడలేదు. అనంతరం అది 'హేతువాది'గానే కొనసాగింది. చార్వాక పత్రిక సామాన్య పాఠకుడిని ఆకట్టుకున్న రీతిలో 'హేతువాది' ఆకట్టుకోలేకపోయినమాట నిజమే. చార్వాక పత్రిక సుమారు 5 సంవత్సరాలు విడుదల కాగా దాదాపు అందులోని ప్రతి సంచికలోను నాస్తికత్వం, బాబాలు-అమ్మలపై వ్యాసం లేకుండా విడుదల కాలేదు. ఆ రోజుల్లో ఏ.టి.కోవూరు జరిపిన పర్యటనల ప్రభావం పత్రికా నిర్వాహకులమీద, వ్యాసకర్తలమీద, పాఠకులమీద ఎక్కువగా వుండటమే దానికి కారణం కావచ్చు.

'హేతువాది' చార్వాక పత్రికకు భిన్నంగా కనిపించే వ్యాసాలతో వెలువడటం ప్రారంభించింది. హేతువాదమంటే కేవలం దేవుళ్లను, మతాలను, బాబాలను, అమ్మలను, మూఢనమ్మకాలను విమర్శిస్తూ కూర్చోవడమే కాదన్న భావంతో భిన్న కోణాల నుండి సైద్ధాంతిక వ్యాసాల ప్రచురణకు పూనుకుంది. సంపాదక స్థానంలో వున్న రావిపూడి జ్ఞానస్థాయి సామాన్య పాఠకుడికన్న చాలా అధికం కావడంతో ఆయన వ్యాసాలు ఒకటికి రెండుసార్లు చదివినా కొరుకుడు పడటం లేదన్న ఫిర్యాదు కొందరినుండి వచ్చింది. ఇతరుల వ్యాసాలను ప్రచురించే సందర్భంలో కూడా ఆయన ఎంపిక ఇతర పత్రికలకన్న భిన్నంగా వుండటంతో ఈ తరహా ఇతర పత్రికలతో పోల్చి చూస్తే సైద్ధాంతిక విశ్లేషణలపై ఎక్కువ దృష్టి కనిపిస్తుంది. అలాగని, పత్రికలోని అన్ని



౨౦

సాలూ కఠిన భాషతో వుండవు. చర్చించే విషయాన్ని బట్టి దాని తీరు వుంటుంది. రావిపూడి భాషలో కఠినత్వం వున్నా లోతైన విశ్లేషణ అందులో కనిపిస్తుంది. ఆయన భాషలో విషయపరమైన కఠినత్వమే కనిపిస్తుంది తప్ప పాఠకుడిని గందరగోళపరిచే మార్మికభాష గాని, కుతర్కం గాని వుండవని ఖచ్చితంగా చెప్పవచ్చు. అందుకే, "హేతువాది" మేధావుల మన్నన చూరగొంది. పత్రిక నిర్వాహకులపై గౌరవం పెంచింది. ఆర్థిక ఒడుదొడుకులు ఎదుర్కొన్నా, ఆ భారాన్ని కొందరు స్వచ్ఛందంగా ముందుకొచ్చి భరించేలా దాతల్ని ఆకట్టుకుంది.

దేవుడు లేడని, మత గ్రంథాలన్నీ పుక్కిటి పురాణాలనీ, అన్నీ వేదాలలోనే వున్నాయనే భావన తప్పనీ ప్రకటించడం చాలా తేలిక. కానీ వాటిలో ప్రవేశం వున్న వారు తటస్థిస్తే చర్చించి వాటిని ఎందుకు తిరస్కరించాలో తన వాదన విన్పించాలంటే తప్పనిసరిగా ఆయా విషయాలలో లోతైన ప్రవేశం వుండి తీరాలి. వాటిలో వున్నదేమిటో, అవి ఎలా సమర్థనీయం కావో, విజ్ఞాన శాస్త్రంతో అవి ఎక్కడ విభేదిస్తున్నాయో యిలాంటి వుద్యమాల్లో పనిచేసే వారికి తెలిసివుండాలి. హేతువాద నాస్తిక ఉద్యమాల్లో పనిచేసే కార్యకర్తలందరికీ ఈ విషయాల మూలాల గురించి అవగాహన వుండక పోవచ్చు. లేదా, వాటికి సంబంధించిన సాహిత్యం ఆమూలాగ్రం చదివి అర్థం చేసుకొనే స్థాయి, తీరిక వారికి లేకపోవచ్చు. అందువల్ల, మత గ్రంథాలతో పాటు ఆధునిక విజ్ఞాన శాస్త్రంతో పరిచయం వున్నవారు వాటి గురించి వ్రాసే వ్యాసాలకు 'హేతువాది' తగినంత స్థానం యిచ్చింది.

ఈ విశ్వం ఎలా ఉనికిలోకి వచ్చిందన్న ప్రశ్న వేల సంవత్సరాలుగా మనిషిని పీడిస్తూనే వుంది. దానికి సమాధానంగా మతం దేవుణ్ని చూపెట్టింది. ఆ ప్రతిపాదనను తిరస్కరించాలంటే మతగ్రంథాల పరిచయంతోపాటు విశ్వావిర్భావం గురించి, విశ్వపరిణామం గురించి, విశ్వతత్వం గురించి కొంత పరిజ్ఞానం కూడా అవసరం. అందువల్లే, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం తొలినుంచి విశ్వతత్వాన్ని పాఠకుల అవగాహనలోకి తీసుకురావడానికి కృషి చేస్తూనే వుంది. హేతువాది పత్రిక ప్రారంభానికి ముందే రావిపూడి చార్వాక పత్రికలో కూడా విశ్వతత్వంపై సీరియల్‌గా వ్రాయడం జరిగింది.

శాస్త్రవిజ్ఞానం గురించి, ప్రకృతి పరిణామం గురించి, జీవావిర్భావం గురించి, జీవ పరిణామం గురించి కొన్ని వ్యాసాలు హేతువాదిలో ధారావాహికంగా వచ్చాయి. జీవం ఎలా పుట్టింది? విత్తు ముందా? చెట్టు ముందా? లాంటి క్లిష్టమైన అంశాలపై కూడా పాఠకుల అవగాహన పెంచేందుకు కృషిచేసింది.

మూఢ నమ్మకాలను వ్యతిరేకించే వారు నాస్తిక, హేతువాదుల్లోనే కాక ఆస్తికులలోను కన్పిస్తుంటారు. ఏవి మూఢ నమ్మకాలనే విషయం దగ్గరకొచ్చేసరికి వారిలో కొంత వైరుధ్యం కనిపిస్తుంది. ప్రభుత్వం దృష్టికి బాణామతి ఒక్కటే మూఢ నమ్మకంగా కనిపిస్తుంది తప్ప జ్యోతిషం, వాస్తు వంటివి మూఢ నమ్మకాలుగా కన్పించవు. ఏ శాస్త్రీయ పునాదీ లేని వీటిని యూనివర్శిటీల్లో బోధనాంశాలుగా చేయడం మనందరికీ తెలుసు. సమాజంలో పలురకాల మూఢ నమ్మకాలున్నప్పటికీ ఏవి మూఢనమ్మకాలు? ఏవి కావు? అనే దాని మీద బోలెడు గందరగోళం

వుంది. పచ్చ కామెర్లు వస్తే చేతిమీద వాతలు పెట్టించుకునే వారు, ఉబ్బసానికి చేపమం[illegible] మింగేవారిలో కూడా యితరత్రా జబ్బులు వస్తే ఆధునిక వైద్యాన్ని ఆశ్రయించే వారే ఎక్కు[illegible] వుంటారు. తమలో వున్న మౌఢ్యాన్ని గుర్తించడానికి కూడా ఒక స్థాయి వివేకం కావాలి. నిజాని[illegible] హేతువాదమంటే వివేక వాదమే. కొంతమంది హేతువాదాన్ని వ్యతిరేక వాదంగానూ, తర్కవాదంగానూ వ్యాఖ్యానిస్తూ వుంటారు. మెజారిటీ అభిప్రాయాలను వ్యతిరేకించడం లేదా తర్కించడం హేతువాదుల ఉద్దేశ్యం కాదు. ప్రజలలో వున్న భావాలు, విశ్వాసాలు శాస్త్రీయ పరిశీలనకు నిలవనివైతే హేతువాదులు తాము మైనారిటీలుగా ఉన్నా వాటిని వ్యతిరేకించడానికి వెనుకాడరు. అంత మాత్రాన, హేతువాదమంటే వ్యతిరేకవాదం అవదు. అలాగే, మరికొందరు హేతువాదమంటే తర్కమే తప్ప మరొకటి కాదని వక్కాణిస్తూ వుంటారు. హేతువాదమంటే కేవలం తర్కం కాదు. హేతువాదమంటే వివేక వాదమని చెప్పుకుంటున్నామంటే హేతువాదులు ఏదైనా విషయం మీద తర్కించినా వివేకం పునాదిగా వుంటుందని గమనించాలి. కేవలం తర్కాన్నే ఆయుధంగా తీసుకున్న వారు తప్పని సరిగా వివేక వాదులై వుంటారన్న హామీ లేదు. కేవల తర్కాన్ని ఆయుధంగా స్వీకరించినవారు కావాలనే తప్పుడు ప్రాతిపదికల ఆధారంగా కుతర్కానికి దిగే అవకాశముంది. దీనికి వివేకం ప్రాతిపదిగా ఉండదు. అందువల్లనే, మౌఢ్యమంటే ఏమిటో దానిని తొలగించాలంటే మనిషి ఏరకంగా వివేకవంతుడిగా మారాలో, అలా మారడం కోసం అతడిలో అవగాహన పెంచేందుకు ఏ రకమైన రచనలు అవసరమో గుర్తించి హేతువాది వాటికి ప్రాధాన్యత యిస్తూనే వస్తోంది.

హేతువాదం, నాస్తికత్వం అనే మాటలను చాలామంది వాడుతున్నారు. కాని, వాటిని వివరించమంటే తడబడేవారి సంఖ్య తక్కువేమీ కాదు. హేతువాదానికి, నాస్తికత్వానికి తాత్విక పరిపుష్టి కలిగించడానికి తొలిసారిగా పెద్దపీట వేసిన పత్రిక "హేతువాది" మాత్రమే. ఈ లక్ష్యాల కోసం కృషి చేసే యితర సంఘాలున్నప్పటికీ అవి నడిపే పత్రికల్లో కాని, వెలువరించిన సాహిత్యంలోకాని హేతువాదాన్ని, నాస్తికత్వాన్ని సైద్ధాంతిక కోణం నుంచి చర్చించిన సందర్భాలు బహు తక్కువ. పేరు ప్రతిష్టలు గడించిన నాస్తికులు, హేతువాదులు అహేతుక పోకడలు పోయినా, రచనలు చేసినా 'హేతువాది' పత్రిక సంపాదకుడు రావిపూడి వెంకటాద్రి వాటిని ఖండించడానికి, లోపాలను ఎత్తి చూపి వివరణ యివ్వడానికి సైద్ధాంతిక స్పష్టత చేకూర్చడానికి పత్రిక ద్వారానూ, పుస్తకాల రూపంలోనూ కృషి చేశారు. నిజానికి ఈ అంశాల మీద వెంకటాద్రి వెలువరించినంత సాహిత్యాన్ని బహుశా మరే భాషలోను ఎవరూ తీసుకురాలేదని చెప్పవచ్చు.

హేతువాదానికి లక్ష్యమేమిటని అడిగేవారు కనిపిస్తుంటారు. దాని లక్ష్యం భావ విప్లవం. భావ విప్లవం అంటే ఏమిటని ప్రశ్నించే వారు కూడా వున్నారు. ప్రజలంతా శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించగలిగి స్వేచ్ఛాపూర్వక మానసిక స్థితిలో వివేకవంతమైన నిర్ణయాలు తీసుకోగలగడమే గాక దానికనుగుణంగా తన నడతను మార్చుకొని, సమాజగతిని తీర్చిదిద్దుకోగలిగే రీతిన మానసికంగా ఎదగడమే. అలా ఎదిగితే వుపయోగమేమిటన్న ప్రశ్న మళ్ళీ వుండనే వుంది. ఆ స్థాయికి ఎదిగిన వ్యక్తి తప్పనిసరిగా తనకు, తన కుటుంబానికి, తాను భాగంగా వున్న సమాజానికి ఏది హితమో గుర్తించగలుగుతాడు. మెరుగైన, సబబైన నిర్ణయాలు తీసుకోగలుగుతాడు. ఈ

క్రమంలో అతడు కులం, వర్గం, మతం, దైవం వంటి సంకెళ్ళను తెంచుకొని మనిషిని మనిషిగా చూడగలుగుతాడు. ఫలితంగా మానవుడు కేంద్రంగా జీవన విలువలను రూపొందించుకోవడానికి కృషి చేస్తాడు. ఆ కృషిలో భాగంగా సమాజంలో వున్న దైవిక విలువలను తోసివేస్తాడు. అంటే అవాస్తవాల ప్రాతి పదిక మీద ఏర్పడిన విలువల స్థానే వాస్తవాల ప్రాతి పదిక మీద విలువల నిర్మాణం జరుగుతుంది. తద్వారా విశ్వమానవ భావన పరిఢవిల్లుతుంది. దీన్నే మానవ వాదం అనవచ్చు. హేతువాదానికి అంతిమ లక్ష్యమైన మానవ వాదం గురించి పాఠకులలో అవగాహన కలిగించేందుకు 'హేతువాది' తొలినుంచీ ఆ తరహా రచనలకు పెద్దపీట వేస్తూనే వుంది.

'హేతువాది' తన-మన పక్షపాతం లేకుండా విమర్శనీయాంశాలు ఎవరు ఏ వాదం పేరుతో ప్రకటించినా గత పాతికేళ్ళుగా స్పందిస్తూనే వుంది. హేతువాద వుద్యమానికి గాని, 'హేతువాది' పత్రికకు గాని స్పృశించకూడని అంశాలు లేవు. మానవజాతి గౌరవానికి, హుందా తనానికి, స్వేచ్ఛకి భంగకరంగా కనిపించిన ప్రతి అంశాన్ని అది తడుముతూనే వస్తోంది. ఆ క్రమంలో ఎన్నెన్నో వాదాలను, సిద్ధాంతాలను, అంశాలను ఈ పాతికేళ్ళ ప్రస్థానంలో హేతువాది స్పృశించింది. లౌకిక వాదం, రాజకీయాలు, పార్టీ స్వామ్యం మొదలైన అంశాలపై కూడా చర్చ జరపడమే గాక కాలానుగుణంగా తలెత్తే సమస్యలను కూడా హేతువాది ఎత్తి చూపి వాటికి పరిష్కారాలను ప్రతిపాదించింది. ఈ రకమైన కృషితో భావ విప్లవోద్యమానికి, నూతన సాంస్కృతిక విప్లవోద్యమానికి అనుగుణమైన భావ వికాసాన్ని పాఠకుల్లో కలిగించడమే ధ్యేయంగా 'హేతువాది' ముందుకు సాగుతోంది. భౌతిక వాస్తవిక వాదాన్ని వారిలో పాదుకొల్పేందుకు తనవంతు కృషిని కొనసాగిస్తోంది. ఇదంతా సత్యనిష్టతో ఉద్యమకారుల భావాలలో స్పష్టత నింపడం కోసమే చేస్తూ వుంది. దానికి మనసా, వాచా, కర్మణా కట్టుబడి 'హేతువాది' సంపాదక వర్గం కృషిచేస్తున్నందునే హేతువాదమంటే కేవలం మతాన్ని, దైవాన్ని తిరస్కరించడమే అన్న అపోహను 'హేతువాది' పోగొట్టగల్గింది.

తొలినుంచి ఆర్థిక యిబ్బందులను ఎదుర్కొంటున్నప్పటికీ ఆయా సందర్భాలలో ప్రత్యేక సంచికల రూపంలో 'హేతువాది' ఎక్కువ పేజీలతో వెలువడింది. వాటి వివరాలు దిగువ చూడవచ్చు.

| | | |
|---|---|---|
| 1983 ఏప్రియల్ | - | డార్విన్ శత వర్ధంతి ప్రత్యేక సంచికగా వెలువడింది. |
| 1986 జనవరి | - | కవిరాజు త్రిపురనేని రామస్వామి శత జయంతి ప్రత్యేక సంచికగా వెలువడింది. |
| 1986 డిసెంబరు | - | జ్యోతిష్యంలోని అశాస్త్రీయతను వెలికి చూపిన ప్రత్యేక సంచికగా వెలువడింది. |
| 1992 జనవరి | - | ప్రత్యేక వ్యాసాలతో కూడిన 100వ సంచికగా వెలువడింది. |
| 2000 జనవరి | - | సహస్రాబ్ది ప్రారంభ సంచికగా భారతదేశ చరిత్రను, విజ్ఞాన శాస్త్రాన్ని మలుపుతిప్పిన ప్రముఖులపై ప్రత్యేక సంచికగా వెలువడింది. |

2001 జూన్ సంచిక - ప్రత్యేక వ్యాసాలతో కూడిన 200వ సంచికగా వెలువడింది.

ఇవికాక క్రమం తప్పకుండా ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం ద్వైవార్షిక రాష్ట్ర సభలు నిర్వహిస్తున్న సందర్భాలలోను ఎక్కువ వ్యాసాలతో పత్రిక వెలువడింది. పలు అంశాలమీద 'హేతువాది' లో ధారావాహికంగా వెలువడిన వ్యాసాలు తదనంతరం పుస్తకరూపంలో వెలువడ్డాయి. రాష్ట్రసంఘం, స్థానిక శాఖలు జరిపిన సభలు, సమావేశాల వివరాలను పాఠకుల దృష్టికి ఎప్పటికప్పుడు తీసుకువచ్చింది. అన్నిటికి మించి ఈ భావజాలం వున్న కార్యకర్తల మధ్య సాన్నిహిత్యం, సంఘీభావం ఏర్పడడానికి చేసిన కృషికి వెలకట్టలేము.

తెలుగునాట నాస్తిక, హేతువాద, మానవవాద లక్ష్యాల సాధనకోసం ప్రారంభించక పోయినా కొన్ని పత్రికలు ఆ లక్ష్యాల సాధనకోసం ఉపకరించే వ్యాసాలను ప్రచురించిన చరిత్ర గతంలో వుంది. అంతేగాక కేవలం ఈ లక్ష్యాల సాధనకోసం కృషిచేసిన పత్రికలు కూడా మరికొన్ని వున్నాయి. అవి దీర్ఘకాలం వెలువడకపోయినా, ఆ రోజుల్లో సమాజగతిని మార్చడానికి తమవంతు కృషిచేసాయి. మానవహితాన్ని ఆశించి మౌఢ్యంపై పోరాడే వ్యక్తులు చరిత్ర పొడవునా దర్శనమిస్తూనే వుంటారు. ఆ భావజాలం నిరంతరాయంగా సమాజంలో కొనసాగుతున్నందునే తరువాతి తరాలు దాన్ని అందిపుచ్చుకోగలుగుతున్నాయి.

దీర్ఘకాలంపాటు 'హేతువాది' నిరంతరాయంగా వెలువడినా మధ్యలో ఆరోగ్యకారణాల వల్లా, ఆర్థిక కారణాలవల్లా ప్రధాన సంపాదకుడైన వెంకటాద్రి పత్రికను వెలువరించడానికి అశక్తులైన స్థితిలో ఆ బాధ్యతను భుజానికెత్తుకున్న హేతువాద మిత్రులు కూడా చాలమంది వున్నారు. తొలినుంచి చీరాల నుండి వెలువడిన 'హేతువాది' 1996 డిసెంబరు నుండి 1999 ఆగస్టు వరకు **ఎమ్.బసవపున్నారావు** మేనేజింగు ఎడిటర్‌గా, ఎ.ప్రఫుల్లచంద్ర సహకారంతో తెనాలినుండి వెలువడింది. తిరిగి 1999 సెప్టెంబరు నుండి 2002 ఫిబ్రవరి వరకు **అంచా బాపారావు** మేనేజరు ఎడిటర్‌గా చీరాలనుంచే వెలువడింది. 2002 మార్చినుంచి ఈ రజతోత్సవ సంచిక వరకు రాష్ట్ర హేతువాద సంఘ ప్రధాన కార్యదర్శి **మేడూరి సత్యనారాయణ** మేనేజింగు ఎడిటర్‌గా, ఇంకొల్లు రాడికల్ హ్యూమనిస్టు సెంటర్ కార్యవర్గ సభ్యుల సహకారంతో వెలువడుతోంది. పత్రికకు మధ్యలో కొన్నాళ్ళపాటు సంపాదకవర్గ సభ్యులుగా **ఎమ్. బసవపున్నారావు, జి.వీరన్న, కె.హరిబాబు, పి.సుబ్బరాజు, ఎ.ప్రఫుల్లచంద్ర** తమ సేవలందించారు. తాత్కాలిక బాధ్యతలు ఎవరు తీసుకున్నా, పత్రిక ఎక్కడనుంచి వెలువడినా ప్రధాన సంపాదకుడి హోదాలో **రావిపూడి వెంకటాద్రి** కొనసాగడం వల్లనే పత్రిక స్థాయి, స్వరూపం మారకుండా వెలువడుతోంది.

ఆర్థిక యిబ్బందుల కారణంగా పత్రిక ఆగిపోయే పరిస్థితి ఎదురైనప్పుడల్లా అనేకమంది విరాళాల రూపంలో ఆదుకున్నారు. వారిలో **కోటపాటి మురహరిరావు**-హైదరాబాదు, **ఆరమళ్ళ పూర్ణచంద్ర**-అమెరికా, **నర్రాకోటయ్య**-హైదరాబాదు, **రావూరి అర్జునరావు**-గుడివాడ, **అంచా బాపారావు**-చీరాల, **గురిజాల సీతారామయ్య**-తెనాలి, **బి.కృష్ణమూర్తి**-బెంగుళూరు, **కరణం రవీంద్రబాబు**-బాపట్ల, **జె.రంగారావు**-చోడవరం(విశాఖ), **చుండూరి వెంకటేశ్వర్లు**-చీరాల, **ఎమ్.బసవపున్నారావు**-తెనాలి, **డి.చంద్రశేఖర్ రెడ్డి**-తిరుపతి, **ఎస్.జయరామిరెడ్డి**-అనంతపురం, **గుత్తా రాధాకృష్ణ**-ఖమ్మం, **డా॥భానుప్రసాద్**-భద్రాచలం, **జి.రాధారాణి**-హైదరాబాదు, **ఎమ్.చంద్రశేఖర్**-హైదరాబాదు, **రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్**, **ఇంకొల్లు మిత్రులు** ముఖ్యులు.

ఇందరి సహకారంతో "హేతువాది" రజతోత్సవం జరుపుకోవడం వుద్యమకారులందరికీ ఆనందదాయకం. ప్రజల భావాలలో మార్పురానిదే సమాజంలో పరివర్తన సాధ్యం కాదన్న ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ నిశ్చితాభిప్రాయానికి అనుగుణంగా వెంకటాద్రి సారథ్యంలోని 'హేతువాది' యిప్పటికీ నడవడానికి కారణం ఉద్యమకారుల తోడ్పాటే. సమాజంలో మనం ఆశించిన పరివర్తన రావడానికి చాలాకాలం పట్టవచ్చు. అయినా, మన భావాలకు సంబంధించిన గొలుసుకట్టు తెగకుండా భావితరాలకు దిశానిర్దేశం చేయడానికి మనుషులుగా మన కృషిని కొనసాగించవలసిందే. దీన్ని అందిపుచ్చుకొని ముందుకు సాగవలసిన బాధ్యత ప్రగతి కాముకులు అందరిపైన వుంది. అందులో భాగంగా ఇప్పటికైనా పత్రికకు ఆర్థిక పరిపుష్టిని కలుగజేసుకోవడం తక్షణ అవసరం. అందుకు వదాన్యులు ముందుకు వచ్చి సహకరిస్తే 'హేతువాది' యిదే ఊపుతో, యిదే స్ఫూర్తితో మరికొన్నాళ్లపాటు నిరంతరాయంగా వెలువడుతుంది. భావితరాలను వెలుగుబాటలో నడిపించడానికి తనవంతు కృషిని కొనసాగిస్తుంది. దానికి మనమంతా కంకణబద్ధులమై ముందుకు సాగాల్సిన తరుణమిదే.

పత్రికొక్కట్టున్న పదివేల సైన్యము - పత్రికొక్కటున్న మిత్రకోటి
ప్రజకు రక్షలేదు పత్రికలేకున్న - నవయుగాల బాట నార్లమాట !

---

The religious belief.. has for the believers an element of absolute truth; it is a standard by which they stand or fall, and to abandon it is dishonour and sin... The man of science regards even his best theory as a make - shift thing to help him on his way, and is always on the look-out for some-thing better and more comprehensive.

**- E.N.da C, Andrade : The mechanisim of Nature.**

We cannot logically prove the existence of the external world, and more than you can logically prove that I am talking with you nor that I am here. But you know that I am here and no subjective idealist can persuade you to the contrary.

**- Albert Einstein : Where is Science Going ?**

All the reiligions share a common faith in the existence of a reality which cannot be perceived by the senses or comprehended by reason. The existence of this reality is essentially a matter of faith and, secondarily, of experiance which by definition is incapable of communication to others who have not had it,

**- A.B.Shah : Religion and society in India.**

# ఔనా! వేదంలో అన్నీ ఉన్నాయా?

-రావిపూడి

'వేదంలో అన్నీ ఉన్నాయిష' అనేది ఓ జోక్, ఓ శతాబ్దికి పూర్వం అవహేళనగా అది వాడుకలోకి వచ్చింది. బహుశ గురజాడ వారే తొలిసారిగా ఆ జోక్ వాడి వుంటారేమో!

అందుకు కారణంకూడా లేకపోలేదు. రుగ్వేదానికి సంస్కృతంలో పూర్తి భాష్యం వ్రాసిన సాయణాచార్యుడు 14వ శతాబ్దివాడు. ఆయనకు వేదార్థాల్లో విమానాలు, టెలిగ్రాఫు మొదలైనవి వున్నట్లు కనిపించలేదు. ఎందుకంటే, ఆయన కాలంలో అవి లేవు.

19వ శతాబ్దంలో దయానందుడు వచ్చే సరికి పాశ్చాత్యశాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణులు విమానాలు, టెలిగ్రాఫ్, మొదలైన వాటిని కనుగొని, వాటిని వాడుకలోకి తెచ్చారు. అందువల్ల అలాంటి వన్నీ వేదాల్లోనే వున్నవని దయానందుడు తన వేదభాష్యంలో యిరికించాడు.

ఇంకేముంది? వేదాల్లోనే అన్నీవున్నాయనే అపభ్రంశ అసత్యప్రచారాన్ని లేవదీశారు వైదికమత ఛాందసులు. దాన్ని ఎగతాళి చేయడానికి వేదాలు' తిరగేసిన ప్రగతివాదులు "వేదాల్లో అన్నీ ఉన్నాయిష!" అనే జోక్‌ను లోకం మీదికి వదిలారు.

అంతటితో తోకముడిచినట్లు కనిపించిన హిందూ (బ్రాహ్మణ) మతఛాందసులు ఇప్పుడు మరల పెట్రేగారు. ఆధునిక విజ్ఞాన విశేషాలన్నిటినీ వేదంలో చూపడానికి వెర్రి అన్వయాలు తీస్తున్నారు. ఎంతో కొంత చదువుకున్నామనుకున్నవారు కూడా వీరి ప్రచారానికి బలవుతున్నారు. పసితనంనుంచీ హిందువు ననుకొనే ప్రతి ఒక్కడూ బ్రాహ్మణమత బానిసత్వానికి లోనుకావడమే అందుకు కారణం.

మతం మత్తుమందు( opium ) అన్నాడు కారల్‌మార్క్సు. అంతేకాదు, ఆ ఔత్సాహిక మాదక ద్రవ్యం రోగమేకాని, రోగ నిదానంకాదని అన్నాడు టాంప్‌షైనః (Religion is not only analagous to a recreational drug, it is more like disease than cure (Free inquiry, June- July 2007 ) హెరాయిన్ అలవాటయినవాడు అదిలేనిదే బ్రతకలేనని ఎలా అనుకుంటాడో, మతం అంటుకున్న మనిషి కూడా అంతేనంటాడు టామ్‌షైన్.

చదువురాని మత విశ్వాసులు చాలామంది వుంటారు. అయినా వారెవ్వరూ Fools కారు. నిజం చెపితే వారు వింటారు. కాని, చదువుకున్న మతస్థులు అలాకాదు. వాళ్లు double fools- ఎంత చెప్పినా వారు వినరు. ఎన్ని రుజువులు చూపినా వారు మారరు. ఆ జల్పులు కృతకతర్కంతో శుష్కవాదం చేస్తారు. అందుకే వారిని మనం double fools గా పరిగణిస్తాం. వాళ్లంతా పరమానందయ్య శిష్యులే.

**పరమానందయ్య శిష్యులూ-గాడిద గుడ్డూ**

పరమానందయ్య శిష్యులొకసారి ఓ డొంకవెంట ప్రయాణంచేస్తూ ఆ ప్రక్కపొలంలో గాడిదల దొడ్డినీ, దాని ప్రక్కనేవున్న గుమ్మడిపాదులో పెద్దగుమ్మడికాయనూ చూచారుట.

ఆ గుమ్మడికాయే గాడిదగుడ్డని భ్రమించి, వాళ్లుదాన్ని ఇంటికి మోసుకొనివెళ్లి, వంతులవారీగా పొదగడం ప్రారంభించారుట. మరునాటి ప్రయాణంలో దాన్ని నెత్తిమీదపెట్టుకొని పోతుండగా, అది జారి క్రిందపడి బ్రద్దలయిందట. అదే సమయానికి ఒక కుందేలుపిల్ల



౨౦

వ్యా...త్తుకుంటూ వెళ్లి, ఆ సమీపంలోని ముళ్లపొదల్లో దూరిందట. అదే గాడిదపిల్ల అనీ, భ్యా...వగుడ్డు పగలగా, అది బయటకు వచ్చి పొదల్లో దూరిందనీ, పరమానందయ్య శిష్యులు ...చనావేశారు. వాళ్ళెంత వెదకినా, గాడిద(కుందేలు)పిల్ల వాళ్లకు కనపించలేదు. వాళ్లవెదకులాట ...ంతా వృధా అయింది. కాని, గుమ్మడికాయ గాడిద గుడ్డూకాదు. అది పగిలితే గాడిదపిల్లేకాదు, ...రేపిల్లారాదు. పరమానందయ్య శిష్యుల గాడిద గుడ్డూలాగా బ్రాహ్మణ మత హెరాయిన్ బాధితులకు వేదాదుల్లో ఆధునిక విజ్ఞానం కనిపిస్తుంది. అసలు విషయమేమంటే, గాడిదలు గుడ్లుపెట్టవు, వేదాదుల్లో ఆధునిక విజ్ఞానం వుండదు.

**శాఖమూరి వారూ - వేదాల్లో అధునిక విజ్ఞానం :**

ఆ మధ్య డా॥శాఖమూరి శివరామబాబు, M.A;Ph.D, అర్జునాదేవి, M.A. అమెరికాలో వున్నపుడు "డా॥ రాఘవాచార్య ఎప్పుడూ చేప్పుతూండే విషయం "We had a great treasure of Knowledge in the form of Vedas, but we lost the Keys" స్మరించుకున్నారట. ఆ తాళం చెవి శాఖమూరి వారికి దొరికిందోయేమో, "వేదము-పరమాణు విజ్ఞానము" అంటూ వారు ఒక పుస్తకం వ్రాసి ప్రచురించారు. వారు తాళం తీసి చూపిందంతా సత్తునాణేలేకాని, బంగారు నాణేలు కావు. అది శైశవజ్ఞానమేకాని, ఆధునికవిజ్ఞానం కాదు.

ఆ పుస్తక ఆముఖంలో శాఖమూరివారు తమ "మనోగతం" వెల్లడిస్తూ, "**ఇంతవరకూ శాస్త్రజ్ఞులకు అంతు చిక్కని బ్రహ్మలోక (Super space) విజ్ఞానము, క్వార్కు (Quark) విజ్ఞానము, పరమాణు (Atomic) విజ్ఞానము, ఐన్‌స్టీన్ బిగ్ బ్యాంగ్ సిద్ధాంతంగా ప్రసిద్ధి చెంది, యింకనూ అనేక సమస్యల నెదుర్కొంటున్న విశ్వ ఆవిర్భావమునకు చెందిన విజ్ఞానము సమగ్రంగా పరిపూర్ణంగా వివరించబడిన దంటున్నారు**' ఇంతకంటే మరో పెద్ద అబద్ధంకోసం మనం ఎదురుచూడాలి.

అసలు Space అంటే యేమిటో ఈసైంటిస్టులకు అర్ధమైనట్లులేదు. అది పదార్థ ప్రవృత్తి ఫలితమని ఐన్‌స్టీన్ ఎలా విశదం చేశాడో వీరి విశ్వతత్వాన్ని పరిశీలించేటపుడు చూద్దాం. కాని, బిగ్‌బ్యాంగ్ (మహావిస్ఫోటనం) సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవాడు ఐన్‌స్టీన్‌కాదు. దాన్ని ప్రతిపాదించినవాడు జార్జిగామో. ఐన్‌స్టీన్ వివరించినది సాపేక్ష సిద్ధాంతం. దీన్నే Special theory of Relativity గా General Theory of Relativity గా రెండూ భాగాలుగా చెప్పుకుంటారు. సైంటిస్టు అనే ప్రతి ఒక్కడికీ ఈ విషయం తెలుసు. ఈ మాత్రం తెలియని వారు వేదంలో ఆధునిక విజ్ఞానాన్ని చూపబూనడం సాహసమనే చెప్పాలి.

మున్ముందు పురాణాదుల్లోని వేదవిజ్ఞాన విశేషాలను కూడా తాము వెల్లడించబోతున్నట్లు రచయితలు తమ 'మనోగతం' లో చెప్పుకున్నారు. అవికూడా పుస్తకరూపంలో బయటపడ్డాక వాటి సంగతి చూద్దాం.

**కాలజ్ఞానం:-**

"ఋగ్వేదం 1-164-11 వలన ఆనాటివారు కాలాన్ని ఎంత చక్కగా పరిశీలించారో తెలుస్తుంది" అన్నారు రచయితలు ఆ రుక్కు ఇదీ-

ద్వాదశారంనహి తజ్జరాయ వర్వర్తి చక్రం పరిద్రామృతస్య।

అపుత్రీ అగ్నే మిధునానో అత్ర సప్తశతానివింశతిశ్చతస్థు॥

నిరంతరం తిరుగుతూవుండే కాలచక్రానికి 12 ఆకులూ, 720 మంది కొడుకులూ వున్నారన్న ఈ రుక్కు భావం సంవత్సరానికి 12 నెలలూ, 360 రోజులూ (720 రేయింబవళ్లు) వున్నాయని.

ఇందులోని ఆధునిక విజ్ఞానం యేమిటో, ఇతర జాతులకు, మతాలకు ఈ విషయం ఇలా తెలియదని వేద సమర్ధకుల భావమా?

రేయింబవళ్లు ఒక రోజవుతుందని మూడు నాలుగేళ్ల పిల్లలు గుర్తించగలరు. వానాకాలం, చలికాలం, ఎండలకాలం యేటేటా వస్తాయని మరికొంత ఎదిగిన పిల్లలు గుర్తించగలరు. ఏళ్లతరబడి సోమపానం చేస్తూ, మంత్రాలు వల్లిస్తూ, మం॥ల్లో అవునేతిని పోసి మాంసం చీకులు కాల్చుకుతిన్న సోమరులు రేయింబవళ్లు, నెలలు, రుతువులు, యేటేటా వస్తాయని చెప్పడంలో విశేష మేమున్నది?

అసలు విషయమేమంటే, యేడాదికి 360 రోజులనేది మొద్దులెక్క .ఆ లెక్క తెలుసుకున్నంత మాత్రాన వారికి కాలమంటే యేమిటో ఎలాతెలుస్తుంది? నిజమేమంటే, ఒక సంవత్సరానికి 365 రోజుల, 5 గంటల, 48నిమిషాల 46సెకనులు. పిచ్చిలెక్కలు, పుచ్చులెక్కలువేసి, రుక్కులకు ఇలాంటి అర్థాలు లాగితే, అది ఆధునిక విజ్ఞానం కాబోదు.

అయితే, రేయింబవళ్లు (రోజు) ఎలా యేర్పడుతున్నాయో వేదాలకు తెలుసా? తెలియదు, తెలియడానికి వీలులేదు కూడా. భూమి తన చుట్టూ తాను ఒకసారి పరిభ్రమించడానికి పట్టేకాలాన్ని రోజు అంటాం. భూమి తనచుట్టూ తాను తిరుగుతున్నదన్న విషయం వేదాల రచయితలకేకాదు, పురాణేతిహాసాల రచయితలకు కూడా తెలియదు. మన ప్రాచీన ఖగోళ విజ్ఞానులకున్నూ తెలియదు.

మరి, సంవత్సరం యెలా యేర్పడుతున్నదో వేదకాలానికి తెలుసునా? తెలియదు. భూమి సూర్యుడి చుట్టూ ఒకసారి తిరిగి రావడానికి పట్టే కాలాన్ని సంవత్సరమంటాం. కాని, భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతున్నదని కానీ, అందువల్ల భూవాసులకు సంవత్సరం యేర్పడుతున్నదని కానీ వేదం యెక్కడయినా చెప్పిందా? చెప్పలేదు. సూర్యుడితో సహా గ్రహ నక్షత్రాదులన్నీ భూమి చుట్టూ తిరుగుతున్నాయనేది వేదకాలం భావం.

అంతేకాదు. వైదికుల కాలమానం కేవలం భూమికి సంబంధించినదే. భూమితో సహా యితరగ్రహాలు కూడా తమ చుట్టూ తిరుగుతున్నాయనీ, అందువల్ల, ప్రతి గ్రహానికీ రోజుల ప్రమాణంలో, సంవత్సరాల ప్రమాణంలో తేడాలున్నవనీ వేదానికి తెలియదు. ఇతర గ్రహాల రోజుల్ని, సంవత్సరాలను భూప్రదక్షిణం వల్ల యేర్పడుతున్న రోజులతో, సంవత్సరాలతో పోల్చిచూడండి!

| | | | |
|---|---|---|---|
| భూమి | రోజు గం. 24-56-04సె. | సంవత్సరం | 365.26రోజులు |
| అంగారకగ్రహం | రోజు గం. 24-37-23సె. | | 687రోజులు |
| గురుగ్రహం | రోజు గం. 9-50-30సె. | | 11.86సం/4330రో. |
| శనిగ్రహం | రోజు గం. 10-14-0సె. | | 29.4సం/10730రో. |

(ఇలాగే మిగతా గ్రహాల వివరాలు కూడా తెలుసుకోదలచిన వారు నా "వాస్తువుశాస్త్రమా?" గ్రంథంలో 89వపేజీ చూడవచ్చు.)

పైన మనం చూచిన దాన్ని బట్టి శనిగ్రహం తనచుట్టూ తాను తిరగడానికి గం. 10-14 నిమిషాలు పడుతుంది. అంటే శని రోజు ప్రమాణం 10గంటల 14 నిమిషాలే. అది సూర్యుడి చుట్టూ తిరగడానికి మన ప్రమాణంలో 29.4సంవత్సరాలు పడుతుంది. కాబట్టి శని సంవత్సరం సుమారు మన10730 రోజులతో సమానం. అంటే గ్రహ గ్రహానికీ కాలమానం మారుతుంది. అంటే, కాలం సాపేక్షమే కాని, నిరపేక్షంకాదు. ఇదీ ఆధునిక విజ్ఞానం స్థూలంగా చెపుతున్న విషయం.

భూమి మీద కూడా ఒక ప్రదేశంలో పగలుంటే, అదే సమయంలో మరో ప్రదేశంలో రాత్రి వుంటుంది. ఉత్తర ధృవప్రాంతంలో 6 నెలలుపగలు, ఆరు నెలలు ఆరోర (సంధ్య) వుంటుంది. భూమి గోళమనీ, అది తన చుట్టూ తాను తిరగడం వల్ల రేయింబవళ్లు యేర్పడుతున్నాయనీ తెలియని వారికి ఈ ఆధునిక విజ్ఞాన స్థూల విషయాలైనా ఎలా తెలుస్తాయి?

కృతయుగంలో మనిషి ఆయుస్సు 400 యేళ్లని మనుస్మృతి అన్నది. కాని, రాముడు 11,000 యేళ్లు రాజ్యం చేసి, చివరకు తన తమ్ములతో కలసి సరయూ నదిలో దూకి ఆత్మహత్య చేసుకున్నాడని వాల్మీకి రామాయణం చెపుతున్నది. అసలు ఎవడైనా11000 యేళ్ళు బ్రతకడం ఎలా సాధ్యమన్న సందేహం మనకు రావచ్చు. కాని, మనది చిరంజీవుల దేశంకదా? దాన్నీ సాధ్యం చేస్తాయి పురాణాలు.

సంఖ్యా మానంలో సున్న ( Zero)ను మనవాళ్లే కనిపెట్టారని భారతీయులు గర్వంతో చెప్పుకుంటారు. ఈ విషయాన్ని కాదని ఎవరూ తగాదా పడడం లేదు. కాని, ప్రతి సంఖ్యకూ సున్నలు కలిపి రాముడు 11,000 యేళ్లు రాజ్యం చేశాడని వాల్మీకి రాశాడు. అంతేనా? ఆయన వానర సేనను ఒకట్లతో సహా లెక్క పెట్టినట్లుంది. ఆసేన సంఖ్య $10^{10} + 10^{20} + 10^{30} + 10^{40} + 10^{44} + 10^{52} + 10^{57} + 10^{62} + 5$ అట.* వాల్మీకి లెక్క ప్రకారం ఒకటి తరవాత 315 సున్నలుపెట్టి దానికి 5 కలిపితే ఆసంఖ్య ఎంతవుతుందో అన్ని వానరాలు సైన్యంగా లంకలో అడుగు పెట్టాయన్నమాట! ఒక్కో వానరం నిలువడానికి ఒక్కో గజం స్థలం అవసరమనుకున్నా, అన్ని వానరాలు నిలబడడానికి లంక వైశాల్యం సరిపోతుందా? భారత భూభాగమైనా సరిపోతుందా? భూగోళ వైశాల్యమైనా సరిపోతుందా? లెక్కించిచూడండి. (దీన్ని బట్టి చూస్తుంటే మన పూర్వులకు సున్న జ్ఞానమేకాని, ఆధునిక విజ్ఞానం లేదని తేలిపోవడంలేదా?) సముద్రాలను వదలితే, అడవులు, కొండలు, లోయలతో సహా భూమివైశాల్యం సుమారు, 57312000చ.మైళ్లు. చ.మైలు, 3097600చ.గ లెక్క ప్రకారం సుమారు 167530 కోట్ల చదరపు గజాలవుతుంది. చ.గ, 1296 చ.అం. కాబట్టి ఒక్కో వానరం నిలవడానికి చదరపు అంగుళం స్థలం కూడా భూమి మీద దొరకదు. ఒకటి తరువాత 315 సున్నలు పెడితే ఆ సంఖ్య ఎంతవుతుంది. అంటే$10^{315}+5$ వానరసేన $16+10^{14}$ చ.అ.నేల పై నిలవాలంటే,

*"సనాతన దేశంలో ఆధునిక విజ్ఞానము" కుప్పా వెంకటకృష్ణమూర్తి, (Scientific Research on Vedas, 11-13-279, Road No.8 Alakapnri, Hyderabad-35)*



29

ఒక అడుగు స్థలం మేర ఎన్ని కోట్ల, కోట్ల,......... వానరాలునిలవాలి? దీన్ని బట్టి మన వాల్మీకికున్నది సున్న జ్ఞానమేకాని, ఆధునిక విజ్ఞానం కాదని తేలడం లేదా? దాన్ని గురించి గొప్పలు చెప్పుకోవడానికి సిగ్గుండాలి.

ఈ సున్నల పట్ల మన పురాణ రచయితల మోజుగురించి చాల ఉదాహరణలు చెప్పుకోవచ్చు, భూగోళం మీది సముద్రాలన్నిటి వైశాల్యం 14 కోట్ల చదరపు మైళ్లు కాగా, దానిలో ఒక్కోటి 64 వేల కోట్ల చదరపు మైళ్ల వైశాల్యం గల తాబేలుగా, చేపగా విష్ణువు అవతారాలెత్తాడట. ఈ సైన్సు మన భాగవతంలో వుంది.

బ్రహ్మలోకం (Super space) గురించి కూడా వేదంలో వుందని శాఖమూరి వారి మాట. వారికి కాలం గురించి ఎంత జ్ఞానం వుందో, ప్రదేశం (Space) గురించి కూడా అదే తరహా జ్ఞానం వున్నట్లుంది. విశ్వద్రవ్యం నిరంతరం పరిణామంలో వుంది. దానినే Being and Becoming గా చెప్పుకోవచ్చు. ద్రవ్యం ఏ మేరకు వ్యాప్తి చెందుతుందో దానిని ప్రదేశమని అంటాం. ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రతి పాదించకముందు ఇది ఇలా ఎవరికీ అర్థం కాలేదు. ద్రవ్యం నిత్యపరిణామంలో వుంటుంది కాబట్టి, దాని ఉనికి కేవలం (alsolute) కాదు. ఒకదాని ఉనికిని మరొక దాని ఉనికితో పోల్చిచెప్పుకోవాలి. అలాగే కాలం కూడా. భూమి మీద నివసించే వారి రోజుకీ, సంవత్సరానికీ పోల్చి లోగా మనం చూచాం. కాబట్టి కాలమనేది సాపేక్షమే (Relative) కాని, నిరపేక్షం (absolute) కాదు. ప్రదేశ కాలాలు రెండూ పదార్థ (ద్రవ్య) ప్రవృత్తులు. పదార్థంతో పాటే అవి ఉనికిలోకి వస్తాయి కానీ, పదార్థానికి ముందు అవి వుండవు. Super space అనేది ప్రత్యేకంగాలేదు. పదార్థంలేని ప్రదేశం లేదు. బ్రహ్మలోకం పేరుతో ఎలా పడితే అలా రాస్తేనో, వాగితేనో, పదార్థేతరమైన దానికి వాస్తవికతరాదు.

(ఇంకావుంది)

---

The Sacrifice is more than an act of worship, it is an act of assistance to the goods. Gods, like men, need drink and food to be strong; likemen, they need praise and encouragemeant to be of good cheer. When not strengthened by the sacrifice, they fly helpless before their foes............. the sacrifice is composed of two elements, offerings and spells. The offerings are libations of holy water (hotra) holy meat and haoma (soma). The last offering is the most sacred and powerful of all. Haoma, the Indin soma, is an intoxicating plant the juice of which is drunk by the faithful for their own benifit and for the benifit of their gods. It comprises in it the powers of life of all the vegetable kingdom.

**- James Darmesteter : Intro-Avesta.**

# హేతువాదం తొలిమజిలీ నాస్తికత్వం.

-ఆకేటి సూరన్న

ఆధునిక విజ్ఞానశాస్త్ర తత్వరీత్యా ఆలోచిస్తే లేని దానికి ఉన్నదని ప్రతిపాదనచేసి, ఉన్నట్లు రుజువు దొరికిందాక అజ్ఞేయవాదిగా వుండమనడం అవివేకమవుతుంది. అది భౌతికమైన ప్రతిపాదన అయితే, దాని అస్తిత్వ-నాస్తిత్వాల పరిశీలనకు విజ్ఞానశాస్త్రం ఉపక్రమిస్తుంది. ఫిజిక్సులో ఈథర్ అనే ప్రతిపాదన ఒకనొకప్పుడుండేది. అది "లేనిదని" తరవాత రుజువైంది. మరి దైవభావం భౌతిక సూత్రాల తాకిడికి నిలబడ జాలదు కదా? అందువల్ల, దేవుడున్నాడని భావించడానికి ఇప్పటి వరకు ఏ శాస్త్రాధారమూలేదు. దేవుడున్నాడన్నది కేవలం ఊహే. ఈనాడది సంభావ్యతకూడా కాదు. అది ఎప్పుడూ ఎవ్వరి అనుభూతిలోకీ రాలేదు, ఊహామాత్రమైన దానికి అస్తిత్వం కల్పించి "ఉన్నాడో లేడో తేలిందాక" లేడని వాదించడం తప్పు అని వాదించడం పిరికి నాస్తిత్వమవుతుంది కాని, అజ్ఞేయవాదం కూడా కాదు. ఉన్నట్లుగా అది ఇంతవరకు రుజువు కాని అంశం. దాని కివ్వబడ్డ నిర్వచనాలన్నీ తప్పని రుజువైనాయి. అటువంటి దాన్ని గురించి అజ్ఞేయ భావాన్ని వెల్లడించడం ఆత్మవంచన అవుతుంది. అందువల్ల, హేతువాది అవశ్యంగా నిరీశ్వరవాది.

అభౌతికమైన దాన్ని గురించి మనకు జ్ఞానంకలగడానికి వీలు లేదు. జ్ఞానం మీద సత్యం ఆధారపడివుంది. దేవుడనేది మనిషి జ్ఞానానికి వేలాది సంవత్సరాల నుంచి చిక్కలేదుకాన, దేవుడున్నాడనేది అసత్యమని హేతువాదులంటారు. అందుకు భిన్నమైన విశ్లేషణలో దోషమున్నదని దైవప్రతిపాదకులు గుర్తించాలి. అజ్ఞేయవాదమంటే అజ్ఞానవాదమే. దయ్యాలులేవని అజ్ఞేయవాదులు రుజువు చేయగలరా? లేక అజ్ఞేయత అనే దాన్ని ఒక్క దేవుని విషయానికే పరిమితం చేస్తారా? కేవలం లొల్లుడుకబుర్లతో దేవుడు లేడని రుజువు చేయమంటారా?

హేతువాదులు భావవిప్లవం కోసం పోరాడుతున్నారు. దేవుడు లేకున్నా లేని దేవుడి పేరుతో వున్న భావం మానవజాతికి చాల హాని చేస్తున్నది. ఇప్పుడు సమాజాన్ని ప్రభావితం చేస్తున్న సిద్ధాంతాలన్నీ, మతాలన్నీ, మానవుని వక్ర ఆలోచనకు పురికొల్పుతున్న సిద్ధాంతాలన్నీ, ఆ లేని దేవుని ప్రాతిపదిక చేసుకొని పుట్టుకొచ్చినవే. కాగా, మతాలకు ప్రాతిపదిక అయిన దేవుడు అబద్ధమైనప్పుడు, దాని తార్కిక పర్యవసానంగా సాధించబడ్డ మత సూత్రాలన్నీ తప్పుయిపోతాయి. అందువల్ల యోగ్యమైన మానవోచిత జీవనతత్వాన్ని (Philosophy of Life) నిర్మించుకోవాలంటే, తప్పుడు ప్రాతిపదికను త్యజించాలి. మానవ సమస్యలు పరిష్కరించుకోవాలంటే, మానవేతర ప్రాతిపదికలను త్యజించాలి. అంటే, లేని దేవుడ్ని లేడనాలి. ఇందులో అజ్ఞేయవాదానికి తావులేదు.

లేనిదాన్నిలేదనీ, ఉన్నదాన్ని ఉన్నదనీ అనుకోవడం వాస్తవిక విధానం. వాస్తవికత ఆధారంగా సహేతుక విచారణ కొనసాగించితే, మనం సమగ్రమయిన వాస్తవిక జీవన విధానాన్ని చేరుకొనే అవకాశముంది. ఇదే హేతువాదుల వాస్తవ దృష్టీ, తాత్విక విధానమూ. ఆ దిశగా హేతువాదులు ఉద్యమం నడుపుకొంటున్నారు.

2007 ఆగస్టు 11, 12 తేదీలలో భావవిప్లవ జీవనాడి అయిన "హేతువాది" మాసపత్రిక రజతోత్సవాలు జరుపుకొంటున్నది. హేతువాద ఉద్యమం చేష్టారహితమని కలలుగనేవారికీ, ఆ దిశగా ప్రచారం సాగించేవారికీ అదొక షాక్. హేతువాద చేష్టలంటే, ఎప్పటికప్పుడు పిల్లిమొగ్గలు వేయడంకాదు. ఈ విషయం అర్థంకానివారే మేకపిల్లలాగా చిల్లగంతులు వేస్తుంటారు.

భావాలను భావాలతోనే ఎదుర్కోవాలిగాని, బజారున పడి ఛాలెంజిలు విసురుతూ రాతలూ, కూతలూ సాగించేవారుకాదు. సంఘాలు, సంస్థలు యేర్పడేటప్పుడు వాటి మౌలికలక్ష్యాలను ముందుగానే నిర్ణయించుకుంటారు. ఆ లక్ష్యాలు ఏరోజుకారోజు మారవు. మతంనుంచీ, దాని ప్రాతిపదికల నుంచీ స్వేచ్ఛ పొందడమనేది హేతువాద, నాస్తిక, స్వేచ్ఛావాద, మానవవాదాల మౌలిక లక్ష్యం. అలాంటి కొన్ని 'సంఘాలు కలిసి ఉమ్మడి కార్యాచరణ వేదికను ఏర్పరచుకొవడంలో తప్పులేదు. పైలక్ష్యాలను ఆదర్శంగా చేసుకున్న చాలసంఘాలు కలిసి ప్రపంచవేదికను తయారు చేసుకున్నాయి. మౌలికలక్ష్యాల్లో విభేదాలున్నపుడు ఐక్యవేదిక అనేది సాధ్యమేకాదు. అయినా, ప్రచ్ఛన్న మతవాదులు కొందరు హేతువాద పదజాలాన్ని (Nomenclature) వాడుతూ, తాముకూడా హేతువాదులమేనని అవగాహనలేని వారిని భ్రమపెట్టజూస్తున్నారు.

గతంలో బౌద్ధాన్ని వంచించిన బ్రాహ్మణ మత వాదుల్లాగా, ఈనాటి హేతువాదాన్ని అపభ్రంశరీతులకు లాగదలచుకొన్నవారి నుండి హేతువాద ఉద్యమం జాగ్రత్త పడవలసివుంది.

---

To argue with a man who has renounced the use and authority of reason is like administering medicine to the dead..... Rationalism does not, however, either being or end with the more adoption of a critical attitude to established beliefs in religion or philosophy. The rationalist seeks to over throw accepted beliefs only in so far as he conceives than to stand in the way as true constructive explanation of man's relation to the universe and to his kind. he believes, in short, that right thinking is the key to right conduct.

**-Thomas Paine.**

We must present the view of reason, not out of a hope of reconstructing the desets of ruined minds that have rusted shut - but to educate and train new and fertile minds

**- Dr. Isaac Asimov.**

# మానవవాదం

-గుమ్మా వీరన్న

అనాదిగా మానవుడి సుఖసంతోషాల కోసం అనేక సిద్ధాంతాలు ఆవిర్భవించాయి. అందులో కొన్ని మానవజాతిని అభ్యుదయపథంలో నడిపిస్తే మరికొన్ని అంధకారంలోకి నడిపించి అధోగతిపాలు చేశాయి. ఏది అభ్యుదయం? ఏది అభ్యుదయ నిరోధకం? మానవజాతికి మేలు చేసిందేమిటి? కీడు చేసిందేమిటి? ఇత్యాది ప్రశ్నలకు సమాధానాలు చెప్పవలసి వుంటుంది.

ఏ విషయాన్ని గురించి మాట్లాడాలన్నా ముందుగా ఆ విషయానికి సంబంధించిన జ్ఞానం కావాలి. అదేవిధంగా నిజానిజాలను, మంచిచెడులను, తప్పొప్పులను గుర్తించగలిగే విచక్షణా జ్ఞానం కావాలి. మనకున్న విచక్షణా జ్ఞానం ఆధారంగానే మన తాత్విక దృక్పథం ఏర్పడుతుంది. నిత్యజీవితంలో అడుగడుగునా మనం చేసే పనుల సందర్భంగా, ఎదుర్కొనే సమస్యల సందర్భంగా తీసుకొనే నిర్ణయాలన్నీ మన దృక్పథం మీద ఆధారపడి వుంటాయి. మన జీవన విధానాన్నీ ప్రభావితం చేసేది, నిర్ణయించేది మన తాత్విక దృక్పథమే.

సమాజంలో అన్నిరంగాలలోను వైవిధ్యాలు, వైరుధ్యాలు దర్శనమివ్వడానికి వారివారి ప్రాపంచిక దృక్పథమే ప్రధాన కారణంగా కనిపిస్తుంది. ఆస్తికులు, నాస్తికులు, భావవాదులు, భౌతికవాదులు, సమిష్టివాదులు, వ్యక్తివాదులు, హింసావాదులు, అహింసావాదులు, నియంతృత్వవాదులు, స్వేచ్ఛావాదులు పరస్పర విరుద్ధమైన భావాలను కలిగివున్నవారు ప్రపంచ వ్యాప్తంగా వున్నారు. అయితే ఎవరి భావాలు వాస్తవమైనవి? ఏ భావాలు మానవజాతిని మంచిమార్గంవైపు నడిపించగలవు? అని ప్రశ్నించుకున్నపుడు మనం వాటి మూలాల్లోకి వెళ్లి పరిశీలించవలసి వుంటుంది.

ముందుగా జ్ఞానమెలా ఏర్పడుతుందనే విషయంతో దీన్ని ప్రారంభించవలసి వుంటుంది.

మన చుట్టూ విశ్వం ఉంది. అందులో నిరంతరం సంఘటనలు జరుగుతున్నాయి. ఆ సంఘటనలనే మనం మన జ్ఞానేంద్రియాల ద్వారా గ్రహిస్తున్నాం. సంఘటనలు పదార్ధ రూపేణా ఇంద్రియాల ద్వారా మన గ్రహింపులోకి రావడం వల్ల మన మెదడు వాటిని స్వీకరించి, విశ్లేషించి చూపుతుంది. తద్వారా వాటి రూపగుణధర్మాలను తెలుసుకోగలుగుతాం. ఆయా వస్తువులలో సంభవించే పరిణామాలను కార్యకారణ సంబంధాల రూపంలో అర్థం చేసుకోగలుగుతాం.

ఈ విధంగా ఆయా వస్తువులకు, సంఘటనలకు సంబంధించిన జ్ఞానం మనకు కలుగుతుంది. విశ్వంలో సంఘటనలు లేకపోయినా, తెలుసుకొనే మనిషి లేకపోయినా, గ్రహించే ఇంద్రియాలు, మెదడు లేకపోయినా జ్ఞానం ఏర్పడే అవకాశం లేదని తెలుస్తుంది. ఇవన్నీ వున్నప్పటికీ గ్రహించిన సమాచారాన్ని విశ్లేషించుకోవడంలో, సమన్వయపరచుకోవడంలో పొరపాటు జరిగితే ఆ మేరకు జ్ఞానం కూడా పొరపాటుదవుతుంది. అనుభవంలో ఆ పొరపాటును గ్రహించి సరిదిద్దుకుంటే సక్రమమైన జ్ఞానం ఏర్పడుతుంది.

ఆదిమ మానవుడి నుండి ఆధునిక మానవుడివరకు నిరంతరం తమ చుట్టూ జరుగుతున్న సంఘటనలు గ్రహించి విశ్లేషించుకోవడం ద్వారానే జ్ఞానాన్ని సంపాదించుకోగలుగుతున్నాడు.



35

విశ్వపరిణామ క్రమంలో రూపొందిన మానవుడు విశ్వంలో విడదీయరాని భాగమవుతున్నాడు. విశ్వంలో మానవావిర్భావం జరిగిన తరువాతనే విశ్వాన్ని గురించి, అందులోని సంఘటనల గురించి పరిశీలించడం, గ్రహించడం, భావించడం, ఆలోచించడం, అనుభవించడం ప్రారంభమైంది. అంతకుముందున్న జంతుదశలోగాని, ఇంకాముందున్న జీవజాతుల్లోగాని ఇవన్నీ ప్రాథమిక స్థాయిలో సహజాతాల రూపంలో వున్నట్లు మనకు ఆధారాలు లభ్యమవుతున్నాయి. అనాదిగా కొనసాగుతున్న విశ్వంలో 500 కోట్ల సంవత్సరాల క్రితం సౌరకుటుంబం ఏర్పడింది. అందులో భాగంగానే భూమి మీద జీవావిర్భావం జరిగింది. దాదాపు 350కోట్ల సంవత్సరాల సుదీర్ఘ జీవపరిణామ చరిత్రలో మానవుడు అవతరించింది కొద్దిలక్షల సంవత్సరాల క్రితమే. అతడు వ్యవసాయం నేర్చింది పదివేల సంవత్సరాల క్రితమే. అక్షరాలు నేర్చింది ఎనిమిదివేల సంవత్సరాల క్రితమే.

మానవావిర్భావం వల్లనే భూమికి, విశ్వానికి 'విలువ' ఏర్పడింది. విశ్వం మనిషిరూపంలో తన గరించి తాను తెలుసుకుంటుందనవచ్చు.

మానవుడి చరిత్రను పరిశీలిస్తే అనేక విశేషాలు అవగతమవుతాయి. మనిషి ఆలోచనాపరుడయ్యాకనే చుట్టూ జరుగుతున్న సంఘటనలకు కారణంగా దైవాన్ని సృష్టించుకున్నాడు. ప్రారంభంలో ప్రకృతి శక్తులనే దైవంగా భావించిన మానవుడు తరువాతి కాలంలో తనకున్న అవయవాలను, భావాలను దైవానికి ఆపాదించాడు. తనకు లేని శక్తి సామర్థ్యాలను దైవానికి కల్పించాడు. అపోహల్లో నుంచి అతీత శక్తులను వూహించి దైవానికి తగిలించాడు. తన కోరికలు నెరవేరడానికి ఆ దైవాన్ని ఆరాధించడం ప్రారంభించాడు. అదే క్రమంగా మతంగా రూపుదిద్దుకుంది.

ప్రతి సంఘటన ఒక క్రమాన్ని అనుసరించి జరుగుతుంది. ఆ క్రమాన్ని అర్థం చేసుకున్నపుడు అది ఏయే నియమాలను అనుసరిస్తుందనే విషయం తెలుస్తుంది. ఆ విధంగా విశ్వమంతా నియమబద్ధమని తేలుతుంది. విశ్వంలోనుంచి వచ్చిన మానవుడు కూడా నియమబద్ధుడే. విశ్వవ్యాపితంగా వున్న నియమాలను ఎవరూ అతిక్రమించలేరు. వాటికి అతీతంగా ప్రవర్తించలేరు.

శాఖోపశాఖలుగా విస్తరించిన ఆధునిక విజ్ఞానశాస్త్రం పరిశీలించేది, పరిశోధించేది, ప్రయోగాలలో నిగ్గుతేల్చేది ఈ విశ్వపదార్థంలో నిబిడీకృతంగా వున్న నియమాలనే. ఈ నియమాలను మనం ఎంత ఎక్కువగా, స్పష్టంగా, సమగ్రంగా తెలుసుకుంటే మన జ్ఞానం అంతగా పెరుగుతుంది. జ్ఞానం పెరిగిన మేరకు సత్యానికి చేరువవుతాం. ఆ మేరకు మనం స్వేచ్ఛావంతులమవుతాం. ఈ ప్రక్రియ నిరంతరం కొనసాగుతూ వుంటుంది. ఆ మేరకు జ్ఞానపరిధులు, స్వేచ్ఛాపరిధులు విస్తృతమవుతూ వుంటాయి.

సమాజం మానవుడి సహకార భావం నుండి రూపుదిద్దుకొన్నది. సామాజిక, ఆర్థిక, రాజకీయాది వ్యవస్థలన్నీ మానవుడు తన శ్రేయస్సు కోసం ఏర్పాటు చేసుకున్నవే. తాను సృష్టించుకున్న వ్యవస్థలే నేడు తన మీద ఆధిపత్యాన్ని చెలాయిస్తున్నాయి. వాటి చేతిలో తాను కీలుబొమ్మగా మారిపోయాడు.

మానవుడి జీవన సారం స్వేచ్ఛ. మానవులందరూ స్వేచ్ఛగా, ఆనందంగా జీవించాలని కోరుకుంటారు. అయితే సమాజంలో అడుగడుగునా ఎన్నెన్నో అవాంతరాలు, ఆటంకాలు ఎదురవుతున్నాయి. వాటిని ఎలా అధిగమించాలనేదే పెద్దసమస్య.

ఆక్రమంలో ఆవిర్భావించిందే మానవవాదం. మానవుడిని కేంద్రంగా చేసి, అతని స్వేచ్ఛకు, శ్రేయస్సుకు భంగం కలుగని రీతిలో అన్ని వ్యవస్థలను సమన్వయపరిచే విధానమే మానవవాదం.

వ్యక్తికి, వ్యక్తిస్వేచ్ఛకు ప్రథమ స్థానాన్నిచ్చేది మానవవాదం. సమాజంలో స్వేచ్ఛను అనుభవించేది వ్యక్తులే కాబట్టి వ్యక్తి స్వేచ్ఛకు ప్రాధాన్యతనిచ్చేది వ్యక్తివాదమవుతుంది.

ఏది అభ్యుదయ సిద్ధాంతమనే మన ప్రశ్నకు సమాధానం లభించింది. వ్యక్తికి, వ్యక్తిస్వేచ్ఛకు అత్యంత ప్రాధాన్యాన్నిచ్చేవన్నీ అభ్యుదయవాదాలుగాను, దానికి భిన్నంగా ప్రాధాన్యాన్నివ్వనివన్నీ అభ్యుదయ నిరోధక సిద్ధాంతాలుగా గుర్తించవచ్చు.

దైవం పేరుతో బయలుదేరిన విభిన్న మత సిద్ధాంతాలన్నీ మానవుడిని బానిసగా భావించాయి. దైవసన్నిధి చేరడమే జీవిత లక్ష్యంగా భావించిన మతాలు భూమిమీది మానవుడి జీవితాన్ని పూర్తిగా విస్మరించాయి. ఇక్కడి కష్టసుఖాలుకు పూర్వజన్మకర్మలను కారణంగా చూపి వాస్తవాలను వక్రీకరించాయి. మనుషుల వివేకాన్ని చంపివేశాయి. శక్తిసామర్థ్యాలను నిర్వీర్యం చేశాయి. భ్రమలను, భ్రాంతులను కల్పించాయి. పరాధీనతా భావాన్ని పెంచిపోషించాయి. ప్రశ్నించే తత్వాన్ని నాశనంచేసి విశ్వసించే తత్వానికి ద్వారాలు తెరిచాయి. సర్వం దైవాధీనమనే సిద్ధాంతాన్ని ప్రచారం చేశాయి. మానవుడి వివేక సంకల్పాలకు, కృషికి విలువలేకుండా చేశాయి. పరమప్రమాణాలను ప్రతిపాదించి మార్పుకు, అభ్యుదయానికి అవకాశం లేకుండా చేశాయి. అందుకే అన్నిరకాల దైవసిద్ధాంతాలు, మతసిద్ధాంతాలు అభ్యుదయ నిరోధక సిద్ధాంతాలుగా స్థిరపడిపోయాయి.

దీనికి భిన్నంగా చరిత్రలో క్రీస్తుపూర్వం ఐదారు శతాబ్దాల నుండే భారత దేశంలో చార్వాకం, బౌద్ధం, జైనం వంటి అభ్యుదయ సిద్ధాంతాలు భావోద్యమాలుగా ప్రసిద్ధి పొందాయి. మానవుడిని ఉన్నతాదర్శాల వైపు నడిపించిన బౌద్ధం దాదాపు వెయ్యిసంవత్సరాలు వెలుగొంది దేశవిదేశాలలో తన కీర్తి పతాకాన్నెగుర వేసింది. మానవ చరిత్రలో అదొక మహోజ్వల ఘట్టం.

చతుర్భూతవాదాన్ని ప్రతిపాదించిన చార్వాక సిద్ధాంతం పురోహితవర్గం చేస్తున్న దోపిడీకి, మోసపూరిత విధానాలకు వ్యతిరేకంగా బయలుదేరిన అభ్యుదయ భావోద్యమం. స్వర్గనరకాలను, యజ్ఞయాగాలను, మంత్రతంత్రాలను, మూఢవిశ్వాసాలను తీవ్రంగా ఖండించిన తొలి భౌతికవాద ఉద్యమంగా ప్రసిద్ధి చెందింది.

శంకర రామానుజ మధ్వాచార్య త్రయం ప్రతిపాదించిన అద్వైత విశిష్టాద్వైత ద్వైత సిద్ధాంతాలు వర్ణాశ్రమ ధర్మాలను వేదాంతం ముసుగులో కాపాడడానికి బాగా కృషి చేశాయి. ఆ సిద్ధాంతాల ప్రచారంవల్ల దేశంలో అలముకున్న అంధకార యుగం వెయ్యి సంవత్సరాలకు పైగా ఇంకా కొనసాగుతూనే వుంది.

ఈ సిద్ధాంతాల ప్రభావం నుండి బయటపడకముందే ఈ దేశంలో భక్తి ఉద్యమాలు



35

బయలుదేరాయి. భగవంతుడి ప్రీతికోసం సర్వస్వాన్ని సమర్పించుకునే ఆచారం ప్రారంభమైంది. శైవభక్తి, వైష్ణవ భక్తి పేరిట భక్తి ఉద్యమాలు వెర్రితలలు వేశాయి. మధురభక్తి పేరిట విచ్చలవిడి శృంగారం రాజ్యమేలింది. శైవులు, వైష్ణవులు మతంపేరిట ఒకరినొకరు చంపుకుంటూ మారణ హోమాన్ని సృష్టించారు. ఇవన్ని చరిత్రలో నమోదైన వాస్తవాలు.

క్రీస్తు శకం 15,16 శతాబ్దాలలో యూరపులో పునర్వికాసోద్యమం పుంజుకుని గొప్ప భావవిప్లవాన్ని తెచ్చింది. గ్రీసులో నగర రాజ్యాలు అంతర్ధానమయ్యాక యూరపులో కూడా అంధకారయుగం దాదాపు వెయ్యి సంవత్సరాలకు పైగా కొనసాగింది .యూరపు పునర్వికాసోద్యమం రినైజాన్స్ ఉద్యమంగా ప్రసిద్ధి చెందింది. ఈ రినైజాన్స్ ఉద్యమం వెయ్యేళ్ల అంధకారాన్ని తొలగించింది. మధ్యయుగాల పిడివాదంపై తిరుగుబాటు చేసింది. దాన్ని దేవుడిపై మానవుడి తిరుగుబాటుగా అభివర్ణించారు. మానవుడు తన శక్తికి తానే మూలమని, తన భవిష్యత్తును దైవ సంకల్పం నడపదని, తన భవిష్యత్తుకు తానే కర్తననే భావాలు రినైజాన్స్ ఉద్యమాన్ని ప్రభావితం చేశాయి. రినైజాన్స్ ఉద్యమం మూడు ముఖ్యమైన ఫలితాలను సాధించింది.

మొదటి దశలో రాజులు దైవాంశ సంభూతులనే భావాన్ని తుత్తునియలు చేసింది. ఫ్రెంచి మహా విప్లవాన్ని ప్రభావితం చేసింది. యూరపులోని అనేక దేశాలలో ప్రజాస్వామ్యవ్యవస్థల స్థాపనకు నాంది పలికింది.

రెండవదశలోరినైజాన్స్ ఉద్యమం సృష్టించిన స్వేచ్ఛా వాతావరణం అపూర్వమైన శాస్త్రాభివృద్ధికి దోహదం చేసింది.

మూడవదశలో పెరిగినశాస్త్రం, దాని వెనుకనున్న పరిశోధక తత్వం 18,19శతాబ్దాలలో పారిశ్రామిక విప్లవాలకు దారితీసింది. సాంకేతిక శాస్త్రాభివృద్ధిలో మానవశ్రమశక్తి అనేక రెట్లు పెరిగింది.

యూరపులో సంభవించిన రినైజాన్స్ వంటి ఉద్యమాలు నిస్సందేహంగా మానవవాద ఉద్యమాలే. అభ్యుదయకరమైన భావవిప్లవోద్యమాలే. అటువంటి భావవిప్లవోద్యమాల ఆవశ్యకత నేటిప్రపంచానికి చాలా వుంది. అది భారతదేశం వంటి దేశాలకు మరింత అవసరం.

గత 150 సంవత్సరాలుగా ప్రపంచాన్ని తీవ్రంగా ప్రభావితం చేస్తూ, అనేక దేశాల్లో రాజ్యాధికారాన్ని కైవసం చేసుకున్న మరో సిద్ధాంతం కారల్‌మార్క్స్ ప్రతిపాదించిన కమ్యూనిస్టు సిద్ధాంతం. మార్క్స్ భౌతికవాది, నైతికవాది, అభ్యుదయవాది, మానవవాది. అయితే అతడు ప్రతిపాదించిన తాత్వికపంథా అనేక దేశాలలో దీర్ఘకాలిక నియంతృత్వాల స్థాపనకు దారితీసింది. గతితార్కిక భౌతికవాద మహత్యంగా దాన్ని అభివర్ణించవచ్చు.

మార్క్సు 1848లో కమ్యూనిస్టు ప్రణాళికను విడుదలచేశాడు. మార్క్సిస్టు తత్వశాస్త్రం ప్రతిపాదించే ప్రధాన సూత్రాలలో ఆర్థిక నియతివాదం, శ్రామికవర్గ విప్లవ అనివార్యత, కార్మిక వర్గ నియంతృత్వం, వర్గ సంఘర్షణ ద్వారా అభివృద్ధి, రాజ్యస్వభావం, సాపేక్షనీతి వున్నాయి.

ఉత్పత్తి సాధనాలు, యాజమాన్యం, తద్వారా ఏర్పడే వర్గ సంబంధాలు సమాజ ఆర్థిక నిర్మాణాన్ని రూపొందిస్తాయని, అదే మౌలిక వాస్తవికత అని ఆర్థిక నియతివాదం చెబుతుంది. సామాజిక సాంస్కృతికరీతులు, నీతులు, రాజకీయాలు, మతం, కళలు,భావాలు మొదలగు

అంశాలన్నీ ఆర్థికపునాది మీద ఏర్పడే ఉపరితల నిర్మాణాలుంటుంది. అందుకే అది ఘోరంగా విఫలమైంది.

మార్క్సిజం భావించినట్లుగా మానవజాతి చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్ర కాదు. వర్గ సంఘర్షణ మాత్రమే సమాజాభివృద్ధికి గీటురాయి కాదు. మనుషులందరూ ఆర్థిక (వర్గ) ప్రయోజనాల ప్రకారమే జీవించడం లేదు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల్లో కమ్యూనిస్టు విప్లవాలు సంభవించలేదు. రాజ్యం వాడిపోయి రాలిపోలేదు. వర్గరహిత సమాజం సిద్ధించలేదు. నూతన విలువలు ఆవిర్భవించలేదు.

ఆర్థికస్వేచ్ఛ పేరిట కొనసాగిన కమ్యూనిస్టు దేశాల్లో రాజకీయ స్వేచ్ఛలేదు. రాజకీయ స్వేచ్ఛ పేరిట కొనసాగుతున్న ప్రజాస్వామ్య దేశాల్లో ఆర్థిక స్వేచ్ఛలేదు. ఒకస్వేచ్ఛకోసం మరోస్వేచ్ఛను బలిపెట్టడం స్వేచ్ఛాభావనకే విరుద్ధం.

మనుషుల మానప్రాణాలకు విలువనివ్వని సిద్ధాంతాలను నిస్సందేహంగా మానవవాద వ్యతిరేక సిద్ధాంతాలుగా, అభ్యుదయ నిరోధక సిద్ధాంతాలుగా పరిగణించాలి.

భౌతికవాదమంటే భౌతిక సంపదలను ప్రోగుచేసుకొని, భౌతికసుఖాలను అనుభవించడానికే పరిమితమవడం కాదు. అలాగని భౌతిక సుఖాలను కాలదన్నడం కూడా కాదు. భౌతిక సుఖసంతోషాలతోపాటు వైజ్ఞానిక, నైతిక, సాంస్కృతిక రంగాలలోను సంతృప్తిని పొందుతూ, ఆ రెండింటిని న్యాయమైన పాళ్లలో మేళవించిన స్వేచ్ఛావంతుడు,నీతివంతుడైన వ్యక్తి జీవితమే మానవవాదం దృక్పథంలో ఆదర్శప్రాయమైనది.

ఆదర్శప్రాయమైన జీవితాన్ని వర్ణిస్తూ ప్రాచీన భారతీయులు 'సత్యం, శివం, సుందరం' అనే త్రయాన్ని ప్రతిపాదించారు. గ్రీకులు కూడా వైజ్ఞానిక (సత్యం), నైతిక (సౌశీల్యం), కళా(సౌందర్యం) రంగాలలో మానవులు సాధించవలసిన విలువలను గురించి వర్ణిస్తూ "(సత్యం), (శివం), (సుందరం)" అనే త్రయాన్నే ప్రతిపాదించారు. ఆదర్శ ప్రాయమైన జీవితానికి ప్రాచీన భారతీయులు, గ్రీకులు తమతత్వాలలోని ప్రధానమైన విలువలతో ఏకీభవించడం కేవలం కాకతాళీయం కాకపోవచ్చు.

సత్యం, శివం, సుందరమనే త్రయాన్నే వివరించుకుంటే అవిమూడు విడివిడిగా అస్తిత్వాలను కలిగివుండలేదని తెలుస్తుంది. వీటిలో ప్రధానమైనది, మొదటిది సత్యం. సత్యం సాక్షాత్కారమై అవగాహన అయినపుడే శివానికి (మంచితనానికీ), సుందరానికి (కళ) అవకాశం కలుగుతుంది. సత్యం లేకపోతే శివంలేదు, సుందరంలేదు. అందువల్ల సత్యమేశివం, శివమే సుందరం అవుతుంది. ఇంతటి ఉన్నతమైన ఆదర్శ జీవితాన్ని ప్రతిపాదించిన భారతీయసంస్కృతి పారలౌకిక వేదాంత తత్వం కింద నలిగిపోయి సమాధికావడం చారిత్రక దుస్సంఘటనగా అభివర్ణించవచ్చు.

స్వేచ్ఛాదర్శానికి మించిన ఆదర్శం లేదు. మానవుడు ఆదిమదశలో తన మనుగడకోసం సాగించిన పోరాటాన్నే వివేకోద్వేగాల స్థాయిలో నేడు కొనసాగిస్తున్నాడు. అందుకే అది ఉన్నత జీవన పోరాటమైంది.

కారల్‌మార్క్సు కమ్యూనిస్టు ప్రణాళిక ప్రకటించిన వంద సంవత్సరాలకు-1948లో



30

ఎం.ఎన్. రాయ్ గా ప్రసిద్ధుడైన మానవేంద్రనాథ్‌రాయ్ హ్యూమనిస్టు మేనిఫెస్టోను ప్రకటించారు. రాయ్ అసాధారణ మేధావి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో అగ్రగామి, మార్గదర్శి. కమ్యూనిస్టు సిద్ధాంతంలోని లోపాలను గ్రహించి, సవరించి మహోన్నతమైన మానవవాదాన్ని ప్రతిపాదించిన తాత్వికుడు.

రాయ్ ప్రతిపాదించిన మానవవాదాన్ని రాడికల్‌హ్యూమనిజం అంటారు. ఆధునిక విజ్ఞానం ఆధారంగా రూపొందిన తత్వమే రాడికల్‌హ్యూమనిజం.

రాడికల్ హ్యూమనిజం తాత్విక రంగంలో భౌతిక వాస్తవికవాదాన్ని రాజకీయరంగంలో పార్టీరహిత, నిర్మాణాత్మక ప్రజాస్వామ్యాన్ని, ఆర్థిక రంగంలో సహకార ఆర్థికవిధానాన్ని ప్రతిపాదిస్తుంది.

అనూహ్యంగా అభివృద్ధి చెందిన ఆధునిక భౌతికవాదమే భౌతిక వాస్తవికవాదం. భౌతిక పరిస్థితులంటే ఆర్థిక పరిస్థితులు మాత్రమే కావు. భావాలు కూడా భౌతికపరిస్థితులలో భాగమే. సామాజిక పరిణామంలో భావాల విప్లవాత్మక పాత్ర అత్యంత కీలకమైనది.

మనుషులలో అభ్యుదయ భావాలు లేకపోతే సమాజం అభ్యుదయం కాజాలదు. రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడం ద్వారా సమాజంలో విప్లవాన్ని సాధించలేరు. పార్టీలు మారినా, ప్రభుత్వాలు మారినా, ప్రభుత్వాధినేతలు మారినా, చట్టాలు మారినా సమాజంలో ఆశించిన మార్పులు రావడంలేదు. అందుకే సమాజంలో సమూలమార్పు రావాలంటే సామాజికులైన వ్యక్తుల భావాల్లో సమూలమార్పు రావాలి. అదే భావవిప్లవం.

ప్రజాస్వామ్యభావం సామాజికమైనది. దానిని కేవలం రాజకీయాలకు పరిమితం చేయడం పొరపాటు. స్వేచ్ఛా సమానత్వ సౌభ్రాతృత్వాలను ప్రజాస్వామ్య విలువలుగా గుర్తిస్తున్నాం. అవి అన్ని రంగాలలోను ఆచరణలోకి రావాలి. నేడు అమలులో వున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కేవలం ప్రతినిధిస్వామ్యమే. ప్రతినిధులంతా పార్టీల వారైనందువల్ల అది పార్టీస్వామ్యమైంది. పార్టీలను నడిపించేది, నియంత్రించేది పార్టీనాయకులైనందువల్ల అది నాయకస్వామ్యమైంది. ప్రజాస్వామ్యం అపహాస్యమైంది.

అధికారం వాస్తవంగా ప్రజల్లో నిక్షిప్తమైవుండడమే ప్రజాస్వామ్యమవుతుంది. నేడు రాజకీయాలంటే పార్టీరాజకీయాలు, అధికార రాజకీయాలు, అవినీతి రాజకీయాలని రుజువైపోయింది. అధికారాన్ని కైవసం చేసుకోవడమే అన్నిరాజకీయపార్టీల ఏకైక లక్ష్యంగామారింది. దానికోసం అన్ని పార్టీలు అవినీతి కార్యకలాపాలతో పోటీపడుతున్నాయి. దీన్ని అంతం చేయాలంటే పార్టీరహిత రాజకీయాలే శరణ్యం.

పార్టీరహిత రాజకీయాలతో ప్రజలు స్థానిక ప్రజాసంఘాలుగా ఏర్పడాలి. ఈ ప్రజాసంఘాలే రాజ్యానికి పునాదిగా ఉండాలి. మండల, జిల్లా, రాష్ట్రస్థాయి సంఘాలను స్థానిక సంఘాలు ఎన్నుకోవాలి. రాజకీయ విధులు, రాజకీయాధికారం వికేంద్రీకరించబడాలి. స్థానిక ప్రజాసంఘాలపునాదిపై నిర్మించిన పిరమిడు ఆకారంలో రాజ్యం వుండాలి. అప్పుడే నిజమైన ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది.

రాడికల్‌హ్యూమనిజం ఆర్థికరంగంలో ప్రతిపాదించిన సహకార ఆర్థిక విధానంలో

ప్రధాన ఉత్పత్తిసాధనాలు, పంపిణీ, వినిమయం వ్యక్తిగత పెట్టుబడి దార్లకు గాని, ప్రభుత్వానికి గాని చెందవు. అవన్నీ ఆయా సంస్థలలో పనిచేసే కార్మికులందరికి చెందుతాయి. ఆ విధంగా యజమాని, కార్మికులమధ్య గల వైరుధ్యం తొలగిపోతుంది. పెట్టుబడిదారీ ఆర్థికవిధానానికి, కమ్యూనిస్టు ఆర్థిక విధానానికి ప్రత్యామ్నాయ ఆర్థికవిధానమే సహకార ఆర్థిక విధానం. ప్రణాళికాబద్ధమైన, వికేంద్రీకృత ఆర్థిక విధానం ద్వారా ఆర్థిక స్వావలంబన సాధించవచ్చు.

అన్నిరంగాలలో ఆశించన మార్పులు రావాలంటే ముందుగా ప్రజలు చైతన్యవంతులు కావాలి. ప్రజలు చైతన్య వంతులు కావాలంటే వారి భావాల్లో, దృక్పథాల్లో సమూల మార్పురావాలి. అటువంటి మార్పును సాధించడానికే భావవిప్లవోద్యమం రావాలి. తద్వారా తాత్వికరంగంలో, సాంస్కృతికరంగంలో విప్లవాత్మకమైన మార్పులు చోటుచేసుకోవాలి.

రాడికల్ హ్యూమనిజం ప్రతిపాదించి, కృషి చేస్తున్నది అటువంటి మహోన్నత భావవిప్లవోద్యమ నిర్మాణానికే. మనమంతా ఆ మానవవాదం ఉద్యమంలో భాగస్వాములం కావాలి. భావవిప్లవం సాధించాలి.

---

Science is the result of and the instrument for acquiring more and more knowledge, which enable man to outgrow progressively the limitations set to the development of his mind and spirit by old ideas, ideals and notions which resulted from the primitive ignorance of humanity in its infancy.

**(Renaissance Movement) - M.N. Roy.**

The Renaissance is a rebirth of man. Man must remember that everything that exists in society was created by men who preceded him, and it was created for the progress and happiness of mankind. Confronted with social institutions or political organisations which are antagonistic to the progress and hapiness of mankind, which bind men instead of liberating them, man must feel the necessity of breaking those bonds, so that he can make further progress. But in order to have the confident that he can do that man must remember himself. That is the rebirth of man as man. Men have been either slaves of gods or the servants of kings or of best devotees of some religion. But man must be man for himself, if he wants to work his own salvation.

**- M.N. Roy.**

# కవిరాజు హేతువాదం

సేకరణః- రావిపూడి.

ఏటి కోళ్లు ః

గొంటలుల తుంటరుల గుమిగూర్చి సృష్టి
చేసి, చీటికి మాటికి డాసివారు
తన్నుకొని చచ్చుచుండంగ తనియుచుండు
గొప్పవానికి జేజేలు కుప్పుసామి. కు.శ. 1

లోకాలెన్ని? సృష్టికర్తలెందరు?

ఏడొ, పద్నాలుగో, మూడొ ఎన్నొ, జగము
లెల్ల సృష్టించినటువంటి ఈశుడొకరొ,
ఇర్వరో, ఎందరో, వారికెల్ల ఏటి
కోళ్ల అర్పింతు భక్తితో కుప్పుసామి. కు.శ. 2

సృష్టిస్థితిలయాలకు కర్తవున్నాడా?

ఏ బదునాల్గు లోకముల సృష్టి ఒనర్చుచు, పెంచి, పిమ్మటన్
దూబవలెన్ హరింతునని దొంగనుడుల్ వచియించుచుంటివే!
ఏబదిమాటలేమిటికి? ఇట్టి ప్రచారము మానకున్నచో
గూబలు సాగదీసెదను, కూయకుమట్టివి ధూర్తమానవా! కు.శ. 1

సృష్టికార్యాన్ని చూచినవారెవరు?

ఎవ్వరు చూచినారు సృజియింపగ ఈపదునాల్గు లోకముల్
సువ్వన సువ్విసువ్వి అనుచొప్పెకదా! ఒకడైన చూచెనే,
దవ్వుల నుండియైన, ఒకదానిని ఐన? వృధా ప్రగల్భముల్
నవ్వులపాలు చేసెదవె నన్నిటులాడుచు ధూర్తమానవా. కు.శ. 2

ఏటేటా దేవుడి పెళ్లా?

ప్రతివర్షంబును నావివాహమను పేరన్ పెక్కుచందాల దు
ర్మతి చందాలు వసూలు చేసి ప్రతి ఊరన్ గజ్జకట్టింతువే,
గతి ఈమాత్రములేదె నాకరయ? నే కావించుకోలేనె? ఈ
గతి నన్నీవు పరాభవించుటకు సంకల్పింతువే మానవా! కు.శ. 3

దేవుడికి కూడా నిత్యావసరాలా?

కాపురముండ ఇల్లు, అడకత్తెరలో పడియుండ పెండ్లమున్,
మాపులు కున్కగా పడక మంచము, ఎక్కగ ఎక్కిరింతలున్,
సా పడపైడికంచమును చక్కగ కూర్చి ఉపన్యసింతువే?
నీపని పట్టెదన్ వినుము, నీవిది మానవ ధూర్తమానవా! కు.శ. 4

**దేవుడు మనిషివలెనే వుంటాడా?**

కొసకేమౌనొ ఎరుగకుండ ఉసితోకోణంగివై నీవు నీ
పుసికన్నుల్, మసిముక్కు, దేబెమొగమున్, పువ్వాదుపెన్ బోరెమున్,
తొసినోరున్ కలిగించి వంచకుడవై దుర్జాతి, నన్నొక్కమా
నిసినిన్ చేసెదవే! మనుష్యుని వలెన్ నేనుంటినే మానవా! కు.శ. 5

కాలున్ చేతులు, ముక్కు మోములును, చంకల్ చన్నులున్, పేర్లు నీ
కేలా ఉన్నవొ నాకు అట్లె కలవా? ఈరీతిగా నన్ను నీ
వేలా వర్ణన చేసినాడ వకటా! ఎందాక సైరింతు? నిన్
పాలార్తున్ మునుమున్న చెప్పితిని నీపాట్లన్నియున్ మానవా? కు.శ.6

**పేరు దేవుడిది, తినేది పూజారి**

గుడులున్, గోపురముల్ కుశీలవుడవై కూర్పించి చందాలతో
మడిమాన్యంబులు నాదు పేరుననె నిర్మాణంబు కావించుచున్
వడపప్పున్ పెరవారికిచ్చెదవె? నీభావంబునందేమి గీ
ల్పడగా నేర్చెడి? చెప్పుమింతటి దివాలాఖోరువే మానవా! కు.శ. 7

**దేవేంద్రుడి కోసం దేవుడు బలిని చంపాడా?**

బలి ఏ పాపము చేసినాడతనిపై వైరంబు నాకేల? త
ద్బలి రాజ్యంబు హరింప వంచకుడనై, ధర్మంబు పోద్రోసి, దో
ర్బల హీనుండగు ఇంద్ర ప్రోవ అవతారం బెత్తినానంచు లో
కులు నమ్మన్ వచియింతు వింకయిన బొంకుల్ మానవా, మానవా! కు.శ. 9

పరులను, ధర్మదూరులను, బంధుర పాపనిమగ్న చిత్తులన్
కరుణను కాచి ప్రోచుటకుగా మురితో బలి చక్రవర్తినిన్
తిరిపెము ఎత్తినాడనని దేబిరిగొట్టు మొగంబ, ఎల్లెడన్
నిరతము చాటుచుండెదవె? నీ పని పట్టెద ధూర్తమానవా! కు.శ. 10

తనువెల్లన్ గులపెట్టి జీర్ణసుఖ రుగ్ద్రు వృథా పీడచే
త అహూరాత్రులు కామ తృప్తి కొరకై తారాడు స్వర్లోక నా
ధుని పక్షంబయి దాన శీలుని, మహత్పూజ్యున్, బలిన్, సత్యవా
క్యనిరూఢున్ బొలియించి నా ననుచు పల్కన్ చూతువే మానవా! కు.శ. 11

**పరుశురాముడు అపక్షాత్రం చేశాడా?**

ఒక్కడు తండ్రి చంపెనని ఓరిమిలేక యె గండ్రగొడ్డటన్
చక్కడగింప ధర్మువగునా కులమంతయు? దీని చేయనే
నొక్కడనే కనంబడితినో! ఇటువంటివి పూర్వమందు ఏ
దిక్కులనేని విన్నడెనె? తిక్కవదల్చెద ధూర్త మానవా! కు.శ. 12



40

**దేవుడి పెళ్లాన్ని లేపుకు పోవడమా?**

ఉడుగక తొల్లి పెండ్లమును ఒక్కతె నామెడ కంటగట్టి ఆ
బిడ నెవడో హరించెనని వెంగలి మాటలు చెప్పి ఆమెకై
ఎడతెగకుండ బావురని ఏడ్చితి?ంచును ఎన్నిరోజులో
బడబడ పెద్దగ్రంథములు వ్రాసితివేమిర? ధూర్త మానవా! కు.శ. 13

**రాధామాధవం**

మిడిమేలంబుగ తెచ్చి పెట్టితివిగా మేనత్తతో కూటమిన్
పడి ముప్వంకల ముండతోడ మధురా పట్నంబులో కూటమిన్
మెడకున్ కట్టితివెంత వాడవుర! నీమిట్టాటలన్ మానవా?
కడికండల్ తెగకోసి వైచెదను కాక శ్రేణికిన్ మానవా! కు.శ. 14

**దేవుడు అవతారాలెత్తి ఏమిచేశాడు?**

అవతారంబుల ఎత్తిచేయగల అన్యాయంబులన్నింటి ఏ
నవతారంబుల ఎత్తకుండ మరి చేయన్ శక్తి లేదంచు న
న్నవమానించితి వింత కాలమిటు; నిన్నాపాదమస్తంబుగా
నివురున్ చేసెద, ఎవ్వరడ్డుపడగా నీకుండిరో మానవా! కు.శ. 15

**స్మృతులు దేవుడు చెప్పినవేనా?**

స్మృతులన్ వ్రాసితినందు; వాస్మృతులలో చిత్రించి శ్రుత్యర్థముల్
ప్రతిపాదించితి నందు; వయ్యది నిజంబా? ఎంత కాలంబుదు
ష్కృతిసాగింతువు, లోకవంచనములన్ చేయింతువో, చేతువో
పతితాత్మా, ఇకనైన ఈ వెడగు త్రోవల్ మానవా? మానవా! కు.శ. 16

**ఏమిటక్కులు!**

కలలో కన్పడు చుండు, బట్ట బయలన్ కన్పట్ట రాకుండు, క
ర్దలు గ్రంథంబులు చెప్పు, కట్టెదుట ప్రత్యక్షంబు చెప్పండు, లో
కులు కల్లోలపడంగ ఈగతిని టక్కుల్ చెప్పు మాయావికిన్
తలతిక్కన్ వదలింతు నీపయిని చిత్తభ్రాంతి పోయానవా!

**దేవుడు గతిమాలినవాడా?**

ఈటకటొంకులేమిటికి? ఇల్లును వాకిలికట్టిపెట్టి ఏ
టేటను పెండ్లి చేయమని ఏ'నెపుడైనను కోరియుంటినే?
చీటికి మాటికన్ పరుల జేబులు కొట్టుట ధర్మమారమే?
ఏటికి ఈ అబద్ధమరరే! ఇకసాగునె? ధూర్తమానవా!

**పేరుదేవుడిది, అనుభవం పూజారిది**

బొక్కెడు కూడు పట్టుమని పొట్టకుతింటినె ఒక్కపూటయేన్?
చక్కగ ఒంటినిండ ఒకజానెడుగుడ్డను కప్పుకొంటినే?
ఒక్కటియేని ముచ్చిలక ఉంచితివే? ఇకనీదుపాటులే
నక్కయు కుక్కయున్పడదు నాపలుకుల్విను ధూర్తమానవా!

పేదరికానికి దేవుడు కారణమా?

పొక్కిలిగడ్డలేక, తనపొయ్యికి కట్టెలులేక, మంటకున్
పిక్కినకుండలోనికిని బియ్యపు నూకలులేక,గంజిలో
లెక్కకు ఉప్పుకల్లయినలేక కృశించెడిపేదవానికిన్
రెక్కలుడుల్చి సిల్గులహరింతునె? చెప్పరధూర్తమానవా!

సంస్మరిస్తేనే స్వర్గం

మరణపుశయ్య మీద ఒకమారయినన్ నను తప్పకుండ సం
స్మరణము చేసినంతటనె స్వర్గము వచ్చునటందు, వేగతిన్
బొరయును? ఇట్లెనీవెపుడు బొంకుచు ఉందువు దీనికైనినున్
కరకర గొంతుకోసెదను కానివిచెప్పకు ధూర్తమానవా!

జాతుల తారతమ్యం

ఏనొకజాతి కూడు భుజియించుచు మిక్కిలితక్కు జాతులన్
హీనముకాగ చూతునని ఎవ్వరుచెప్పిరి నీకు వంచకా?
మానవులందరున్ సరిసమానులు కారొకొనాకు? మాయురే!
మానకనీవ ఇట్టిఅవమానము చేతువె ధూర్తమానవా!

దొంగభక్తి

త్వరపడకుండ సంజపడు దాకను తప్పుపనుల్ పొనర్చి పై
పొరుగున ఉన్నతోటలను పూవులు ముచ్చిలికోసితెచ్చి నా
శిరమున పోసినంతటనై చేసినపాపము లొక్కసారిగా
మరచెడు నట్టివెంగలినె? మానవఇట్టివి ధూర్తమానవా!

విగ్రహారాధన

ముక్కుమొగముచెక్కి మూలవిరాట్టంచు, ఒక్కరాయి తెచ్చి ఉంచి గుడుల
కూడు గుడ్డలిచ్చి కొల్తురుప్రజలెల్ల, కొంటెపనులు కావె కుప్పుసామి. కు.శ.

వెంట్రుకలలంచం

మ్రొకు కలదది చెల్లింప బోదుమంచు, కొండలెక్కి ఏరులుదాటి కొట్టకొనకు
జుట్టు ఇత్తురు దేవుండు క్షోభపడడె, కూకటులచిక్కు తెలియక కుప్పుసామి.

మతమనుమాటమోసము సుమా!

మతములు జ్ఞానబోధకపుమార్గము చక్కగ చెప్పిలోకస
మ్మత మగునట్టి ధర్మము సమాచరణంబున పెట్టకున్న ఏ
గతి తరియింపవచ్చును! ఒకానొకడేనియుముక్తి పొందునే?
మతమనుమాట మోసముసుమా! ఇదె మూలము ధర్మపీడకున్

మారణ కర్మలకు మతంమూలం

మతములెపుట్ట కున్నయెడ మారణకర్మములిన్నిసాగునే
ప్రతిదివసమ్ము భారత ధరాస్థలి? నేనిటు వంటి కర్మసం

తతులనుసైచువాడనె? సనాతనధర్మమొకండె యంచున
మ్మితిరుగు వారికెల్లపుడు మేలొన గూర్చుచు ఉందుప్రేమమై

**దూర్తుల్లోలెక్కతేలిన మతస్థుడు.**

మతముల పేరిటన్ పరుల మానము, ప్రాణము పుచ్చువాడునున్
కితవుడు, ధూర్తుడున్, శఠుడకించను దర్థము వడ్డికిచ్చుచున్
బ్రతుకు కుసీదికుండు అతిపాత పరాన్నుడు-వీరికెందు స
ద్గతులను మాట సుంతపొడకట్టవు నమ్ముము నావచంబులన్

**హింస, అహింస- రెండూ మోక్షసాధనాలేనా?**

హింసకాదనుచు జిఘాంసబుద్ధి, అన్నికర్మముల్ చేయించునట్టి మతము
అఖిల హింసాపరా ఙ్ముఖమైనమతము, రెండు ఒక్కసర్వేశు ఏరీతి చేర్చు

## మానవ మూలకాలు

గాబ్రియల్ బెట్రాండ్ అనే ఫ్రాన్సు దేశపు జీవరసాయిన శాస్త్రవేత్త 100 కిలోగ్రాములు బరువు వుండే మనిషిలో ఈ క్రింది మూలకాలు ఈ విధంగా ఉంటాయని లెక్కగట్టాడు.

| | | |
|---|---|---|
| ఆక్సిజన్ | - | 63 కిలోగ్రాములు |
| కార్బన్ | - | 19 " |
| హైడ్రోజన్ | - | 9 " |
| నైట్రోజన్ | - | 5 " |
| కాల్షియం | - | 1 " |
| ఫాస్ఫరస్ | - | 700 గ్రాములు |
| సల్ఫర్ | - | 640 " |
| సోడియం | - | 260 " |
| పోటాషియం | - | 222 మి.గ్రా |
| క్లొరిన్ | - | 180 మి.గ్రా |
| మెగ్నీషియం | - | 40 గ్రాములు |
| ఇనుము | - | 3 గ్రాములు |

ఇతర మూలకాలతోపాటు బంగారం కూడా వుంది.

సేకరణ : మేదూరి

# ఐన్‌స్టీన్ భావాలు

(ఐన్‌స్టీన్‌ని తప్పుగా కోట్‌చేసేవారికి ఆయన మాటలే సమాధానంగా ఉపయోగపడగలవనే ఉద్దేశంతో శాస్త్రం, మతం, దైవం మీద ఐన్‌స్టీన్ వెల్లడించిన భావాలను కొన్నిటిని ఆయన వ్యాసభాగాలనుండి అనువాదం క్రిందయిస్తున్నాము.)

**1. మతం-శాస్త్రం**

మానవజాతి చేసిందంతా, ఆలోచించిందంతా అత్యవసరాలు తీర్చుకోవడం కోసమూ, బాధనుంచి విముక్తి చెందడంకోసమూ చేసిందే. భావోద్యమాలనూ, వాటి అభివృద్ధినీ అర్థంచేసుకోదలచుకొన్నవారు ఈ విషయాన్ని మనసులో వుంచుకోవాలి. అనుభూతి, ఆకాంక్ష మానవుడు చేసే ప్రతిపనికి వెనుకవున్న చోదకశక్తులు. అయితే మనిషిని మతాలోచనకు పురికొల్పిన భావాలు, అవసరాలు ఏమిటి అని కొంచెం ఆలోచిస్తే-మతాలోచన, అనుభూతి రకారకాల ఉద్వేగాలనుంచి బయలుదేరతాయని తేలుతుంది. ఆకలి. క్రూరమృగాలు, రోగం. మరణం వగైరాలను గురించిన భయమే మానవుడిలో మత భావాలను రేపింది. ఆ దశలో అతనికి కార్యకారణ సంబంధాలు సరిగా అర్థం కాలేదు. అందువల్ల తనవంటి వ్యక్తుల్నే మనస్సులో సృష్టించుకొని. వారి సంకల్పాలవల్ల. చర్యలవల్ల ఈ భయోత్పాతక సంఘటనలన్నీ జరుగుతున్నాయని భ్రాంతి చెందాడు. ఆ శక్తుల్ని తృప్తిపరచడానికి సంప్రదాయంనుంచి తనకు సంక్రమించిన ఆచారకాండ జరుపుతూ, బలులిస్తూ, వారిని ప్రసన్నం చేసుకోడానికి ప్రయత్నించాడు. ఇక్కడ నేను భయానికి సంబంధించిన మతం గురించి మాట్లాడుతున్నాను. ఆ భయంకర శక్తులకూ, ప్రజలకూ మధ్యవర్తిగా పురోహితవర్గం ఒకటి బయలుదేరి తన ఆధిపత్యాన్ని నెలకొల్పుకుంది. తమ అధికార భద్రతకోసం నాయకుడో, పాలకుడో, వర్గమో లౌకిక ఆధిపత్యానికి తోడుగా చాల సందర్భాలలో పౌరోహిత్య ఆచారకాండను కూడ తమ అధీనంలో వుంచుకొన్నారు. ఒక్కొక్కసారి రాజులు, పురోహితులూ కలిసి తమ స్వార్థం కోసం ఉమ్మడిగా ఆ పని చేసుకొన్నారు.

మతం రూపొందడానికి సామాజిక ప్రేరణలు మరొక కారణం. తల్లిదండ్రులు, జాతినేతలు మరణిస్తారు. వారి దర్శకత్వం లేనందువల్ల తప్పు చేసే అవకాశం వుంది. అందుచేత మార్గదర్శకత్వం కోసం, ప్రేమ కోసం, అండ కోసం సామాజిక నైతికభావంతో మనుషులు దైవభావం యేర్పరచుకొంటారు. ఆ దైవం కటాక్షిస్తాడు, రక్షిస్తాడు, భక్షిస్తాడు, వరాలిస్తాడు, శిక్షిస్తాడు. ఆయన జాతి రక్షకుడు, జగద్రక్షకుడు, దుఃఖనివర్తి, సర్వవరదుడు, ఇది దేవుణ్ణి గురించిన సామాజిక నైతిక భావన

భయానికి సంబంధించిన మతంనుంచి నైతిక మతందాక చెందిన అభివృద్ధిని యూదుశ్రుతులు బాగా వర్ణించాయి. అది కొత్త నిబంధనలోను కొనసాగింది. నాగరిక ప్రజల మతాలన్నీ, ముఖ్యంగా ప్రాచ్యులవి, ప్రధానంగా నైతికమతాలు. భయచోదిత మతంనుంచి నైతికమతం దాకా వృద్ధిచెందడం ప్రజాజీవనంలో పెద్ద పురోగమనమే అయినా, ఆదిమతాలు భయంమీదనూ, నాగరికుల మతాలు నైతికత మీదనూ ఆధారపడ్డాయనే దురభిమానాన్ని

మనం నిగ్రహించుకోవాలి

నిజానికి మతాలన్నీ పై రెండురకాల కల్తీసరుకే. తేడా యేమంటే ఉన్నతస్థాయి సామాజిక జీవితంలో నైతికమతానిది పైచేయిగా వుంటుంది.

ఈ అన్నిరకాల మతాలకూ సమానంగావుండే భావం యేమంటే "మనిషి దేవుడి రూపంలో వున్నాడు" అనేది. సాధారణంగా కొద్దిమంది మానసిక వికాసం కలవారో, ఉన్నత మానసికస్థాయి చేరుకొన్న జాతులలో తప్ప ఈ మట్టాన్ని దాటి ఆలోచించరు. అయితే యెక్కడ పరిశుద్ధంగా కన్పించకపోయినా, వీళ్ళందరికీ చెందిన మూడోదశ మతానుభూతి వుంది. దాన్నే నేను విశ్వమతభావన అంటాను. ఇందులో మానుషరూప దైవభావన వుండదు కాబట్టి, ఆ భావం బొత్తుగా లేనివారికి దాన్ని వివరించడం కష్టం. మానవుడు ఒకప్పుడు ఆకాంక్షల యొక్క లక్ష్యాలయొక్క నిష్ప్రయోజకత్వాన్ని గూర్చిన విరక్త భావనను పొందుతాడు. ప్రకృతిలో, ఆలోచనా ప్రపంచంలో వ్యక్తమయ్యే అద్భుత క్రమంలో సంలీనభావాన్ని పొందుతాడు. అతనికి వైయక్తిక అస్తిత్వం బందిఖానా వలె కన్పిస్తుంది. విశ్వాన్ని మొత్తాన్నీ ఒక్కమొత్తంగా అనుభూతి పొందాలని కోరుకొంటాడు. ఈ విశ్వమత భావన ప్రారంభం కావడాన్ని మనం దావీదు కీర్తనల్లోనూ, కొంతమంది ప్రవక్తల్లోనూ చూడవచ్చు. షోపెనోవర్ రచనల ద్వారా మనకు తెలిసినదాన్ని బట్టి దాని తాలూకు బలమైన వస్తువు బౌద్ధంలో వుంది.

యుగయుగాల మత మేధావుల్లో ఈ రకమైన మతభావన వుండడం వల్లనే వారు విశిష్టులైనారు. దానిలో మూఢ మతసూత్రాలు, మానుషరూప దైవం వుండవు. వాటిని ఆధారంగా చేసుకొని బోధలుచేసే మతపీఠం (చర్చి) వుండదు. ఈ రకమైన ఉన్నత మతభావం ప్రతియుగంలోనూ పాషండుల్లో మాత్రమే కన్పిస్తుంది. సమకాలికులు వారిని నాస్తికులుగా, కొన్నిసార్లు యోగులుగా కూడా గుర్తిస్తారు. ఈ రకంగా చూచినప్పుడు డెమోక్రిటస్, ఫ్రాన్సిస్ ఆఫ్ అసిస్, స్పినోజా లాంటివారు సన్నిహితులుగా కనపడతారు.

విశ్వమతభావం స్పష్టమైన దైవభావాన్ని గాని, ఆస్తికత్వాన్ని గాని కలిగించకపోతే- దాన్ని ఒకరినుంచి మరొకరికి తెలియపరచడం యెలా అనేది ప్రశ్న. ఆభావాన్ని అందుకొనేవారందరిలోనూ దాన్ని మేల్కొలిపి బ్రతికించడమనే ముఖ్య కర్తవ్యం నా దృష్టిలో కళది, శాస్త్రానిది.

శాస్త్రానికీ, మతానికీ మధ్యవుండే సంబంధాన్ని గురించి ఆ విధంగా మనం సాంప్రదాయికతకు భిన్నమైన భావానికి చేరతాం. చారిత్రంగా చూచినప్పుడు శాస్త్రం, మతం సమన్వయ సాధ్యంకాని వైరుధ్యాలుగా కన్పిస్తాయి. కారణం స్పష్టమే. కార్యకారణ సిద్ధాంతాన్ని తీవ్రంగా పరిగణించేవారు, కార్యకారణ నియమం విశ్వంలో సర్వేసర్వత్రా పనిచేస్తున్నదని చిత్తశుద్ధితో నమ్మేవారు ప్రపంచగతిలో మరెవ్వరి జోక్యమో వున్నదనే భావాన్ని క్షణకాలమైనా భరించలేరు. అటువంటివారికి భయపెట్టే మతంవల్ల కాని, సామాజిక నైతిక మతంవల్ల కాని ప్రయోజనం లేదు. మనిషి చర్యలనన్నిటినీ అంతర్గత, బాహ్యగత అవసరాలు నిర్ణయిస్తున్నాయి కాబట్టి మంచికి బహుమానం, చెడుకు శిక్ష విధించే దేవుడు అతని దృష్టిలో అచింత్యం. జీవంలేని

మనిషికూడా తన చర్యలను తాను బద్ధుడుకాడు. ఇలా అంటున్నందుకే సైన్సు నీతిని చిన్నచూపు చూస్తున్నదనే ఆరోపణ చేస్తున్నారు. కాని, ఆ ఆరోపణ అన్యాయం. సానుభూతి, విద్య, సామాజిక బంధాలు. అవసరాలు అనేవాటిమీద బలంగా మానవుడి నైతిక ప్రవర్తన ఆధారపడాలి. మతంమీద ఆధారపడనవసరం లేదు. మరణానంతరం శిక్షపడుతుందనే భయంగానీ, బహుమానం లభిస్తుందనే ఆశగానీ అతన్ని బంధిస్తే, మానవుడు దౌర్భాగ్యస్థితికి చేరుకొన్నట్లే.

కాబట్టి శాస్త్రాన్నీ, శాస్త్రజ్ఞుల్నీ మతస్థులెందుకు హింసించారో అర్థం చేసుకోవడం ఇప్పుడు తేలికవుతుంది. అంతేకాక విశ్వమతభావం శాస్త్రీయ పరిశోధనకు బలవత్తరమైన, అత్యుత్తమమైన చోదకశక్తి అంటాను. సిద్ధాంత సంబంధమైన శాస్త్రంలో అగ్రగామి కృషిని సాధించాలంటే, అపారమైన ప్రయత్నాలు, దానికి మించిన శ్రద్ధ ఎంతగా కావాలో గుర్తించినవారు మాత్రమే అలాంటి పనికి మూలమైన ఉద్వేగమూలాన్ని గ్రహించగలరు. **విశ్వంయొక్క హేతుబద్ధతను గురించిన దృఢనమ్మకం, అర్థంచేసుకోవాలనే తపన ఎంతవుంటే, కెప్లర్, న్యూటన్ ఖగోళయాంత్రిక సూత్రాలను విడమరచడంలో సంవత్సరాల కొలది ఒంటరిగా శ్రమిస్తూ కాలం గడిపేవాళ్ళు?** అది ఈ ప్రపంచంలో దుర్బల మనస్కులకు సాధ్యమయ్యే పనేనా? ఆచరణ ఫలితాలనిబట్టి శాస్త్రీయ పరిశోధనతో పరిచయం పెంచుకొన్నవారు కొందరున్నారు. తరతరాల శాస్త్రజ్ఞుల మనస్తత్వాన్ని గురించి వారు తప్పుడు అభిప్రాయాలను పోషించుకొంటారు. సత్యమార్గాన్ని చాటిన మహామహులు వారికి తేలికగా అర్థంకారు. ఆ శాస్త్రజ్ఞుల్ని ఏది ఉత్తేజపరిచిందో, ఎన్నెన్నో అపజయాల్ని తట్టుకొని కార్యసాధన చేయడానికి వారికి ఏది బలమిచ్చిందో, స్పష్టంగా అర్థంచేసుకోగల వారు అలాంటి లక్ష్యాలకోసం జీవితాన్ని అర్పించేవారే. మనిషికి అలాంటి బలాన్ని యిచ్చేది విశ్వమత భావమే. ఒక సమకాలికుడన్నట్లు ఈ భౌతికవాద యుగంలో దీక్షాపరతంత్రులయిన శాస్త్ర పరిశోధకులే గట్టి మతస్థులు.

(ది.9-11-1930 **న్యూయార్క్** టైమ్ మాగజైన్‌కు వ్రాసిన వ్యాసంనుండి)

**2. సైన్సు -మతభావం**

స్వకీయమైన మతభావం లేనివారు గట్టి శాస్త్రజ్ఞుల్లో కన్పించరు. అయితే, అది పామరుడి మతభావానికి భిన్నం. పామరుడి దృష్టిలో దేవుడొక మహావ్యక్తి. అతడేమో యిస్తాడని ఆశ, ఏదో చేస్తాడని భయం. తండ్రిముందు బిడ్డయెంతో, దేవుడిముందు మనిషి అంతే.

కాని, శాస్త్రజ్ఞుడిది విశ్వ కార్యకారణ భావం. అతని దృష్టిలో గతంలాగానే భవిష్యత్తు కూడా ప్రతి లవవేశం అవసరమూ, నియతమూను. నీతిలో దైవికం యేమీలేదు. అది పూర్తిగా మానవ విషయం. ప్రకృతి నియమాల్లోని సామరస్యత పట్ల ఆహ్లాదకరమైన సంభ్రమాశ్చర్యాల రూపంలో అతని మతభావం వుంటుంది.? ప్రకృతి నియమాలలోని మేధతో పోలిస్తే మన క్రమబద్ధ ఆలోచన, కార్యాచరణ పూర్తిగా అప్రధానమైన ప్రతిబింబమవుతుంది. ఈ భావమే అతని జీవితానికీ, కృషికీ మార్గదర్శక సూత్రం. స్వార్థ కాంక్షాశృంఖలాలకు బందీ కానంతవరకు అదీ అంతే. తరతరాల మత మేధావుల్నీ ఆవహించింది కూడా ఇలాంటి తత్వమే.

(1934లో ఆమ్‌స్టర్ డామ్‌లోని **మీర్‌వెల్డ్ బిల్డ్‌కు** వ్రాసిన వ్యాసంనుండి)

# వేదాదుల్లో ఆధునిక విజ్ఞానం?

-రావిపూడి

విజ్ఞానమనేది ఒక వాహిని. ఆదిమ జిజ్ఞాసువుతో పుట్టిన విజ్ఞానవాహిని మట్టం నానాటికి పెరుగుతూనే వస్తున్నది. అయితే ప్రకృతి వుత్పాతాల వల్లకానీ, ఇతరకారణాలవల్ల కానీ, మధ్య మధ్య కొన్ని నాగరిక జాతులంతరించినట్లు చరిత్రకారుల బోగట్టా. దానితో పాటు విజ్ఞాన ప్రవాహానికి కొంత అంతరాయం కలిగి వుండవచ్చు. ఎన్నో నాగరికతలతో పాటు, మానవజాతులుకొన్ని భూగర్భంలో కలిసిపోయి వుండవచ్చు. వాటితోపాటు కొంత వైజ్ఞానిక వారసత్వాన్ని మానవజ-తి కోల్పోయివుండవచ్చు. ఎన్నో గ్రంథాలు నాశనమైపోయి వుండవచ్చు. ఈస్థితి భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ కూడా సంభవించి వుండవచ్చు. అయితే గ్రంధరూపంలో, కథలు-గాధల రూపంలో మనకు సంక్రమించిన సమాచారం నుంచి ప్రాచీన విజ్ఞానాన్ని కానీ, చరిత్రను కానీ బయటకు తీసేటప్పుడు మనం దాన్ని తూర్పార పట్టి, తాలు-తపక తీసివేయ వలసి వుంటుంది. అజ్ఞానం నుంచి విజ్ఞానాన్నీ, అబద్ధం నుంచి నిజాన్నీ, పురాణం నుంచి శాస్త్రాన్నీ, కట్టుకథల నుంచి చరిత్రను వేరు చేయవలసి వుంటుంది. అలాచేసి నికరంగా బయటకు తీయబడిన ప్రాచీన విజ్ఞానం గ్రీకులది. అందుకే గ్రీకుల విజ్ఞాన చరిత్రమీదమనకు కావలసినన్ని గ్రంథాలు దొరుకుతాయి. ప్రాచీనకాలంలో చాలా దేశాల్లో విజ్ఞానం పరిఢవిల్లి నప్పటికీ, కాలక్రమం ప్రకారం, క్రానలాజికల్‌గా దానికి చారిత్రక స్వరూపం యివ్వడం యింతవరకు సాధ్యం కాలేదు. యూరపియన్ జ్ఞాన పునర్వికాస యుగంలో ఎందరో పండితులు, జిజ్ఞాసువులు, మేధావులు, గ్రీకు విజ్ఞానాన్ని అధ్యయనం చేసి, క్షోదక్షమంగా తరిచారు. మనవారు పనసలు వల్లించినట్లు వారు గ్రీకు సాహిత్యాన్ని వల్లిస్తూ కూర్చోలేదు. "వెర్రి కుక్కలవలె వేదముల్ చదివేరు అన్వయింబు నెరుగరయ్యావార్లు" అని ఆక్షేపణలు చేయించుకోలేదు. గ్రీకు లెక్కడ వదిలారో, అక్కడనుంచి బయలుదేరి శాస్త్రజిజ్ఞాసను, తాత్విక జిజ్ఞాసను యూరపియనులు అభివృద్ధి చేయసాగారు. ఆ రకమయిన ప్రభావం గ్రీకు విజ్ఞానం వారిమీద చూపింది. అందుచేత వారు పురాణ కథల్లోని కల్లబొల్లి కబుర్లు చెప్పుకొంటూ కూర్చోలేదు. తమ తాతలదే గొప్ప అంటూ మౌఢ్యంలో కూరుకుపోలేదు. భారతీయులకున్నట్లే వారికీ వేదాలూ, పురాణ కథలూ వున్నాయి. వాటిల్లోనూ విమానాలూ, శస్త్రాస్త్రాలూ, శాపాలూ, వరాలూ, యోగవిద్యలూ వగైరాలున్నాయి. మనకున్నంత గొప్ప అబద్దాలుగా అవి వుండకపోవచ్చు. ఈనాటి శాస్త్రం లాంటి శాస్త్రం మనిషి అందికలోలేని యుగంలోనిమనిషి తన ఆశలకు, ఆకాంక్షలకు, కలలకు కథల్లో వాస్తవికతా రూపం యిచ్చాడు. కథలుగా మాత్రమే అవి వాస్తవాలు. సంఘటనలుగా అవి వాస్తవాలు కావు. అన్ని దేశాల కథల్లోనూ సూర్య చంద్రులతో మాట్లాడేవారు, వారితో పెండ్లీ-పెటాకులూ చేసుకనేవారూ, దేవతలకి పిల్లల్ని కనేవారూ, మంత్రాలకు చింతకాయలు రాల్చేవారూ వున్నారు, అవన్నీ వాస్తవాలని నమ్మలేము. అవి 'యెంతవరకు' వాస్తవము? వారి వూహలకేది ఆధారము ? అవేది తేల్చుకోడాన్నే శాస్త్రీయ పద్ధతి అంటాం.

ప్రాచీన భారతదేశంలో బహుథా విజ్ఞానం పెంపొందిన మాట వాస్తవం. అందునా, వైద్యవిజ్ఞానం (ఆయుర్వేదం), తత్వజిజ్ఞాస (దర్శనాలు-వుపనిషత్తులు) వున్నత స్థాయిలో

సాగినమాట వాస్తవం. అంత మాత్రాన వేదంలోనుంచి ఒక ముక్కా, పురాణంలో నుంచి ఒక ముక్కా ఏరుకొచ్చి, చచ్చిపోయిన సంస్కృతాన్ని హింసపెట్టి, కల్పిత గాధలకూ-తీయని కలలకూ ఆధునిక విజ్ఞాన శాస్త్రంపరంగా అర్ధాలు తీయడం తెలిసి చేస్తే ఆత్మవంచన అవుతుంది. తెలియకచేస్తే వున్మాదమవుతుంది. శ్లోకాలు అప్పగించి, వాటికి విపరీతార్ధాలూ-వికృతార్ధాలూ తీయడం గొప్ప ఘనకార్యం కాదు. పిచ్చి మాటలకు పెద్ద అర్ధాలు, పెద్ద మాటలకు పిచ్చి అర్ధాలు చెప్పిన "పండితులకు" మన సాహిత్య చరిత్రలో కొదవలేదు. అది మన బలం కాదు, బలహీనత అన్న సత్యాన్ని మనం గుర్తించడం ఎంత ఆలస్యమైతే, అంత నష్టం మనకే.

మన ప్రాచీనులలకు ఎంత శాస్త్రం తెలుసునో చెప్పే శాస్త్ర విజ్ఞాన చరిత్ర గ్రంథాలు మనకు లేవు. ఎందుకంటే, ఏది పురాణమో తేల్చి చెప్పగల సత్తా మనకు లేకుండా చేసింది మన ప్రాచీన సాహిత్యం. నలుగురూ నమ్మడానికి వీలుగా కాలక్రమ పద్దతిలో, శాస్త్రజ్ఞాన చరిత్రగా వ్రాయడానికి వీలయిన స్థితిలో అది లేదు. అందుకే మన ప్రాచీన విజ్ఞానాన్ని గురించి డాబులు కోసేవారు సైతం దానికొక శాస్త్రీయ చారిత్రకార్థం యివ్వలేక పోతున్నారు. పైగా,కొంత శాస్త్రం చదువుకున్న భారతీయుల్లో కొందరు లజ్జవిడిచి, ప్రాచీన విజ్ఞానానికి ఆధునిక అన్వయాలు తీస్తారు. వసంతరావు వెంకటరావు, గొబ్బూరి వెంకటానంద రాఘవరావు లాంటివారు రాసిన వ్యాసాలు, పుస్తకాలు ఇందుకు ఉదాహరణలుగా తీసుకోవచ్చు. ఆ వైఖరి నిజంగా నేర ప్రవృత్తికి నిదర్శనం. మరో రకమయిన అమాయక పండితులు కూడా వున్నారు. ముక్కుల నుంచీ, చెవుల నుంచీ, కుక్క లకూ, నక్కలకూ, కొండలకూ, కుండలకూ మనుషులు పుట్టినట్లూ, వారు మహాత్ములై పోయినట్లూ వున్న గాధల్ని నిజమని నమ్ముతూ, టెస్ట్‌ట్యూబ్ బేబిలు ఆ రోజుల్లోనే వున్నవని వాదన చేయడం నేర్చుకుంటారీ రకం. "మన " పూర్వులు రేడియోలూ, టెలివిజన్లూ, విమానాలూ, యాటంబాంబులూ, దూరదర్శినిలూ, సూక్ష్మ దర్శినులూ, విద్యుత్తూ వుపయోగించారని కూడా వీరు వాదిస్తారు. సూర్య కేంద్ర సిద్ధాంతం, గురుత్వాకర్షణ సిద్ధాంతం, పరమాణు సిద్ధాంతం, సాపేక్ష సిద్ధాంతం, జీవపరిణామ సిద్ధాంతం,.........అన్నీ "మన" పూర్వులకు తెలుసుననీ, వారికి తెలియనివి-ఆధునికులకు తెలిసినవి అంటూ ఏమీలేవనీ, అంతా మన వేదాల్లో- పురాణాల్లో వుందనీ వీరునమ్ముతారు. ఇతరుల్ని నమ్మించడానికి శ్లోకాలు వల్లిస్తారు. టి.టి.డివారు అలాంటి వారిని ఏరి పట్టుకొచ్చి, డబ్బిచ్చి వుపన్యాసాలిప్పిస్తున్నారు. పుస్తకాలు రాయించి అచ్చు వేయిస్తున్నారు. దిక్కుమాలిన దేవుడికి భక్తులు దానధర్మం చేసిన డబ్బును అలా వ్యర్ధంగా దుర్వినియోగం చేస్తున్నారు. ప్రాచీన విజ్ఞానాన్ని గురించి పరిశోధనలు చేయించ దలచుకొన్నవారు వాస్తవికతకు దూరంగా జరిగిపోరాదు. జాతి, మత, దేశ అభిమాన దురభిమానాలకు తావీయరాదు. అటువంటప్పుడే మన పూర్వులకూ, మనకున్నూ, మనం న్యాయం చేసుకున్న వాళ్ళమవుతాము. విమర్శనా దృష్టిలేనిదే విజ్ఞానానికి న్యాయం జరగదు. అయితే మన ప్రాచీనతను, విజ్ఞానాన్ని ఎవరైనా ప్రశ్నించినపుడు మన సొమ్మేదో పోయినట్లుగా గగ్గోలు పెట్టడం ఆరోగ్య లక్షణంకాదు. మన ఘనతతోపాటు, లోటు కూడా తెలుసుకోవడం ముఖ్యం.

సంస్కృత సాహిత్యం చాల విస్తృతమైనది. అది ఒకరోజున ఒకరు రాసింది కాదు.



48

వేదమున్నూ అంతే. అయితే అన్ని మతాలవాళ్ళు తమ పవిత్ర మత గ్రంథం దేవుడి హక్కు అని అంటారు. నిజానికి ఏ మత గ్రంథంలోనూ ప్రకృతి సత్యాలను గురించి సరయిన అంచనా లేదు. నిజంగా అవి దేవుడి హక్కులైతే, వాటిని నుడివిన దేవుళ్ళు యినాటి మనిషికున్నంత జ్ఞానం లేనివాళ్ళు కావాలి. చచ్చిన వాళ్ళను పితృ దేవతలుగా పూజించే ఆచారమున్న మతస్థులు ఆయా గ్రంథస్థ విషయాలు చెప్పి చచ్చిన వాళ్ళను దేవుళ్ళుగా పరిగణించడంలో విడ్డూరంలేదు. కాబట్టి ఆ గ్రంథాల్లోని విషయాలను చెప్పి చచ్చిన మషులే మనవారి రుషులూ, దివ్యపురుషులూ, దేవుళ్ళూ.

వైదిక వాఙ్మయాన్ని పరిశీలిస్తుంటే ఒక గ్రంథానికీ, మరో గ్రంథానికీ పొంతన వుండదు. ఒకే గ్రంథంలో కూడా ఒక అధ్యాయానికీ మరో అధ్యాయానికీ– ఒక శ్లోకానికి, మరో శ్లోకానికి పొంతన వుండదు. పరస్పర విరుద్ధాంశాలు, అసంభావ్యాలు గుట్టలు గుట్టలుగా పడి వున్నాయి.

వేదాలింతవరకూ పూర్తిగా తెలుగులోకి రాలేదు. వినయాశ్రమం వారు బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారి ఆధ్వర్యాన తెనిగించి అచ్చువేయించినంత వరకు చూస్తే, వేదాల్లో ఆనాటి మానవుడి ప్రార్ధనలు తప్ప మరేమీ లేదని తేలిపోతుంది. ఐనా,అంతా వేదాల్లోనే వుందంటూ దంభించేవారు ఈనాడు టి.టి.డి. (తిరుమల తిరుపతి దేవస్థానం) పోషణ క్రింద పుట్టుకొస్తున్నారు. వ్యాస వాల్మీకాదులు పురేణేతిహాసాలన్నీ వ్రాశారని చెప్పే వీరు వారికంటె భిన్నమైన రీతిలో వేదాల్ని అర్థం చేసుకున్నట్లు తెలుస్తుంది. వారికంటె విశేషంగా కూడా వీరు అర్థాలు తీస్తున్నారు. అంటే వేదాదులు వ్యాస వాల్మీకాదులకు సరిగా అర్థం కాలేదని వీరు చెప్పే విపరీతభాష్యాలు రుజువు చెస్తున్నాయి. ఎందుకంటే, అధర్వణ వేదంలో ఒకచోట భూమి గోళంగా చెప్పబడిందనే దానికి మినహాయించి మన శృతిస్మృతి పురాణేతిహాసాల్లో ఎక్కడా భూమిని గోళంగా వివరించినట్లు లేదు. భూమి సూర్యుడిచుట్టూ తిరుగుతున్నదని వర్ణించినట్లు యెక్కడాలేదు. ఈ విషయాలు మన ప్రాచీన జ్యోతిశాస్త్ర గ్రంథాలకు తెలియవు. వ్యాస వాల్మీకాదులకు తెలియవు. అర్యభట్టు, బ్రహ్మగుప్త, పరాహమిహిర– భాస్కరాదులకు తెలియవు. ఆనాటి సంస్కృత శ్లోకాలకు ఈనాటి పరమపండితులు తీస్తున్న అర్థాలు అసలు వున్నవా? వుంటే సంస్కృత వాఙ్మయకర్తలందరికీ అలా ఎందుకు అర్థం కాలేదు? అర్థమయితే అలా తమ గ్రంథాల్లో ఎందుకు వ్రాయలేక పోయారు? భూమిచుట్టూ గ్రహతారకాది విశ్వ ప్రకృతి అంతా పరిభ్రమమిస్తున్నట్లు ఎందుకు రాశారు? మొదలైన ప్రశ్నలు మనకు వస్తాయి, ప్రకృతిని గురించి ఆధునికులకున్నంత విస్తృతమైన పరిజ్ఞానం ప్రాచీనులు కుండడానికీ వీలులేదు.వారికున్న విజ్ఞానం చాల ప్రాథమికమైనది. ఈనాటి విజ్ఞానం అద్భుత పరిధులు తాకుతున్నది. వైద్య విజ్ఞానం మంత్రోచ్ఛాటన వద్ద కూర్చునిలేదు. ఆధునిక భౌతిక విజ్ఞానం కణాదుడి అణువాదం దగ్గర లేదు. ఆధునిక రసాయన శాస్త్రం పరసువేదిని వెదుక్కుంటూ కూర్చోలేదు. ఈనాటి విజ్ఞానం కలకాదు. పేలపిండికథకాదు. అందువల్ల ప్రాచీనవిజ్ఞానం ఈనాటి విజ్ఞానం దరిదాపులకైనా రాదు. ఈవిషయాన్ని అవగతం చేసుకోవాలంటే., మన వేదాల్లో, రామాయణం, భారత, భాగవతాదుల్లో పురాణాల్లో– యింకా యితరత్రా సంస్కృత వాఙ్మయంలో ఎంత అజ్ఞానముందో, ఆ అజ్ఞానాన్ని శాస్త్రీయ విజ్ఞానమనీ, సైన్సు అనీ కొదరు వెర్రిబాగుల వాళ్ళు ఎలా భ్రమిస్తున్నారో గుర్తించాలంటే–ఆయా గ్రంధాలలో వున్న సైన్సును బయటపెట్టాలి. ఏయే ప్రాచీన గ్రంథంలో

ఏమి సైన్సు వుందో క్రమంగా చూద్దాం.

అప్పుడుగానీ, ఇన్నాళ్ళనుంచీ ఈ వెుునగాళ్ళంతా మంత్రాలతో రేడియోలూ-టెలివిజన్లూ, విమానాలూ - యాటంబాంబులూ... .... ఎందుకు నిర్మించలేదో అర్థం కాదు. ఇప్పుడయినా యీ అజ్ఞాన వేదపుత్రులు తమమంత్రశక్తితో, తమ అతీంద్రియ శక్తితో వాటిని నిర్మించి, విదేశాలకు ఎగుమతి చేయించి, విదేశీ మారకద్రవ్యం ఈ దేశానికి రానివ్వకుండా, ఈ దేశంలోని సంపద విదేశాలకు యెందుకు పోనిస్తున్నారో? తమకు తెలిసిన విజ్ఞానరహస్యాలను ఇనాళ్ళదాకా ఎందుకు దాచారో? ఇప్పుడుకూడా ఎందుకు దాస్తున్నారో వారు సంజాయిషీ చెప్పాలి.

(1-10-1982 హేతువాది నుండి)

## *2. భారతీయ తత్వశాస్త్ర చరిత్ర*

మానవజీవితంలో విలువలు ప్రవేశించినపద్రే తత్వశాస్త్రం ప్రస్తావన వస్తుంది. మానవుడు ప్రపంచంలో దూరదూరంగా, వివిధ ప్రాంతాలలో వివిధజాతులుగా విడివడి జ్ఞానాన్ని అర్జించాడు. సత్యాన్ని మదింపు వేసుకున్నాడు. జీవన విధానాలను నిర్ణయించుకున్నాడు. మానవజాతి జీవితంలో వివిధ దశల్లో స్వేచ్ఛ, నీతి అనేవి వివిధ రూపులు సంతరించుకున్నాయి. అయినా, వీటినన్నిటినీ సమన్వయంచేసి ఏకరూపు సాధించడానికి వీలున్నది. జ్ఞానం. సత్యం, స్వేచ్ఛ, నీతి మనుషుల్ని బట్టీ, జాతుల్ని బట్టీ భిన్న తరహాల్లో వుండడానికి వీలులేదు. అయినా అలా వున్నాయి. ఇందుకు కారణం భిన్న ప్రాంతాల్లో వున్న వ్యక్తులకు, లేక జాతులకు అందిన జ్ఞానం భిన్న స్థాయిలలో వుండడమే కావాలి. తత్వాన్ని దర్శించగల మహామనీషులు లభించడం. వారికి ఆదరణ లభించడం కూడా అందుకు మరో కారణం కావాలి. ఉన్న ప్రకృతి ఒక్కటే, అందులో మానవుడూ భాగమే. దేన్ని మనం జ్ఞానమంటున్నామో, అదంతా ఈ ప్రకృతిని గురించినదే. ప్రకృతి గురించి మనం ఏ మేరకు జ్ఞానం అర్జిస్తామో, ఆ మేరకు అది ప్రకృతి గురించి మనకు తెలిసిన సత్యమవుతుంది. ప్రకృతి జ్ఞానానికి అన్యంగా సత్యమనేదిలేదు. ప్రకృతి అనంతం కాబట్టి, అది అనంతంగా జ్ఞేయమవుతుంది. అలా జ్ఞేయమయ్యే సత్యాన్ని బట్టి మానవుడు తన జీవన తత్వాన్ని నిర్మించుకుంటాడు. అయితే దూరదూరంగా వుండిపోయిన జనాలందరికీ ఒకేసారి, ఒకేస్థాయిలో జ్ఞానం అబ్బాలని లేదు. ప్రపంచంలో కొన్ని జాతులు తాత్విక చింతనలో ఉన్నత స్థాయిని అందుకోగా, మరికొన్ని జాతుల తాత్విక చింతనస్థాయి దిగువ మట్టంలో వుంది. తత్వం అనడానికే వీలులేని స్థాయిలో నిలబడి పోయిన అదిమజాతులూ వున్నాయి. అంతమాత్రాన మనం తత్వశాస్త్రాన్ని జాతులపరంగా విభజించలేము. ఒకేజాతి వారందరిలోనూ ఒకేస్థాయిలో జ్ఞానంవుంది గనుకనా? అందువల్ల, మనం భారతీయ తత్వశాస్త్రమంటున్నామంటే, భారతీయులనబడే వారంతా ఒకే జాతి వారని అనలేము. అర్యులీ దేశానికి రాకముందు ఇక్కడ దస్యులుండేవారు. ఆర్యులు వారిని ఓడించి బానిసలుగా చేసుకున్నట్లు వేదాదులను బట్టి మనకు తెలుస్తుంది. ఇది ఉత్తరాది ఆర్యావర్తం కథ. ఇక దక్షిణాదిన అప్పటికెన్ని జాతులున్నవో! అందులో ముఖ్యులు ద్రావిడులన్నది చరిత్ర. ఆర్యుల తర్వాత పర్షియనులు,



50

యవనులు (గ్రీకులు). కుషానులు, శకులు, స్కిధియనులు, హూణులు-ఒకరేమిటి? ఎన్నో జాతులువారు ఈ దేశంపై దండయాత్ర జరిపి, జయించి, పాలించి. యిక్కడి జాతులతో కలిసిపోయారు. ఇదంతా ముస్లిములు, ఆధునిక యూరోపియన్లు ఈ దేశంపైకి రాకపూర్వం జరిగిన సంగతి. తర్వాత ముస్లిములు, పోర్చుగీసువారు, డచ్చివారు, ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు దేశాన్ని జయించి యేలుకున్నారు. అందులో కొందరు ఈ దేశప్రజలతో కలిసిపోయారు. అలా ఎన్నో జాతుల రక్తంతో సంకరమైనది భారతజాతి. అయినా, చారిత్రక కారణాలవల్ల ఈ దేశంలోని వారినందరిని కలిపి భారతజాతి అనే అంటున్నారు. అలాగే ఈ దేశంలోని అధిక సంఖ్యాంకుల మతంగా భావించబడే హైందవం కూడా అనేక మతప్రవంతులను కలుపుకొని సంకరమైంది. అందువల్ల భారతీయ తత్వశాస్త్రం అన్నప్పుడు, అది హిందూమతంగా అర్థం చేసుకోబడుతుంది. ఏది హిందూమతం? అని మనం ప్రశ్న వేసుకుంటే మనకు కచ్చితమైన సమాధానం రాదు ఈచిక్కు వల్లనే "పార్సీలు, ముస్లిములు, క్రైస్తవులు" కానివారు భారతదేశంలో ఏమూలవున్నా సరే, వారు హిందూమతాచారాలతో సంబంధంలేని గిరిజనులు, ఆటవికులు అయినాసరే, వారంతా హిందూవులేనని మన రాజ్యాంగం పేర్కొన్నది. అలానే హిందూమతమంటే ఏమిటది ప్రశ్న వేసుకుంటే, అది ఫలానా ఫలానా మతాలు కానిదని చెప్పుకోవాలితప్ప, ఇదమిద్ధమని దాని బరిని నిర్ణయించలేము. ఎందుకంటే, ఏవి హిందువులకు పవిత్ర గ్రంథాలుగా చలామణి అవుతున్నవో, ఆ వేదాలు, ఉపనిషత్తులు, గీత, పురాణాలు, ఇతిహాసాలు, స్మృతులు వగైరా-అన్నీ ఒకే జీవన పద్ధతిని నిర్ణయించడం లేదు. భిన్నత్వంలో ఏకత్వమని మనం ఎంతగింజుకున్నా మౌలికసత్యాలకు, విలువలకు సంబంధించికూడా ఆ గ్రంథాలు పరస్పర విరుద్ధ ప్రతిపాదనలు చెసినై. నిజానికి, అవన్నీ మతానికీ సంబంధించినవే కాని, తత్వానికి సంబంధించినవి కావు. దైవానికి సంబంధించినవే కాని, మనిషికి సంబంధించినవి కావు. పరలోకానికి సంబంధించినవే కాని ఈ లోకానికి సంబంధించినవి కావు. మరణానంతరం స్థితికి సంబంధించినవే కాని, బ్రతికివున్నపటకి స్థితికి సంబంధించినవి కావు. ఐనా ఈ దేశంలోవున్న మతమే తత్వంగా పరిగణించబడుతోంది, మతానికి భిన్నమైనది, తత్వానికి సంబంధించినదీ చార్వాక, జైన, బౌద్ధాల్లోనూ., సాంఖ్య వైశేషిక, న్యాయదర్శనాల్లోనూవున్నా-భారత జనాభాలో వాటికి ప్రాచుర్యం లేదు. అవి వున్నట్లు చాలమంది విద్యావంతులకే తెలియదు. కాబట్టి మనం నేలవిడిచి సాముచేయడానికి వీలులేదు. మనం భారతీయ తత్వశాస్త్రాన్ని గురించి చర్చిస్తున్నామంటే -ఫలానా భౌగోళిక హద్దులు కలిగి, భారతదేశం అని పిలువబడే యీ దేశంలో వివిధకాలాల్లో పెంపొందిన ఆలోచనా పద్ధతులును గురించి మనం పరిశీలిస్తున్నామని అర్థం. ఇస్లాం ఈ దేశంలో ప్రవేశించకముందు ఈ దేశంలో ఏయే ఆలోచనా ధోరణులున్నవో, వాటిని పరిశీలిస్తున్నామని అర్థం. ఎందుకంటే, ఇస్లాం ఈ దేశంలోని తత్వాన్ని కానీ, మతాన్నికానీ, ప్రభావితం చేయలేక పోయింది. అందువల్ల ఇస్లాం రాకముందు ఈ దేశంలో జనాన్ని ఏయే భావాలు ప్రభవితం చేస్తూ వచ్చాయో, అవి అన్నీ కలగాపులగంగా యిప్పచికీ కొనసాగుతున్నాయి.

ఇక్కడ పెంపొందిన ఆలోచనా ధోరణులన్నింటినీ ఈనాటి అర్థంలో తాత్వికమని పిలవడానికి వీలులేదు. అందులో ఆస్తికాలూ, నాస్తికాలూ వున్నాయి. భౌతికాలూ, భావవాదాలూ

వున్నాయి. లౌకికాలూ లోకోత్తరాలూ వున్నాయి. ప్రకృతి శక్తుల విగ్రహారాధనలూ, పశుబలులూ, నరబలులూ వున్నాయి. కర్మవాదాలూ, జ్ఞానవాదాలూ వున్నాయి. వైదికాలూ, అవైదికాలూ , అభ్యుదయనిరోధకాలూ వున్నాయి. ఎంత తాత్వికమనుకున్నా అదంతా ఒకే తత్వం కాదు. అది ఒక పద్ధతిలో అభివృద్ధి చెందనూ లేదు. దానికి పరిణామగతి లేనూ లేదు. నానాటికి భ్రష్టమై పోయినట్లు రుజువుచేసే చరిత్రే దానికి యెక్కువగావుంది. అందువల్ల, ఎంత తాత్వికమనుకున్నా, అది ఒకే తత్వం, ఒకేతాత్విక ధోరణికాదు. దాన్ని భారతీయ తత్వం పేరుతో గౌరవించవలసిన పనిలేదు. ఐనా, ఈ దేశంలో వివిధ కాలాల్లో, మతం, తత్వం, ఏయేపోకడలు పోయిందో చారిత్రక క్రమంలో పరిశీలించేటపుడు సౌలభ్యం కోసం దాన్ని భారతీయ తత్వమనే అంటాం.

ప్రాచీన భారతదేశంలో విజ్ఞానశాస్త్రం, గణితం, వైద్యం, శిల్పం, చిత్రలేఖనం, వాస్తువు, సాహిత్యం, ఇతర కళలు బాగా అభివృద్ధి చెందిన మాట వాస్తవం, అయితే. ఈ అభివృద్ధికి కారాణాలేమిటి? వాటికి మూలకారణాన్ని హిందూమతంతోనో, భారతజాతీయతతోనో లంకె వేయడంలో ఔచిత్యమెంత వుంది? మనమనుకుంటున్నంత ప్రభావం వాటిమీద హిందూ మతానికుందా? హిందూమతం లేనప్పుడు అవి వున్నవా, లేవా? బౌద్ధానికి పూర్వం ఆయా ప్రక్రియలు భారతదేశంలో వున్నట్లు దాఖలాలేమైనా వున్నావా? ఈనాటి మత పువరుజ్జీవన వాదులు తీస్తున్న అర్థాలు వేదాదుల్లోవున్న మంత్రాలకు వున్నవా? ఆ మంత్రాలకేమైనా మహత్యం వుందా? నాటక ప్రక్రియ లాటింది ఈ దేశంలో అడుగుపెట్టి ఎంత కాలమైంది? విజ్ఞానంలో ఈ దేశం మరొక దేశం నుంచి కాని, మరొకదేశం ఈ దేశం నుంచి కాని ఇచ్చిపుచ్చుకోడాలు ఎంతవరకు జరిగినై? ఈ విషయాలను కూడా పరిశీలించడం అవసరం. ఎందుకంటే, వాటిని గురించిన వాస్తవాలు తెలిస్తేకాని, భారతీయతత్వశాస్త్రానికి జాతీయస్థాయితగ్గి, అంతర్జాతీయస్థాయి లభ్యంకాదు. అప్పుడుకాని మతస్థాయి తగ్గి మానవస్థాయి అందదు. జాతీయోన్మాదంతో గిరిగీచుకొంటే, ప్రపంచతాత్విక చరిత్రలో భారతీయ తత్వం స్థానం సంకుచితమైపోతుంది.

వేదాల్లో దార్శనిక జిజ్ఞాసలేదు. ఋగ్వేదంలో చిట్టచివర మాత్రం తాత్విక ధోరణి తొంగిచూచింది. అది వినా, మిగతా వేదాభాగమంతా యజ్ఞయాగాది కర్మకాండకు సంబంధించిన సాహిత్యమే. ఆ కర్మకాండను తిరస్కరిస్తూ బయలుదేరిన చార్వాక, జైన, భౌద్ధాలు, దార్శనిక జిజర్ఞాసను లోతుగా చేసినై. వాటికి సమకాలీనంగా గ్రీసులోనూ తాత్విక జిజ్ఞాస ప్రారంభమైంది. అదికూడా థేల్స్‌తో ఒక్కసారిగా ప్రారంభమైనట్లు కన్పిస్తుంది. వారికున్న తాత్విక వారసత్వంగురించి ఆధారాలు దొరకలేదు. అయితే, ఈ సమాంతర జిజ్ఞాస ఎలా సాధ్యమైంది అనేది ప్రశ్న. అలా మిగతా దేశాల్లో సాగినట్లు దాఖలా లేదు. కారణమేమిటన్నది ప్రశ్న. క్రీస్తుశకారంభం తర్వాత ఈ దేశంలో స్వతంత్ర జిజ్ఞాస ఎందుకు చచ్చిపోయింది? అంతా సూత్రయుగం. బాష్యయుగం, అనువాదయుగంగా ఎందుకు మారిపోయింది? అంటే రివైవలిస్టు ధోరణి యిక్కడ ఎందుకు ప్రబలింది? రినైజాన్స్ ఎందుకు రాలేదు? వికాసయుగం ఎందుకు ప్రారంభం కాలేదు? స్వతంత్ర జిజ్ఞాస ఎందుకు తలెత్తలేదు? భారతదేశంలో బయలుదేరిన జిజ్ఞాస చరిత్రను, మతాల చరిత్రను, మతాల చరిత్రను సత్యనిష్టతో పరిశీలిస్తే గాని, ఈ ప్రశ్నలకు సమాధానం దొరకదు. మన వాస్తవికస్థాయి మనకు అర్థమైతేకాని, రివైవలిజం విజృంభణను అపడం సాధ్యంకాదు. మన

తాత్విక వారసత్వాన్ని గురించి మనం లేనిపోని గొప్పలకుపోయి లాభం లేదు. మనది మతవారసత్వమే కాని, తాత్విక వారసత్వం కాదు. మతాన్ని తత్వాన్ని కలగాపులగం చేసి మతాన్ని తత్వశాస్త్రంగా ప్రదర్శించడంలోని లోపాన్ని మనం గమనించాలి, అధిగమించాలి.

వేదాలు స్వతః ప్రమాణాలనీ, ఈశ్వరీయాలనీ, సార్వకాలిక సత్యాలనీ ఆనాటినుంచి ఈనాటి వరకు హిందువులంతా,- ఉపనిషత్కారులూ, పౌరాణికులూ, ఆచార్యులూ, మత ప్రచారకులూ, శైవులూ, వైష్ణవులూ, జాతీయనాయకులూ, ఈనాటి రాజకీయ నాయకులూ-అందరూ ఘోషించడానికి కారణమేమిటి? వేదాధికారాన్ని త్రోసివేసిన చార్వాక, జైన, బౌద్ధాదులు ఈ దేశ సామాజి జీవనం నుంచి అంతర్ధానం కావడానికి కారణమేమిటి? ప్రపంచంలో అంతకు ముందు ఎక్కడా జరగని చార్వాక, జైన, బౌద్ధతరహా తాత్విక విప్లవం ఈ గడ్డమీదనే ఎందుకు జరిగింది? వేదాల కర్మకాండకు భిన్నంగా ఆలోచించిన ఉపనిషత్కారులూ, వాటి రెంటికీ భిన్నంగా తాత్విక ప్రతిపాదలు చేసిన సాంఖ్య వైశేషిక న్యాయ దార్శనికులూ వేదప్రమాణాన్ని నిరాకరిస్తున్నామని అనలేక పోవడానికి హేతువేమిటి? గీత ఎందుకు పుట్టింది? ఎలా పుట్టింది? "ఇదీ" అంటూ ఒక తత్వాన్ని సైకొట్టని గీతకు హిందూమత జీవనంలో ఇంత ప్రాధాన్యత ఎలా లభించింది? అనంతరం కల్లబొల్లి కథలకు పుట్టిళ్ళయిన పురాణేతిహాసాలు ఎలా ఉనికిలోకి వచ్చినై? ప్రపంచంలో మరెక్కడాలేని వర్ణవ్యవస్థ ఈ దేశంలో స్థిరంగా నిలదొక్కుకోడానికి సాహిత్యం ఎంతవరకు కారణం? కళలెంత వరకు కారణం? వర్ణాశ్రమాచారధర్మాల తాత్విక ప్రాతిపదిక ఏమిటి? ఆ ఒక్క విషయంపై ఈ దేశంలో బుద్ధిశుద్ధి (బ్రెయిన్‌వాష్) ఎందుకు అంతగా జరిగింది?

అసలు సిసలయిన వైదికం చార్వాక, జైన, బౌద్ధాల చేతుల్లో చావుదెబ్బతిన్నది. జైన బౌద్ధాలు బారతదేశంలో విస్తృతంగా వ్యాప్తి చెందినై. వారి దార్శనిక ధోరణిని కాపీకొట్టి, వక్రీకరించి ప్రదర్శించిన వేదాంతం ఉపనిషత్తుల్లో బయలుదేరింది. ఆ ఆలోచన వెర్రితలలు వేసి వందలాది ఉపనిషత్తులు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చినై. వైదిక కర్మకాండకు సూత్రీకరణ పూర్వమీమాంసలోనూ ఉపనిషత్ భావవాదానికి సూత్రీకరణ ఉత్తరమీమాంసలోనూ జరిగింది. ఉత్తరమీమాంస (బ్రహ్మసూత్రాలు)కు ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శుద్ధాద్వైత భాష్యాలువెలసినై. శైవవైష్ణవాలు పురాణాల రూపంలో బయలుదేరి, మూఢమతాచారాలను నిలదొక్కినై. కాగా తాత్విక అవగాహన తప్పుదారి పట్టింది. తత్వశాస్త్రానికి ప్రత్యేక ప్రతిపత్తి లేకుండా పోయింది.వైదికుల ప్రభావానికి లోనైన తాత్విక భేదాలన్నీ మతశాఖలుగా పరివర్తనమైనాయి చార్వాక, జైన, బౌద్ధాల తర్వాత-(సాంఖ్య వైశేషిక న్యాయ దర్శనాలను వదలితే) మతం నుంచి వేరుపడి చేసిన తాత్వికజిజ్ఞాస ఈ దేశంలో మృగ్యం. దేవుళ్ళకోసం మనిషి బ్రతకడమేకాని, మనిషి తనకోసం బ్రతకడమనేది ఈ తత్వాల్లో మృగ్యం. స్వర్గమనీ, మోక్షమనీ, బ్రహ్మైక్యమనీ, దైవసాన్నిధ్యమనీ వేర్వేరు పేర్లతో మానవుడి ఐహిక జీవితానికి సంకెళ్ళు తగిలించడం జరిగింది. వాటి పేరుతోనే హింస, దౌర్జన్యం, హత్యలు, అవినీతి కార్యకలాపాలు హిందూ సమాజంలో బాహాటంగా జరిగినై. ధర్మాలుగా, నైతికచర్యలుగా వాటిని కీర్తించడానికే పురాణేహాసాలు రంగంలోకి దిగినై.

సాంఖ్య వైశేషిక న్యాయదర్శనాలు వైదికానికి విరుద్ధంగా పోరాడక పోయినా, దాని

మౌలికసూత్రాలకు భిన్నంగా తాత్విక ప్రతిపాదనలు చేసినై. అయినా కొన్ని హైందవ శాఖలు ఆయా సందర్భాల్లో వాటిని ప్రమాణించడమో, ప్రస్తావించడమో జరిగింది. నిజానికి, వాటికి భారతీయ తత్వశాస్త్ర చరిత్రలో ప్రముఖస్థానం వుంది. ఏది ఏమయినా, హిందూ భారతీయతత్వం సామాజికంగా చాల దుష్టపాత్ర నిర్వహించింది. మానవ సమతా భావానికి హైందవం చుక్కెదురు. ఎక్కడైనా అది సమతా భావాన్ని ప్రస్తావించి వుంటే, అది అగ్రవర్గాల మధ్య సమతాభావమేకాని మానవ సమతాభావం కాదు. దేవ దానవ లక్షణాల పేరుతో అసమతాభావాన్ని పోషించని గ్రంథం ప్రాచీన భారతీయ హిందూ సాహిత్యంలో దొరకదు. అంతేకాదు. హైందవంలో ఎన్ని శాఖలు బయలుదేరినా, శైవవైష్ణవాలు, ద్వైతాద్వైతాదులు అన్నీ సొంతపీఠాలను నెలకొల్పుకొని భిన్న మతాలుగా తీరికూర్చున్నాయి. ఒక ఆలోచనా రీతి బయలుదేరితే, అది మతంగా మారిపోపడం బారతదేశంలోని ప్రత్యేకత, అలా ప్రవక్తకొక మతం, ఆచార్యుడికొక మతం, సంస్కర్తకొక మతం బయలుదేరి హిందూమతమొక మతారణ్యమైంది. ఇందులో అన్ని శాఖలవారూ వర్ణాశ్రమాచార ధర్మాలను సమర్థించినవారే. కాకుంటే, కొందరు భక్తి ఉద్యమకారులు దానిలో కొంత సడలింపు చూపించారు. భారతీయ తత్వాన్ని గురించి మాట్లాడే స్వదేశీయులూ. విదేశీయులూ అందరూ ఈ దుర్మార్గాన్ని తక్కువగా అంచనా వేస్తున్నారు. తర్కంతో వృధావైజ్ఞానిక కసరత్తు చేసిన వారినందరినీ మహా మనీషులుగా, తాత్వికులుగా ప్రదర్శిస్తున్నారు. మానవ సమతా భావంలేని తాత్వికుడు తాత్వికుడెలా అవతాడు? అలానే నూరున్నొక్క మౌఢ్యాలను పెంచిపోషించిన వారిని తాత్వికులస్థాయికెత్తడం కూడా సరైన ధోరణికాదు. అందువల్ల భారతీయ తత్వశాస్త్ర చరిత్రను తడివేటప్పుడు వారివారి దుష్టపాత్రలను బహిర్గతం చేయకపోతే, మనం వ్రాసే చరిత్ర కేవలం పూర్వ మతశాఖలను పునరుజ్జీవింపజేయడానికేనని తేలుతుంది. అది తత్వశాస్త్ర చరిత్రకాదు. మత వాదాల చరిత్ర అవుతుంది. **తత్వం. ఆస్తికత్వం-రెండూ ఒకటి కాదు. ఒక దానికొకటి బిన్నం. మొదటి దానిలక్ష్యం సత్యాన్వేషణ కాగా, రెండవదాని లక్ష్యం అసత్యంపై విశ్వాసస్థాపన.**

భారతదేశంలో ఇప్పుడు హిందూమతం జీవించే వున్నది. దాని అనుయాయుల్లో తరగతి భేదాలు ఆదినుంచి వున్నట్లే ఈనాడూ వున్నాయి. పునరుజ్జీవనం పేరుతో జరుగుతున్నది వేల సంవత్సరాలు వెనక్కు నడపడమే. వేదాలదాక, ఉపనిషత్తులదాక మన ఆలోచన వెనక్కు నడవాలనే పండమెంట్‌లిస్టు ధోరణిని సమర్థించడానికయితే, మనం భారతీయ తాత్విక చరిత్రను వ్రాసుకోనవసరం లేదు. ఆ మృత సంస్కృతి అవశేషాలు యిప్పటికీ మనసమాజంలో వుండనే వున్నాయి. అవి ఎల్లప్పుడూ వుంటూనే వచ్చాయి. అవి వున్నందువల్లనే రెండువేల సంవత్సరాలుగా ఈ దేశంలో స్వతంత్ర జిజ్ఞాస బయలుదేరలేదు. ఛాయలుకూడా లేకుండా వాటిని రూపుమాపితే గాని, ఇక్కడ తాత్విక వైజ్ఞానిక రంగాల్లో స్వేచ్ఛావాయువులు వీచవు. అందువల్ల వాటి బండారం బయట పెట్టడానికే ఈనాడు భారతీయ తత్వశాస్త్ర చరిత్రను చదవాలి.

తాత్వికంగా మౌలిక చింతన చార్వాకం చేసింది. జైనం చేసింది. బౌద్ధంచేసింది. ఈనాటి స్థాయిలో అవి భౌతికవాదాలు కాకపోయినా, నాస్తిక భౌతికవాద ఛాయల్లో ఆ శాఖలు తాత్వికచర్చ చేశాయి. వాటిని ఈనాడు మనం పునరుద్ధరించనవసరంలేదు. కాని, వాటి చారిత్రక



54

పాత్రను మదింపు వేయడం వలన ఈనాడు హిందూమతంగా ప్రసిద్ధమైన వైదిక సంప్రదాయం తాత్వికంగా ఎంత బలహీనమైనదో గ్రహించడానికి వీలుకలుగుతుంది.

సాంఖ్య వైశేషిక న్యాయాలను గర్హించినవారూ, దగ్గరకు చేర్చినవారూ వైదిక హిందూ సాంప్రదాయకుల్లో మనకు కన్పిస్తారు. సాంఖ్యాన్ని భ్రష్టంచేసి తమదిగా సొంతం చేసుకున్న సందర్భాలూ హిందూమత గ్రంథాల్లో మనకు కన్పిస్తాయి. ప్రకృతి మూలాలు ఏమిటి? జ్ఞానం ఎలా కలుగుతున్నది? అనే ప్రశ్నలకు సమాధానంగా సాంఖ్యవైశేషిక న్యాయాలు చేసిన చింతనలో కొంత ఔచిత్యం ఉంది. అయినా ఈనాడు అవి చారిత్రక ప్రాధాన్యత కలవేకాని, ప్రమాణాలు కావు.

అయితే భారతీయ తాత్విక చరిత్రలో భావగమనం వెనక్కు నడిచింది. స్పష్టతనుంచి అస్పష్టత వైపుకు నడిచింది. భౌతికతనుంచి అభౌతికతవైపుకు నడిచింది. వాస్తవికత నుంచి అవాస్తవికత వైపుకు నడిచింది. జ్ఞానం నుంచి అజ్ఞానం వైపుకు నడిచింది. సత్యం నుంచి అసత్యం వైపుకు నడిచింది. మానవత నుంచి దైవం వైపుకు నడిచింది. ఐహికం నుంచి ఆముష్మికం వైపుకు నడిచింది. సమత నుంచి అసమత వైపుకు నడిచింది. ఈ స్థితి యూరపియన్ తత్వశాస్త్ర చరిత్రలో కనపడదు అక్కడ తత్వశాస్త్రం-విజ్ఞానశాస్త్రం, రాజకీయం-ఆర్థికం రుజుమార్గంలో క్రమాధికంగా వాస్తవికతవైపుకు పెరిగాయి. గ్రీకులకాలం నుంచి రినైజాన్స్ యుగం నుంచి వికాసయుగం నుంచి, హేతువాద భౌతికవాద యుగం దాకా వందలాదిమంది దార్శనికులు, శాస్త్రజ్ఞులు, రాజకీయవేత్తలు, ఆర్థిక శాస్త్రజ్ఞులు ఒకరి తర్వాత ఒకరు నూతనాంశాలను కనుగొని, అంతకు ముందటి భావవాహినికి కలిపారు. ఎక్కడో ఒకచోట ఎగుడు దిగుళ్ళున్నా. ఆ భావగమనాన్ని కాలగమనం వారీగా, భావవైశిష్ట్యం వారీగా, పైకి వెళ్ళే సోపానపరంపరగా మనం గ్రహించవచ్చు. ఆ స్థితి భారతదేశంలో లేదు. ఇక్కడ బౌద్ధం తర్వాత హిందూ వేదాంతం బయలుదేరింది. దర్శనాల తర్వాత పురాణాలు బయలుదేరినాయి. సమతావాదం తర్వాత వర్ణవ్యత్యాసాలు నిలదొక్కుకున్నాయి. భౌతికవాదం తర్వాత భక్తి ఉద్యమాలు బయలుదేరాయి. బయలుదేరడమే కాదు. ఇందులో ముందటి రీతులు వరసగా అంతర్ధానమై వెనుకవి చలామణిలోకి వచ్చి నిలబడిపోయాయి. ఇదంతా తిరోగమనమే. ఇందుకు కారణం విదేశీదండయాత్రలుకాదు. విదేశీయుల నుంచి దిగుమతి అయిన భావాలు కాదు. క్రీస్తు తర్వాత బౌద్ధాదుల మీద హైందవం దాడి ప్రారంభించింది. క్రమంగా విజయం పొంది వాటిని నిర్మూలించింది. చివరకు నిలదొక్కుకొని ఈ సమాజాన్ని దౌర్భాగ్య స్థితికి తెచ్చింది. కాబట్టి హిందూమతం సాధించిన తాత్విక తిరోగతిని క్షోదక్షమంగా పరిశీలించడం భారతీయ తాత్వికచరిత్రలో పూసలలో దారంలాగ వుండక తప్పదు.

మనం వారసత్వంగా పుచ్చుకోవలసింది జ్ఞానాన్నికాని, అజ్ఞానాన్ని కాదు. ఆ జ్ఞానం మన పూర్వుల వద్ద లేకుంటే, మరొకరి నుంచి స్వీకరించడానికి మనం సిగ్గుపడనవసరంలేదు. మన పూర్వులదేననుకొని అజ్ఞానాన్ని స్వీకరించడానికే సిగ్గుపడాలి. ప్రాచీన హిందూ సాహిత్యం సవాలక్ష దేవుళ్ళను సృష్టించి మననెత్తిన రుద్దింది. తన దుర్మార్గాలను సమర్థించుకోడానికి వారి దుర్మార్గాలను కీర్తించింది. దయ్యాలను, భూతాలను సృష్టించింది. మూఢనమ్మకాలను

ప్రోత్సహించింది. సామాజిక వ్యత్యాసాలను సృష్టించి పోషించింది. మహత్యాల పేరుతో అభూతకల్పనలు ప్రచారం చేసింది. కుళ్ళు సమాజాన్ని తీర్చి. మానసిక బానిసత్వాన్ని స్థిరతరం చేసింది. ఆత్మల్ని, పునర్జన్మల్ని, స్వర్గ, నరక, పితృలోకాలను కల్పించింది. ఇదంతా తత్వానికి భిన్నం. కాని, ఆస్తికత్వాన్ని, మతాన్ని తత్వంగా అర్థం చేసుకోగల సంస్కారాన్ని మాత్రమే పెంచుకొన్న సాంప్రదాయిక వాదులు తత్వం పేరుతో వేదాలు మొదలుకొని పురాణేతిహాసాలదాక హిందూ భారతీయ సాహిత్యాన్ని భారతీయ తత్వ పరిశీలనకు ఆలంబనంగా తీసుకుంటున్నారు. అందులోని మార్మికవాద భాగాన్ని, ఆస్తిక భావవాద భాగాన్ని ఉన్నత తత్వంగా పొగడుతున్నారు. ఆ గబ్బును అలానే వుంచి ఆధునిక విజ్ఞానంతో దానికి మలామా వేస్తున్నారు. భావోద్యమాలను పరిశీలించవలసిన నమూనా ఇది కాదు. కాని, యింతకు ముందు భారతీయ తత్వశాస్త్ర చరిత్రను వ్రాసినవారు కొందరు ఈ అవాస్తవిక వైఖరిని అవలంబించి మరీ అన్యాయంగా వ్రాశారు. హిందూమతంలోని భావదౌర్భాగ్యాన్ని మొత్తాన్నీ సమర్థించడానికి పనికట్టుకొని చేసిన రచనలే మనకు ఎక్కువ కన్పిస్తాయి. అలాంటి రచనలు ఎంతో వెనుకబడిన ఈ సమాజానికీ, దేశానికీ ద్రోహం తప్ప, మేలు చేయజాలవు. అందువలన భౌతిక వాదానికీ, మానవతామార్గానికీ ద్రోహం చేసిన మత వైఖరులు ఎలా ద్రోహం చేసినవో, మానవతా మార్గానికి అనుగుణంగా సమాజానికి మేలు చేసిన తాత్విక వైఖరులు ఎలా మేలు చేసినవో చారిత్రక క్రమంలో పరిశీలించడం సరైన భారతీయ తాత్విక చరిత్ర అవగాహనకు సరయిన పద్ధతి అవుతుంది.

అయితే, కొందరు విద్యావంతులనబడేవారు, రాజకీయనాయకులు, హిందూజాతీయవాదులు రివైవలిజం కంటె హీనమైన విపరీతధోరణిని భారతదేశంలో ప్రచారం చేస్తున్నారు. వేదాలు అనాది గ్రంథాలనీ, సార్వకాలిక విజ్ఞాన సర్వస్వాలనీ, అందులో విమానాలు, రాకెట్లు, అణుబాంబులు, వ్యోమనౌకలు, రేడియోలు, టెలివిజన్లు - ఒక్కటేమిటి, ఇప్పటికి కనుక్కున్నవీ, ఇక ముందు కనుక్కోబోయేవీ - అన్నీ వున్నాయని అవివేకమైన వాదనచేస్తున్నారు. వైదికులది పశుపాలక సమాజమని, యజ్ఞయాగాది క్రతువులు, సోమపానం, మాంసభక్షణ వగైరా వారి జీవన సంస్కృతిలో ముఖ్యాంశాలనీ, తాత్వికధోరణి, సాంకేతిక విజ్ఞానం వారికి లేదనీ. వుండే అవకాశం లేదనీ వేదాలు చదివిన వారికెవరికైనా తెలుస్తుంది. వేదాల్లో నుంచి అక్కడొక మంత్రం, ఇక్కడొక మంత్రం ఏరుకొచ్చి, వాటికి కొత్త అర్థాలు కల్పించే పద్ధతి చాల హేయమైనది. వైదికులీదేశానికి రాకపూర్వం ఇక్కడ వారికి అందికలో లేని నాగరిక జీవనం వున్నట్లు మహెంజోదారో, హరప్పా త్రవ్వకాలు వెలుగులోకి తెచ్చాయి. ఆ నాగరికత కాలం క్రీస్తుకు పూర్వం రెండు మూడువేల సంవత్సరాల నాటిదని తేలింది. క్రీ.పూ. 4000 సంవత్సరాలకు పూర్వమే ఈజిప్టు, మెసపొటేమియా, బాబిలన్ ప్రాంతాల్లో వైదికుల పశుపాలక జీవనానికి మించిన నాగరిక జీవన మున్నట్లు స్పష్టమైన చారిత్రకాధారాలున్నాయి. మెక్సికన్ (మాయా) నాగరికత కూడా వేదకాలం కంటే ప్రాచీనమైనదే. అది వైదికుల స్థాయికి మించినదని పురావస్తు తత్వశాస్త్రం రుజువు చేస్తున్నది. క్రీ.పూ. 1400 వరకు వైదికార్యులు పర్షా (ఇరాన్) ప్రాంతంలోనే వున్నట్లు ఇటీవలి పరిశోధనలు రుజువు చేశాయి. 1775లో ఇరాన్‌లో బయటపడ్డ జెండ్‌అవెస్టా, ఈనాటి



56

బారతీయుల వేదాలు - రెండూ ఒక్కగూటిలోనివేననీ, అందులోని దేవతలూ-ఇందులోని దేవతలూ ఒక్కరేననీ, వేదాల్లోని ప్రాకృతభాష జెండ్ అవెస్టాలోని భాషకేదగ్గరగా వుందనీ, సంస్కృతంకంటె ఇంకా దగ్గరగా వుందనీ, వేదాల్లోని పదాల్లో 50శాతం జెండ్అవెస్టాలో కన్పిస్తున్నాయనీ పరిశోధకులు తేల్చారు. సజానికి ఎద్దులబండ్లు. గుర్రాలబండ్లు తోలుకున్న వైదికార్యులకు విమాన నిర్మాణ కౌశలం వుంటే. వారి వారసులైన పౌరాణికులు పురాణదేవుళ్ళకు ఎద్దుల్నీ. గ్రద్దల్నీ. కొంగల్నీ, కోళ్ళనీ, దున్నపోతుల్నీ, ఎలుకల్నీ వాహనాలుగా అమర్చే దౌర్భాగ్యస్థితికి ఎందుకు దిగజారుతారు? వైదికుల జీవనస్థాయిని వేదాలు చాల నగ్నంగా చిత్రించాయి. నిజంగానే వారు అమాయకులు. వారి పని అంతా గానా, పీనా, బజానా.

వైదికపూర్వనాగరికులకు చిత్రలిపో, దీర్ఘలిపో, లేక మరొక తరహాలిపో వున్నట్లు పురావస్తు తత్వశాస్త్రజ్ఞులకు ఆయా ప్రాంతాల్లో లభించిన ఫలకాలవల్ల తెలుస్తుంది వైదికులకు లిపి వున్నట్లు మనకు ఆధారాలులేవు. వేదాలు శ్రుతులుగా అనుశ్రుతంగా లభించినవే కాని, లిఖితరూపంలో లభించలేదు. వైదికులకులేని గృహనిర్మాణ నగర నిర్మాణ-కౌశలం, గ్రహణాలను ముందుగా చెప్పగల ఖగోళవిజ్ఞానం వైదిక పూర్వనాగరకజాతుల్లో వున్నట్లు మనకు కావలసినంత సాక్ష్యాధారమున్నది. ఏది యెవరికున్నా, ఈనాటి తరహా సాంకేతిక విజ్ఞానం అనాటి వారికి కలదని వూహలు చేయడం అవివేకం. అలాంటి పిచ్చి వూహలు చేసేవారు మరేదేశంలోనూ, ఏజాతుల్లోనూ లేరు ఒక్క హిందూ జాతీయవాదులకే అ జబ్బు వారసత్వంగా సంక్రమించి, రానురాను ముదిరింది. ఆ జబ్బు కుదరకపోతే ఈ సమాజం అభ్యుదయపథానికి మరలడం అసంభవం.

అసాంస్కృతికమైన వైదిక ప్రాకృతానికి కొత్త అర్థాలు కనిపెట్టడం ఎక్కడో ఒక వేద మంత్రాన్ని పట్టుకొని దానికి వికృతార్థాలు సాధించడం వాటిని ఆధునిక విజ్ఞానంతో ముడిపెట్టడం భారత సమాజానికి హాని చేస్తుందని హిందూ జాతీయవాదులు నేటికీ గుర్తించక పోవడం శోచనీయం. వేదాల్లో వున్నది కవిత్వరూపంలో వున్న కీర్తనమే కాని విజ్ఞానం కాదనీ, కథలు-గాథలే కాని చరిత్రకాదనీ, అది ఒకజాతి భౌతిక జీవితాన్ని ప్రతిబింబించే యజ్ఞయాగాది కర్మకాండకు సంబంధించినదే కాని, జ్ఞానాన్వేషణను ప్రతిబింబించే దార్శనిక విజ్ఞానానికి సంబంధించినది కాదనీ, అందుకే చార్వాక, జైన, బౌద్ధాదులు దాన్ని తిరస్కరించి దానిపై తాత్విక విప్లవ ధ్వజం ఎత్తారనీ, వీరితోనే భారతదేశంలో తత్వం ప్రారంభమైందనీ గుర్తించడం అవసరం. ఈ భాగంతో భారతీయతాత్విక చరిత్ర ప్రారంభం కావలసివుండగా, దీన్ని మినహాయించి తత్వాన్ని ఆలోచించే వైఖరి ఈ దేశ సంస్కృతి లో భాగమైంది. ఈ సంస్కృతి ఉపనిషత్తుల్లో ప్రారంభమై, బ్రహ్మసూత్రాల్లోనూ-దాని భాష్యాల్లోనూ కొనసాగి, దయానంద-వివేకానందాదుల్లో పునరుజ్జీవనం పొంది, హిందూ జాతీయవాదంలో విజృంభించింది. అది మతరీతే కాని, తాత్వికరీతి కాదు. అది కాకుండనే భారతీయులు ఉత్తమ తాత్వికమార్గాలను అనుసరించిన సందర్భాలున్నాయి చార్వాక, జైన, బౌద్ధ ఆలోచనారీతుల్లో, సాంఖ్య, వైశేషిక, న్యాయ దార్శనికరీతుల్లో ఆ తాత్విక చింతన కన్పిస్తుంది. వాటిని ప్రధానంగా చర్చించడం భారతీయ తాత్వికచరిత్ర రచనా లక్ష్యం కావాలి.



58

# 'హేతువాది' ఓ గొప్ప మాసపత్రిక.

- పసల భీమన్న.

'హేతువాది' పత్రిక గొప్పతనం రావిపూడి వెంకటాద్రి గారి గొప్పతనమే. రావిపూడి గారు లేకపోతే 'హేతువాది' లేనట్లే. హేతువాది, రావిపూడి రూపాయికి రెండు ప్రక్కలా బొమ్మా బొరుసు ఎలాగో అలాగన్నమాట. అంటే హేతువాద సంఘానికి 'హేతువాది", వెంకటాద్రి రూపాయికి బొమ్మా బరుసులా, మనిషికి రెండు కళ్ళులా సమాన వనరులన్నమాట.

'హేతువాది' ఇరవై ఐదు సంవత్సరాలు నడిచి, దాని రజతోత్సవ సంచిక రాబోతుందంటే అందుకు ఎవరిని అభినందించాలి? జవాబు సులభమైనది. మొదట వెంకటాద్రిని అభినందిచాలి. తర్వాత ఆ పత్రిక ఇబ్బందుల్ని, అంటే వెంకటాద్రి ఇబ్బందుల్ని గ్రహించి ఆదుకున్న మిత్రుడు ఎమ్.బసవపున్నారావుని, ఆయనకు చేదోడు వాదోడుగా ఉన్న ఎ. ప్రఫుల్లచంద్ర, గురిజాల సీతారామయ్య గార్లను అభినందించాలి. చివరగా ప్రస్తుత మేనేజింగ్ ఎడిటర్ మేదూరి సత్యనారాయణని అభినందించాలి. మేదూరి సత్యనారాయణను అభినందించడం అంటే ఇంకొల్లు హేతువాద మిత్రులందర్నీ అభినందించడమే.

పిల్లి మెడలో గంట కట్టేవాడే గొప్పవాడు. మిగిలినవారంతా నిమిత్తమాత్రులే. అంటే ఒక బాధ్యత తీసుకుని, మాట ప్రకారం ఆ బాధ్యతను నిర్వహించడం అంటే ఎంత కష్టసాధ్యమో అనుభవించిన వారికి మాత్రమే తెలుస్తుంది. ఈ దృష్టితోనే వెంకటాద్రిని మరోసారి అభినందించితీరాలి. హేతువాది-జూన్ 2007 ఎడిటోరియల్ చదివితే ఈ విషయం స్పష్టమవుతుంది. శారీరకంగా, మానసికంగా వెంకటాద్రి పడ్డ శ్రమను గురించిన వివరణ సారాంశం ఆ ఎడిటోరియల్.

వెంకటాద్రి ఒకేసారి మూడురకాలైన సేవలు మన కందించారు. అవి ఏమిటంటే మొదటిది. ఆయన నిరంతరం హేతువాది వ్యాసాలు వ్రాయడం. రెండవది ఎవరుపిలిచినా కాదనకుండా వెళ్ళి, హేతువాద ఉపన్యాసాలివ్వడం. మూడవది హేతువాద ఉద్యమాన్ని కొనసాగించడం, అంటే హేతువాద సంఘం బాధ్యతలు నెరవేర్చడం. ఒక్కసారి మనం ఆలోచిస్తే, ఈ మూడు సేవలు సామాన్యులు ఒక్కసారి చేయగలరా? ఎంత టెన్షన్ ఉంటుంది? ఆ మానసిక ఒత్తిడిలో ఎంత జీవితానందాన్ని కోలుపోతాం? వెంకటాద్రి బేలన్సుడు వ్యక్తిత్వం గల వ్యక్తి కాబట్టే ఆ మూడు సేవలు ఒక్క చేతిమీద ఏకకాలంలో అందించారంటే ఏ మనుకోవాలి? మాటల్లో చెప్పలేం.

నాలాంటి ఎందరో సామాన్యుల్ని హేతువాద రచయితులుగా తీర్చిదిద్దిన ఘనత వెంకటాద్రి గారిదే. ఆయన మనల్ని ప్రోత్సహించే పద్ధతి ఎలాగుంటుందో నా ఉదాహరణే చాలు. అయన నాతో ఇలా అన్నారు.-"మీరు ఎమ్.ఏ.,ఎమ్. ఇడి. చదివి వ్యాసాలు వ్రాయకపోవడం ఏమిటి? ఇంత చదువు చదివి మీరు వ్రాయలేక పోతే, ఇంకెవరు వ్రాస్తారో చెప్పండి".

వెంకటాద్రి ప్రోత్సాహంతో ఒక వ్యాసం వ్రాశాను. రెండవ వ్యాసం వ్రాశాను. మూడవ వ్యాసం వ్రాశాను. అన్ని వ్యాసాలూ హేతువాదిలో ప్రచురించారు. మూడవ వ్యాసం ప్రచురించాక



58

ఆయన నాకు ఓ కార్డు వ్రాశారు. అందులో ఆయన, "మీరు వ్యాసకర్తగా నిలదొక్కుకున్నారు. వ్యాసాలు వ్రాయడం కొనసాగించండి". అని ప్రోత్సహించారు.

ఆ ప్రోత్సాహ ఫలితంగా నేను ఐదు పుస్తకాలకు సరిపడా వ్యాసాలు వ్రాసి, ప్రచురించాను. ప్రతి పుస్తకానికి వెంకటాద్రి 'ముందుమాట' వ్రాశారు. ప్రతి 'ముందుమాట'లోనూ నన్ను ప్రోత్సహిస్తూ ఎంతో గొప్పగా నా గురించీ, నా వ్యాసాల గురించి వ్రాశారు. ఈ సందర్భంగా ఈ పత్రికాముఖంగా వారికి నాకృతజ్ఞతలు తెలియ చేస్తున్నాను.

మన 'హేతువాది' పత్రిక ప్రత్యేకతలేమిటో చూద్దాం.

విషయపరంగా చూస్తే, ఈ పత్రికలో హేతువాద వ్యాసాలే ఉంటాయి. అంటే సైన్సుకు సంబంధించినవి, నాస్తికత్వానికి సంబంధించినవి, మూఢనమ్మకాలకు సంబంధించినవి, మతగ్రంథాల్లోని అశాస్త్రీయత గురించి, మానవవాదం గురించి, శాస్త్రీయపద్ధతి గురించి, శాస్త్రీయ వైఖరి గురించి, లౌకికవాదం గురించి వ్యాసాలుంటాయి.

భాషాపరంగా చూస్తే, ఈ పత్రిక భాష ప్రజల భాషే. కాని కొన్ని వ్యాసాల్లో భాష కొంచెం కష్టంగా ఉంటుంది. కారణం సైన్సుకు సంబంధించిన సాంకేతిక పదాలు వాడుటవల్ల. కనుక పాఠకుడు కూడ తన భాషాస్థాయిని పెంచుకుని వాటిని అర్థంచేసుకోడానికి ప్రయత్నించాలి. ఇలాంటి సైన్సుపదాల భాష వల్ల ఇది మేధావుల పత్రికగా ప్రచారమైంది.

ప్రశ్నలకు జవాబువివ్వడం ఈ పత్రిక మూడో ప్రత్యేకత. శాస్త్రీయ వైఖరి పెంపొందించాలనే ఉద్దేశం కాబట్టి ఈ పత్రిక విజ్ఞానదాయకంగా ఉంటుంది. ఇదే దీని ప్రత్యేకతల్లో ఒకటి

విషయపరంగా, భాషాపరంగా ఎప్పుడూ ఒకేస్థాయితో నడిచే పత్రిక 'హేతువాది'.

హేతువాదం అంటే సరైన అర్థం చెప్పి, ఆ పదాన్ని ప్రాచుర్యంలో కి తెచ్చి, ఆ విషయం పై ఎన్నో వ్యాసాలు వ్రాసిన గొప్ప హేతువాది వెంకటాద్రి.

హేతువాదం శాస్త్రీయ ఆలోచనా పద్ధతి అనీ, అది లక్ష్యసాధనకు సాధనమే కాని అదే లక్ష్యం కాదనీ, దానికి లక్ష్యం మానవవాదమని చెప్పిన గొప్ప మానవవాది వెంకటాద్రి.

ఆ పెద్దాయన పదికాలాల పాటు జీవించి, 'హేతువాది'కి మార్గదర్శకునిగా ఉంటూ సేవచేయాలని కోరుకుంటున్నాను.

నేను ఒక్కసారి వెంకటాద్రి వ్యాసాలను మెచ్చుకుంటూ ఉంటే, ఆయన, "నాదేముందండి. ఎమ్.ఎన్.రాయ్ వ్యాసాలు ఇంగ్లీషుల్లో చదివి, వాటిని తెలుగులో మీ కందించానంతే. రాయ్ వ్యాసాలు చదవండి." అని అన్నారు.

ఇది వెంకటాద్రి నిజాయితీకి, చిత్తశుద్ధికి ఒక చిన్న ఉదాహరణ మాత్రమే.

ఆయన్ను మనం 'ఆంధ్ర ఎమ్.ఎన్.రాయ్' అంటే?

# వ్యాసోపన్యాస మానవవాది: ఎ.జి.కె.

**(1917-1967)** - ఎన్.ఇన్నయ్య

అమెరికాకు ఆహ్వానించిన వారిలో ఎ.జి.కె వంటి వ్యక్తి చాలా అరుదైన వారని అమెరికా ప్రభుత్వం భావించిందట.

ఎ.జి.కె కుమార్తె జయశ్రీ పెళ్ళి నిశ్చయమైన సందర్భంగా మద్రాసు నుండి బి.ఎస్.ఆర్ కృష్ణ వచ్చి ఆహ్వానం అందజేశారు. అది ఆనాడు హ్యూమనిస్టులకు పెద్ద పండుగ. పెళ్ళిలో ఆవుల సాంబశివరావు ఆధ్వర్యాన కవి సమ్మేళనం జరుగుతుండగా అమెరికాకు ఎ.జి.కె ఆహ్వానం కూడా ఒక సంబరంగా సాగింది.

ఎ.జి.కె ఆహ్వానాన్ని భరించలేని వ్యక్తులు కొందరు వివేకానంద పేరిట కొత్త ఎత్తుగడకు పూనారు. సన్మానం పెట్టి అమెరికాలో వివేకానంద గొప్పతనం చెప్పిరమ్మన్నారు. అలాంటి భట్రాజీయం తాను చేయనని, ఉన్నది ఉన్నట్లు వివేకానంద గురించి చెబుతాననీ, అదీ ప్రస్తావన వస్తేనే మాట్లాడతాననీ ఎ.జి.కె అన్నారు.

ఇంకేముంది? ఆ మాట పట్టుకుని, ఆనాడు ఆంధ్రప్రభ సంపాదకుడుగా వున్న నీలంరాజు వెంకటశేషయ్య (కంచి శంకరాచార్య పాదపూజ భక్తుడు) ధ్వజమెత్తాడు. ఎ.జి.కెను అమెరికా వెళ్ళనివ్వరాదని, వెళ్ళినా వెనక్కు పిలిపించాలని లేఖలు ప్రచురించారు. హైందవం నాలుగు పడగల నాగు, అలా ఫాసిజాన్ని వెదజల్లింది. కాని అమెరికా ప్రభుత్వం గాని, భారత ప్రభుత్వం గాని, యి ఫాసిస్టు విమర్శలు పట్టించుకోలేదు.

అమెరికాలో పర్యటించినా ఆంధ్రాలో వున్నా ఆవుల గోపాలకృష్ణమూర్తి విశిష్ట హ్యూమనిస్టు గానే ప్రవర్తించాడు.

1964లో అమెరికా ప్రభుత్వ ఆహ్వానంపై 3 మాసాలు పర్యటించిన ఆవుల గోపాలకృష్ణమూర్తి (ఎ.జి.కె)కి సంబంధించిన కొత్త విశేషం తెలిసింది.

అప్పట్లో బి.కె. నెహ్రూ భారత రాయబారిగా అమెరికాలో వున్నాడు. ఆయన భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ బంధువు కూడా. నెహ్రూ విధానాలను నిశితంగా పరిశీలించిన ఎ.జి.కెను అమెరికాలోని భారత రాయబారి హెచ్చరించాడట, ఏమని?

జవహర్‌లాల్ నెహ్రూను అమెరికాలో విమర్శిస్తే ఎ.జి.కె ను బలవంతంగా ఇండియా పంపివేయాల్సి వస్తుందని !

కాని, ఎ.జి.కె తన విమర్శలను ఏ మాత్రం సడలించలేదు. హెచ్చరికల్ని ఖాతరు చేయలేదు. తాను హేతుబద్ధం అనుకున్న విమర్శ చేశాడు.

ఆనాడు ఎ.జి.కె చికాగోలో వుంటున్న వడ్లమూడి శ్రీకృష్ణకు అతిథి. శ్రీకృష్ణగారు ప్రస్తుతం వాషింగ్టన్ సమీపంలో మేరీలాండ్‌లో ఉద్యోగం చేస్తున్నారు. అయన తెనాలి తాలుకా మోపర్రు వాసి. ఎ.జి.కె పట్ల భారత రాయబార కార్యాలయం ప్రవర్తన గురించి వడ్లమూడి శ్రీకృష్ణ నాకు యిటీవలే వెల్లడించారు.

అమెరికా నుండి తిరిగి వచ్చిన ఎ.జి.కె తన పర్యటనుభవాలు ప్రజలకు సభాముఖంగా వివరించాడు. పుస్తకం ప్రచురించాడు.

ఎ.జి.కె వంటి బహుముఖ ప్రజ్ఞాశాలి హ్యూమనిస్టు ఉద్యమంలో వుండడం ఉద్యమానికి పునాదులు వేయడానికి తోడ్పడింది.

ఎ.జి.కెపై సమగ్ర పరిశీలన అవసరం. విపుల గ్రంథం వెలువడితే భవిష్యత్తులో హేతువాదులకూ, హ్యూమనిస్టులకూ చాలా మార్గదర్శకంగా వుంటుంది.

స్టడీ కాంపులలో ఎ.జి.కె నిర్భయంగా ఎం.ఎన్.రాయ్‌ను కొన్ని సందర్భాలలో ఎదుర్కొన్నారు. ఒకసారి కొరియా విషయమై అలాంటి వివాదంలో తీవ్ర అభిప్రాయభేధాలు వచ్చినప్పుడు ఉభయులూ ఒక రోజంతా ముభావంగా, ఎడముఖం పెడముఖంతో వున్నారట. ఇది గమనించిన ప్రముఖ హ్యూమనిస్టులు ఉభయుల్నీ కలిపి వాతావరణం చల్లబరిచారట.

త్రిపురనేని రామస్వామి- ఎం.ఎన్.రాయ్ భేటీ తెనాలిలో జరిగినప్పుడు రాయ్ అసంతృప్తితో రామస్వామి ఆర్యసమాజ్ వాసనలు పోగొట్టుకోలేనివాడిగా పేర్కొన్నట్లు ఎ.జి.కె చెప్పారు.

కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీచేసిన ఎం.ఎన్.రాయ్ పొరపాటున గెలిచి వుంటే రాడికల్ హ్యూమనిజం ఎటు పొయ్యేదోనని నవ్వుతూ ఎ.జి.కె వ్యాఖ్యానించేవారు.

ఎం.ఎన్.రాయ్‌ను చివరిదాకా కమ్యూనిస్టు భయం వెంటాడిందని, చంపుతారనే అనుమానం ఉండేదని, రాయ్‌ను దగ్గరగా పరిశీలించిన ఎ.జి.కె అంటుండేవారు.

సుప్రసిద్ధ టీచరుగా పేరొందిన యలవర్తి రోశయ్య గారు ఎ.జి.కెకు మంచి స్నేహితులు. రోశయ్య గారు గుంటూరు ఎ.సి. కాలేజి, జె.కే.సి. కాలేజీ, భీమవరం కాలేజీలలో పనిచేశారు. విశిష్ఠ లెక్చరర్‌గా పేరొందారు. కరడు గట్టిన గ్రాంథికవాది. అలాంటి రోశయ్య గారు విద్యార్థి దశలో పిలక పెంచి, చాదస్తంగా నన్నయ్య గారు, తిక్కన్న గారు, ఎర్రన్న గారు అంటూ కవిత్వం అంటే చెవి కోసుకునే వారు. ఎ.జి.కె గుంటూరు హాస్టల్‌లో ఒకనాడు తెల్లవారుజామున రోశయ్య పిలక కత్తిరించేశాడు. అపచారం అంటూ రోశయ్య వాపోతుండగా పేరుచెప్పకుండా త్రిపురనేని సూతపురాణంలో ఒక పద్యం చదివి వినిపించాడు. రోశయ్య గారు ఆకర్షితుడై బాగుంది ఎవరు రాశారు అని అడిగాడు. ఎ.జి.కె చెప్పకుండా మరొక పద్యం చదివి అలా రోశయ్యను ఆకర్షించారు. చివరకు పేరు చెప్పగా రోశయ్యగారు ఆశ్చర్యపోయి, ఆ తర్వాత రామస్వామి కవితలన్నీ చదివారు. అప్పటినుండే చాదస్తం తగ్గించుకున్నారు. లెక్చరర్‌గా రోశయ్య గారు ఎందరో విద్యార్థులకు మానవవాదాన్ని, ఎం.ఎన్.రాయ్‌ను పరిచయం చేశారు. ఎ.జి.కె, రోశయ్యలు మంచి సన్నిహిత మిత్రులుగా చివరి వరకు కొనసాగారు.

ఎ.జి.కె ఎందరో కవుల్ని, గాయకులును, కళాకారులను ప్రభావితం చేశారు. కొండవీటి వెంకటకవి, అత్తోట రత్నకవి, కొత్త సత్యనారాయణ, వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య మొదలైన వారెందరో ఈ పట్టికలో ఉన్నారు.

ఎ.జి.కె సెక్యులర్ వివాహాలు చేయిస్తూ, ప్రతి వివాహంలో సరికొత్త ఉపన్యాసం చేసి యువతను ప్రోత్సహించేవారు. నేను విన్న చివరి పెళ్ళి ఉపన్యాసం చీరాలలో కీ॥శే॥ రాజారెడ్డి కుమారుడు భాస్కర్ పెళ్ళి ఉపన్యాసం. అది అద్భుతం. బహుశా అది రికార్డు అయి వుంటే భాస్కర్ వద్ద లభించవచ్చు.

అధికారంలో వున్న వారిని ఎ.జి.కె ఖాతారు చేసేవారు కాదు. గవర్నరుగా వున్న చందూలాల్ త్రివేది, ముఖ్యమంత్రిగా వున్న నీలం సంజీవరెడ్డి దామోదరం సంజీవయ్యలు ఎ.జి.కె నిశిత విమర్శలకు గురైనవారే.

అధికారంలో లేనప్పుడు ప్రజానాయకులను గౌరవించటం ఎ.జి.కె ఆనవాయితి. పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, ఆచార్య రంగా వంటి వారిని అలానే సత్కరించారు.

రాజ్యాంగం 19 వ సవరణపై ఎ.జి.కె బాపట్ల ఉపన్యాసం రాజాజీని ముగ్ధదను చేసింది. ఆ విషయమై ఎ.జి.కెని శ్లాఘించారు.

నీలం సంజీవరెడ్డికి, తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం అక్రమ పద్ధతిలో గౌరవ డాక్టరేటు ప్రధానం చేయగా, సెనేటరుగా ఉన్న ఎం. విజయరాజకుమార్ దావా వేశారు. ఆ కేసును ఎ.జి.కె చేపట్టి నెల్లూరులో వాదించారు. ముఖ్యమంత్రిపై ఎ.జి.కె అలా పోరాడారు.

గుండెపోటు వచ్చి మంచంలో ఉన్న ఎ.జి.కె ని కీ॥శే॥ ఎ.బి.షా. నేను కలసి వెళ్ళి ఆరోగ్య విషయమై అశ్రద్ధ వహించవద్దన్నాం. చికిత్సకు మద్రాసు వెళ్ళమన్నాం. సరేనన్నాడు. కానీ మంచంలో ఉన్నా కేసుల విషయం సంప్రదించడం, విశ్రాంతి లేకుండా చేసిన వాతావరణంలో ఎ.జి.కె అకాల మరణం చెందాడు. అది హ్యూమనిస్టు ఉద్యమానికి పెద్ద లోటు. కోలుకోలేని దెబ్బ తగిలింది.

పదవులు లేని వారికి, 'నష్టజాతకులకు' సన్మాలు చేయించాడు. స్వేచ్ఛ దెబ్బ తినే ఏ విధానాన్నైనా ధైర్యంగా ఎదురించాడు. 'మాడుఅక్షరాల' 'ఐదవ తరగతి' పండితుల మొదలు 'బ్రహ్మీమయ మూర్తుల' వరకు అన్ని రంగాలలో భిన్నస్థాయి బేధాలతో, ఆదరించడమో, ఎదిరించడమో చేయగలిగాడు. ఎంతటి ఆప్తులైనా తప్పు దారిన పడితే, 'తప్పు' అని హెచ్చరించగలిగాడు. పదుగురాడు మాట చెల్లాలి అంటే, హేతుబద్ధం కాకుంటే ఎలాగని చెప్పి ప్రవాహానికి అడ్డంగా, ఎదురుగా ఈదాడు. ఆయన ఠాగుర్‌ను విమర్శిస్తూ వ్యాసం రాస్తే 'రాడికల్ హ్యూమనిస్టు' (ఆంగ్ల వార పత్రిక) ప్రచురించలేక పోయింది. రాడికల్ హ్యూమనిజం కూడా అనార్కిజానికి దారి తీస్తుందంటే ఆశ్చర్యపోయారు అనుచరులు. కాశ్మీర్ సమస్యపై వ్యాసాలు రాస్తుంటే, అరెస్టు చేస్తారేమోనని మిత్రులు భయపడకపోలేదు. సంస్కృతానికి తెలుగే మాతృక అంటే ఆశ్చర్యంతో నోర్లు నొక్కుకున్నారు.

గుంటూరు జిల్లా, తెనాలి తాలుకా మూల్పూరు గ్రామంలో సామాన్య మధ్య తరగతి రైతు కుటుంబంలో కనిష్ఠుడుగా 29 ఏప్రియల్, 1917లో జననం. ఉన్నత పాఠశాల విద్యాభ్యాసం తురుమెళ్ళలో. అనాడే విద్యార్ధులలో వేరుగా మసిలాడు. ప్రైవేటుగా తెలుగు చదువుకున్నాడు. అప్పుడే కృష్ణ శతకం రాసాడని వినికిడి. కళాశాల విద్యాభ్యాసానికి గుంటూరు ఆంధ్రా క్రైస్తవ కళాశాలలో చేరినప్పటినుండి ప్రతిభావ్యుత్పత్తులు విప్పార నారంభించినవి. స్వగ్రామంలో జి.బి.ఎస్. సరస్వతి స్వాముల వారితో తాత్విక చర్చ ఫలితంగా కలానికి పదునెక్కింది. సెలవుల్లో ఇంటికి వచ్చి, పురాణ శాస్త్రులకు పోటీగా తానూ మహాభారత ఘట్టాలను పురాణంగా చెప్పాడు. అది విని బ్రహ్మానంద భరితులైన తల్లి దిష్టి తీసేయడం ఏమంత విశేషం కాదేమో.

గుంటూరు కళాశాల జీవితంలో భవిష్యత్తుకు పునాదులు ఏర్పడ్డాయి. ఇంగర్‌సాల్,

త్రిపురనేని రామస్వామి రచనలు ఛాందస భావాలను ఛేదించటానికి ఉపకరించగా, ఆ ప్రోత్సాహం మునుముందుకు నడిపింది. పట్టణ విద్యార్థి సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడటం అందులో భాగమే. అపుడే కర్ణాకర్ణిగా ఎం.ఎన్.రాయ్ గురించి విని తెలుసుకోవాలనే జిజ్ఞాసలో ఉండగా, ఒకానొక కమ్యూనిస్టు రాయ్‌ను దూషిస్తూవుంటే సాచి చెంపపెట్టు పెట్టిన ఉద్రేకి గోపాలకృష్ణమూర్తి. ఆప్త మిత్రుడు ఎలవర్తి రోశయ్య చాదస్తాన్ని వదిలించ దీక్ష పూని త్రిపురనేని రామస్వామి పద్యాలను వినిపించి, విప్లవ బీజాలు నాటి ఒకనాటి రాత్రి పిలక కత్తిరించిన చిలిపి గోపాలకృష్ణమూర్తి. చదార్థ సాహిత్య సమితిని స్థాపించి, గ్రాంథిక వాదానికి మద్దతుగా రచనలు సాగించాడు. ఆ తర్వాత సిద్ధాంతంలో వ్యతిరేక సిద్ధాంతం పుట్టినట్లు పచ్చి వాడుక భాషావాదిగా తన పేరును 'క్రుష్నమూర్తి' అని రాసుకున్నాడు. ఆ తర్వాత ఎం.ఎన్.రాయ్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి ఇండిపెండెంట్ ఇండియా దినపత్రిక తెప్పించి గుంటూరులో అమ్మిన ఘట్టాలు కేవలం తలపులుగా నిలిచిపోయినయ్. లక్నోలో ఎమ్.ఏ., ఎల్.ఎల్.బి. చదువుతుండగా రాయ్, బోస్ ప్రభృతులతో పరిచయం అయింది. ఆవుల దృష్టిలో బోస్ సోషల్ ఫాసిస్టు కాగా, రాయ్ తాత్విక విప్లవ మూర్తిగా సన్నిహితత్వం వల్ల గ్రహించగలిగాడు. నేషనల్ హెరాల్డ్‌లో వ్యాసాలు రాయడంతో పత్రికా రచనలోకి దిగాడు. అప్పటి గోపాలకృష్ణమూర్తి తేడా గల రాయిస్టు. చివరి వరకు అలాగే ఉన్నాడు. తేడా గల రాయిస్టుగా ఉండగలగడమే ఆయన వ్యక్తిత్వ విశిష్టత.

విద్యాభ్యాసానంతరం కొద్ది మాసాలు మాత్రం మద్రాసులో, తర్వాత గుంటూరులో న్యాయవాద వృత్తి అభ్యసిస్తూ చివరకు తెనాలిలో స్థిరపడ్డాడు. ఆంధ్రా రాడికల్ డెమోక్రటిక్ పార్టీ కార్యదర్శిగా సన్నిహితులనుండి కూడా ఫిర్యాదులు తెచ్చుకుని, విచారణకు ధైర్యంగా నిలబడి వ్యక్తి స్వేచ్ఛను నిలబెట్టుకున్నాడు. ఆనాటి గోపాలకృష్ణమూర్తి ఉద్వేగి, ఉద్రేకి. తీవ్రంగా రాసేవాడు. కరకుగా ఉండేవి. గాంధీని గురించి వ్రాస్తే, ఆప్త మిత్రులే సహించలేకపోయారు. 1942లో రాడికల్ పత్రిక స్థాపించి పార్టీ పత్రికగా నడిపారు. సమకాలీన సిద్ధాంతాలను వెంటనే అర్థం చేసుకుని, అన్వయీకరణ గావించి తెలుగులో విడమరచి చెప్పగలగడం గోపాలకృష్ణమూర్తికి అబ్బిన విద్య. అందుకే ఆంధ్రాలో ఎం.ఎన్.రాయ్‌కు భాష్యకారుడు కాగలిగాడు. బహుశా అధ్యయన శిబిరాలలో పీఠాధిపతిగా ఇతరులు ముద్ర వేయటానికి కూడా ఇదే కారణం అనుకోవచ్చు. త్రిపురనేని రామస్వామి చేత రాయ్ గ్రంథాలు చదివించి మెప్పించాడు. ఆంధ్రా నుండి వచ్చిన ఫిర్యాదుల ఆధారంగా రాయ్ ఎడముఖంగా ఉంటే, తాను పెడముఖం పెట్టి చివరకు రాయ్, రాజీకు వచ్చేట్లు ప్రవర్తించాడు, కొరియా యుద్ధం వంటి సమస్యలలో 'నీకింకా కమ్యూనిస్టు మనస్తత్వం వదలలేద'ని రాయ్‌ను ముఖాన కొట్టినట్లు అనగల సాహసోపేత భావుకుడు మూర్తి. అందుకే తేడా గల రాయిస్టు. రాయ్ పార్టీను రద్దు చేయాలనే తీర్మానాన్ని బలపరచి భావగమన వేగాన్ని అందుకొన్న ఆలోచనాపరుడు. క్రమంగా పలుకులలో పరుషం సడలించి, మాధుర్యం పెంచి, రాతలలో 'పోలీస్ దెబ్బల' తీరును సాగించాడు. వివిధ రంగాలలో పునర్వికాసోద్యమాన్ని నడిపే యత్నంలో నిర్విరామ కృషి చేసి, అనారోగ్యానికి పునాదులు వేసుకున్నాడు. అవసరం వచ్చినప్పుడు జారుకునే మిత్రులు అనబడే వారి మధ్య, అషాడభూతులుచుట్టూ క్రమ్మిన



67

వాతావరణాన్ని నిబ్బరంగా ఆకళింపు చేసుకుని, ఎన్నో మానసిక వైవిధ్యాలను ఎదుర్కొంటూ గజగమనం సాగించాడు. 1954లో తెనాలి పురపాలక సంఘ అధ్యక్షుడిగా కొద్దికాలంపాటు నిర్మాణాత్మక ప్రజాస్వామ్యాన్ని ఆచరించ ప్రయత్నించి, కొంత సఫలత, కొంత విఫలత పొందాడు. మానసికంగా ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ తామరతంపరగా మాజీ మిత్రులను తయారుచేశాడు. ఆయన 'చుట్టూ ప్రపంచంలో' పత్రికా విలేకరులు, కళాకారులు, కవులు, స్వాములు, పురపాలకులు, రాజకీయపు మనుషులు, హ్యూమనిస్టులు, అన్యులు ఉండేవారు.

వ్యాసాలు, ఉపన్యాసాలు, పౌరోహిత్యం, ప్రెస్ క్లబ్, బాలకళామందిర్, లయన్స్‌క్లబ్, పంతుళ్ళ సమావేశాలు, సన్మానాలు కవులకు, కళాకారులకు : స్టడీకాంపులు రాడికల్ హ్యూమనిస్టులకు : అన్నిటా 'గాత్రం' పాడి, 'వైశేషికత్వాన్ని' నిలబెట్టుకున్నాడు. అనేక యుద్ధముల ఆరితేరిన జ్ఞానవృద్ధుడయ్యాడు. అఖిల భారత సమావేశాల్లో అమెరికా, ఐరోపాలలో విశిష్టుడుగానే చలామణి అయ్యాడు. ఇంట్లో పిల్లల మధ్య హాయిగా కాలక్షేపం చేశాడు. వాళ్ళు పూజలు, పునస్కారాలు చేస్తుంటే మత స్వేచ్ఛ అర్థం చేసుకుని ఆచరణలో పెట్టిన వ్యక్తి గనక నిరోధించనూలేదు, ప్రోత్సహించనూలేదు. తన భావాలను చెప్పేవారు. వాటి ప్రభావం తక్షణమే చూడాలన్నంత రాజకీయవాది కాదు.

---

'Man is essentially a rational being. His basic urge is not to believe, but to question, to know. -

- MN. Roy.

"Freedom, knowledge, truth are values to be appreciated together by living them".

- MN. Roy.

Man is a part of society. Society is a part of nature and the animate nature is the part of the physical Universe. Therefore no political practice can guarantee ultimate success unless it is guided by fundamental philosophical principles.

- MN. Roy.

Man, the creator of machines, is greater than the means of production. Man did not emerge from the process of evolution with the hammer, but with a distinctive brain. The human brain, itself a kind of "means of production" is more powerful than the most powerful machine.

- MN. Roy.

# మినీ కవితలు

-కళాప్రియ,

మాతృభాషా చీత్కారం
పరభాషా వ్యామోహం
'పొరుగింటి పుల్లకూర" రుచే!
గ్రంథాలయాలా?
వాగ్దేవీ నిలయా!
జ్ఞాన జ్యోతులు వెలిగే
దేవాలయాలు!!

పుట్టలోని పాముకు
పూజిస్తారు!
కంట బడితే
బడిత పూజే!!

విచక్షణ లేని
ప్రజాధన వినియోగం!
"బూడిదలోపోసిన
పన్నీరు" చందం

ఎన్నిక లొస్తే!
నోట్లకు ఓట్లు
నాయకుల రూటే
సెపరేట్లు॥

**అభిప్రాయవేదికః-**

మాన్యులు వెంకటాద్రిగారికి-

"నేనూ-నా రచనావ్యాసంగం" చదివి ఆనందించాను, పెరియార్, అన్నాదొరైగారలతో మీ అనుబంధం ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించింది. మీ రచనలు, మీ వ్యక్తిత్వం గొప్పవి. ధనంకోసం, కీర్తి కోసం గాక, మీరు భావప్రచారం కోసం రచనలు చేయటం అరుదైన కృషి. ఎన్నెన్నో ప్రతికూల పరిస్థితులు ఎదురైనా, మీరు మొక్కవోని దీక్షతో మీకృషిని కొనసాగించారు. మీది ధన్య జీవితం. హేతువాద నాస్తికోద్యమాలు లక్ష్యం ఇంకా చాలా దూరంవుండగానే చీలికలు, పీలికలై పోవటం బాధాకరం.

మీ
రామమోహనరాయ్, గుంటూరు.

# విజ్ఞానశాస్త్రతత్వం- మానవస్వభావం.

- కుర్రా హనుమంతరావు.

ప్రకృతి, జీవితానికి సంబందించిన సమగ్ర సిద్ధాంతాన్ని వివరించటమే తత్వ శాస్త్రధ్యేయం. తత్వానికి ఆధారం భౌతిక జ్ఞానమే కాని ఊహాత్మక, అభౌతిక జ్ఞానం కాదు. ఆదిభౌతిక భావనలపై ప్రతిపాదించే తత్వమేదీ సమగ్ర జీవనతత్వం కాబోదు.

విశ్వ పరిణామ ఫలితమే జీవం. పదార్థం కొన్ని ప్రత్యేక పరిస్థితులలో వ్యక్తీకరించే లక్షణమే జీవం. అదే నేటి విజ్ఞానశాస్త్ర ఆవిష్కరణ. దీని ప్రకారం జీవం పదార్థానికి కొత్త శక్తి అనిగానీ, అది యెక్కడి నుండో వచ్చి పదార్థంలో జొరబడిందని కాని అనుకోలేము. అది పదార్థ లక్షణమే. అనుకూల పరిస్థితులలో ప్రకటితమవుతుంది. అంటే జీవం వస్తుగతం. జీవపరిణామ క్రమాన్ని పరిశీలిస్తే నిర్జీవపదార్థం నుండి అర్ధ జీవపదార్థం, దాని నుండి పూర్ణ జీవపదార్థం వివిధ రూపవైవిధ్యాలతో కోతుల నుండి మనుషుల దాక పరిణామం చెందింది. నిర్జీవంగానీ, సజీవంగాని పదార్థమంతా పదార్థమే. పునరుత్పత్తి జీవి అత్యున్నత లక్షణం. అంటే పదార్థాన్ని ఆహారంగా తీసుకుని, తన ప్రతిరూపాలను సృష్టించి బయటవేసే లక్షణమే జీవ పదార్థ లక్షణం. అదే జీవ నిర్జీవాల మధ్య వ్యత్యాసం. ఈశాస్త్రీయ ప్రతిపాదన సృష్టివాదాన్ని అసంబద్ధమని తేల్చింది. అందుచేతనే మానవజీవిత వర్తమాన, భవిష్యత్ అవగాహనకు విశ్వతత్వంపైనే ఆధారపడి నిర్ణయించాలి. అదే వాస్తవ చిత్రమవుతుంది కూడా.

శాస్త్రజ్ఞానంపై ఆధారపడిన భౌతికవాదమే అసలైన తత్వం. భౌతికవాదమొక్కటే హేతుబద్ధ తత్వవిచారణకు, ఫలవంతమైన శాస్త్ర అన్వేషణకు ఉపయుక్తమైన ప్రతిపాదనను అందిస్తుంది. మిగిలినదేదైనా చివరకు మతంలోనే ఐక్యమవుతుంది. ఆధునిక విజ్ఞానశాస్త్రం సంప్రదాయ భౌతికవాద సామాన్యీకరణలకు నిర్ధారణనను అందించింది. ప్రపంచం భౌతికంగాను, జీవపరంగాను వస్తుగతమైనదే- విశ్వం స్వయంసంపూర్ణం, స్వయం వివరణాత్మకం- విశ్వానికి ఆవలగాని, అన్యంగగాని ఏమీ ఉండదు- విశ్వనియమాలు మార్మికంగాని,ఆదిభౌతికంగాని, సంప్రదాయంకాని కావు- విశ్వ సంఘటనలన్నీ కార్యకారణ బద్ధమైన గొలుసులే. అవన్నీ విడదీయవీలుకాని సంబంధంకలవే- పదార్థ లక్షణమే చైతన్యం, ఒక వ్యవస్థీకృత రూపంలో వ్యక్తమయ్యేదే చైతన్యం. ఈసామాన్యీకరణలతో అనేక శాఖలుగా ఉన్న శాస్త్రీయజ్ఞానాన్ని-వాస్తవికవాదం, ప్రకృతివాదం, పదార్థవాదం, వస్తువాద మని ఏపేర్లతో పిలిచినా అది భౌతికవాదమే. కల్పనలు, మూఢనమ్మకాలను వ్యతిరేకించి తత్వాన్ని మతస్థాయికి దిగజారకుండా కాపాడగలిగేది భౌతికవాదమొక్కటే. ఆధునిక విజ్ఞానం విశ్వస్వభావాన్ని తేటతెల్లం చేసి మార్మికతను త్రోసివేసి ప్రకృతినియమ అవగాహనకు ఇతోధికంగా దోహదంచేసింది. విశ్వం నియమబద్ధం, స్వయంచలనం, స్వయం సంవృద్ధి అయిన పదార్థక్రమంగా నిరూపించి, అతీతభావనలతో కూడిన ప్రకృతివివరణలకు ముగింపునిచ్చింది.

సమగ్ర తత్వ వివరణకు ఉపయోగపడినంతకాలమే మతం మానవ మేధోపరమైన నైతిక ఆవశ్యకతగా కొనసాగింది. మేధోవికాసంలోని మొదటిదశే అతీతభావన. అదీ హేతుబద్ధ వ్యక్తీకరణే. దాని మేధోపరమైన వ్యక్తీకరణలు తదనంతర స్థాయికి చేరక మతంగా తిష్ట వేయగా-



66

తదనంతరం కొనసాగిన జ్ఞానమే తత్వానికి మూలమైంది. ఆ హేతుబద్ధ కొనసాగింపు నందుకోనందునే మతం తన భౌతిక జ్ఞానతృష్ణను కోల్పోయి, జడమై అతీతభావన వద్దనే ఆగిపోయి తన వాస్తవభూమికను వదలివేసి పిడివాదమైంది. కాగా మతం ఆగినచోటు నుండి సాగిన నిరవధిక కొనసాగింపే నేటి మానవ జీవనతత్వ పునాదిమైన భౌతికవాదం. అందుకే భౌతికవాదం తత్వం కాగా మతం పిడివాదమైంది.

ఆధునిక విజ్ఞానశాస్త్రం మానవ స్వేచ్ఛాపిపాస ఫలితమే. మనిషి ఇతర జంతుజాలంవలె కేవలం నిమిత్తమాత్రుడైన ప్రకృతి పరిశీలకుడు కాడు. మానవ ఉద్భవం, పరిణామం భౌతిక పరిసరాలతోనే ముడివడి మనుగడ పోరాటంలో ఉద్భవించినదే జ్ఞానార్జన కాంక్ష. తన మనుగడ కోసం జీవిచేసే పోరాటమే స్వేచ్ఛా పోరాటం. అదే జీవలక్షణం. అంటే జీవి స్వేచ్ఛాకాంక్ష స్వయం ఉద్బుద్ధమేగాని బయటనుండి దూర్చబడింది కాదు. మనుగడ పోరాటంలో పరిసరాల జ్ఞానం జీవాశ్యక లక్షణమైంది. దాని ప్రతిస్పందనే స్వేచ్ఛాపిపాస.

జీవి స్వేచ్ఛను వాంఛించేది రక్షణకే. తన వ్యక్తిత్వ ప్రతీకరణకు వ్యక్తీరించేవే స్వేచ్ఛసంకల్పాలు. పరిసరాలకు స్పందించటం జీవిప్రాయిక లక్షణం. చైతన్యం బుద్ధిజీవుల లక్షణం. పదార్థ ఉత్పన్నమై, పదార్థంలో కలిసి జీవించే జీవికి లభించేది పదార్థజ్ఞానమే. అందువల్లనే జ్ఞానమంటే భౌతికజ్ఞానమే అవుతుంది. జీవి పోరాటం చేసేది పదార్థ నిర్మితమైన ప్రకృతి ఆటంకాలతోనే. ఆటంకాలు తొలిగించుకొని మెరుగైన జీవనం సాధ్యమయ్యేదీ ప్రకృతి నియమబద్ధ అవగాహన స్థాయిని బట్టే. అవగాహనాస్థాయి పెరిగే కొద్దీ జ్ఞానం విస్తృతమవుతుంది. జ్ఞానస్థాయిని బట్టి స్వేచ్ఛా పరిధి విస్తృతమవుతుంది. జ్ఞాన పరిణామమే మనిషిలో ప్రతిస్పందించే స్వేచ్ఛా పిపాస. స్వేచ్ఛాపిపాసే జ్ఞానతృష్ణను పెంచుతుంది. అంటే జ్ఞానం కేవలం జ్ఞానం కోసం కాదు. మెరుగైన అవధులులేని స్వేచ్ఛ కోసమే. భావవాదులు ప్రవచించినట్లు జీవిత ధ్యేయం జ్ఞానం కాదు. స్వేచ్ఛను అరికట్టి మనిషిని జ్ఞానం పూర్ణుని చేయాలనే ఆలోచనలన్నీ అహేతుకమైనవే. అందుకే స్వేచ్ఛ మనిషి ప్రాయిక లక్షణంగా చెప్పటం.

స్వేచ్ఛా పోరాటం అంతంలేనిది. కాన, జ్ఞానం కూడా అంతంలేనిదే. జ్ఞానార్జన అంతంలేనిదయినపుడు జ్ఞానం పరమం కాలేదు. నూతన అంశాల వెలుగులో పాతజ్ఞానాన్ని మార్చుకుంటాం. అందుకే మతస్తులు ప్రవచించే పరమజ్ఞానం అభూతకల్పనే అవుతుంది. పరిణామాన్ని, నూతన ఆవిష్కరణలను పరిగణలోకి తీసుకోనందునే మతం దిగజారి అజ్ఞానంగా వ్యవస్థీకృతమైంది.

జ్ఞాన మరొక ధ్యేయం జీవనవిధాన రూపకల్పన. లభించిన జ్ఞానం, దాని అవగాహనతో జీవనతత్వాన్ని నిర్మించుకోవటం బుద్ధిజీవుల లక్షణం. సమగ్ర జీవన తత్వమంటే అత్యంత ఆధునికజ్ఞానంతో నిర్మించబడేది. అలా జ్ఞాన ధ్యేయం జీవనతత్వ నిర్మాణమవుతుంది. ఇందులో అభౌతిక, మార్మిక భావనలకు తావే వుండదు.

జ్ఞానం మానసిక చర్య. ఆలోచన అలాంటి స్వభావం కలది కాదు. జ్ఞానం ఉనికితో సమానమైనది. ఆలోచన జ్ఞానానికి మూలమైనా, ప్రతి ఆలోచనా అవశ్యంగా జ్ఞానవంతం



68

(భౌతికం) కాకపోవచ్చు. అంటే జ్ఞానం భౌతికం కాగా,ఆలోచన అంతర్గతం. జ్ఞానం శాస్త్రీయమైతే విజ్ఞానమవుతుంది. అంటే భౌతిక, వాస్తవ ప్రపంచం ఆధారంగా గ్రహించే జ్ఞానం శాస్త్రీయత సంతరింపుతో విజ్ఞానమవుతుంది. ఆ విజ్ఞానమే నేడు తత్త్వానికి భూమికై సంప్రదాయభావాలను తుత్తునియలు చేసింది. మతజ్ఞానాన్ని, అతీతత్త్వాన్ని వమ్ముచేసి వాస్తవచిత్రాన్ని మనిషికి అందించి స్వేచ్ఛావాదం, లౌకికవాదం, ప్రజాస్వామ్యాల ఆవిర్భావానికి దోహదకారి అయింది. అదే పునర్వికాసం. అది మధ్యయుగాలనాటి అంధకారం నుండి మనిషిని స్వేచ్ఛాజీవిని చేసింది. జ్ఞాన ధ్యేయం స్వేచ్ఛ అనే భావన పునర్వికాస ప్రయోగశాల ద్వారా మరొకసారి నిరూపించబడింది. ప్రజలను ఆధ్యాత్మిక స్వేచ్ఛావంతులుగా చేయగలిగింది ఆధునిక విజ్ఞానశాస్త్రం ఒక్కటే. ఆ శాస్త్ర ఆలంబనే మతంపై మనిషిదాడి. దేవునిపై తిరుగుబాటు. అందుకే శక్తి అంటే జ్ఞానమే అనటం.

భౌతిక విశ్వంలోని సంఘటనల మధ్య సంబంధమే స్పందనలు. దానిని భౌతిక సంఘటనల పట్ల పదార్థ ప్రతిస్పందన గానే అర్థంచేసుకోవాలి. అయితే వాటిస్థాయి భిన్నస్థాయి పదార్థ నిర్మాణాలలో భిన్నంగా వుంటుంది. దిగువస్థాయి జీవులలోని స్పందనే ఉన్నతజీవులలో ప్రేరణ- ఆప్రేరణ కొనసాగింపే మనిషిలోని సంవిత్తి. దానిని భౌతికసూత్రాల ద్వారా అవగతం చేసుకోవాలనే గాని, అభౌతిక అంశాలను జోడించరాదు. జీవికి, ప్రకృతిసంఘటనలకు మధ్య సంబంధం కలిగినవి జ్ఞానేంద్రియాలు, మెదడు. మెదడు ప్రక్రియ విద్యుత్ రసాయన ప్రక్రియ. అందువల్ల అది భౌతికచర్య అవుతుందే గాని మార్మికం కాలేదు. స్పర్శేంద్రియం జ్ఞానార్జన క్రమంలో ప్రధానమైనది. స్పర్శ ద్వారా గ్రహించే సంవేదనల ప్రతి స్పందనలే జీవులలోని వివిధ స్థాయిలలోవ్యక్తమయ్యే స్పందనలు, ప్రేరణలు. ప్రేరణకు ప్రతిస్పందనగా జీవాస్థిగా ఎదిగిందే మెదడు. మెదడు వ్యాపారంలో చివరిదైన గ్రాహ్యం కూడా భౌతికమయినదే.

గ్రహింపు అంటే కేవలం బాహ్యప్రపంచంలోని సందేశాలను రికార్డు చేయటంకాదు. సందేశాలు, స్పందనలకు తెలివైన ప్రతిస్పందనే మేధస్సు. అందుచేతనే ప్రతిస్పందించగలిగే జీవులే బుద్ధిజీవులవుతాయి. ఆ బుద్ధిజీవులే జ్ఞానార్జన చేయగలుగుతాయి. దానిని విచక్షించుకోగలిగిన జీవులే ఉన్నతజీవులు. గ్రహింపు దిగువస్థాయిజీవులలో జరిగే యాంత్రిక ప్రతిస్పందన. కాగా ఉన్నతజీవులలో అది జోక్యరహిత ఎంపిక కాదు. సందేశాలిచ్చిన వస్తుస్వభావాన్ని విశ్లేషించగలిగే న్యాయబద్ధ విచక్షణే గ్రహింపు. అన్ని జీవులలో ఈ ప్రక్రియ సాధ్యం కానందునే కొన్ని జీవులు సహజాత స్థితిలోనే వుండిపోయాయి. గ్రహించి, విశ్లేషించి, పూర్వానుభవాలను పొందికగా అమర్చుకునే జ్ఞాపకశక్తి లేనందునే వాటి నడవడి సహజాతస్థాయిలో ఆగిపోయింది. బుద్ధిజీవులు పరిసరాల నుంచి () గ్రహించి వాటిని భౌతికవాస్తవతే చిత్రాలుగా ప్రతిబింబిస్తాయి. ఆ వాస్తవ చిత్రాలే జ్ఞానమంటే. అంతేగాని జ్ఞానమంటె మానవేతరం, జీవేతరంకాదు.

స్థిరంగా, నిరంతరాయంగా బాహ్యశక్తులతో జరిగే సంబంధం వలన జీవికి జ్ఞానం సాధ్యం. దైనందిన జీవితచర్యల పరిశీలన, ప్రణాళికాబద్ధ పరిశోధన, విమర్శనాత్మక పరీక్ష,

హేతుబద్ధ సమన్వయం, తార్కికశక్తి ద్వారా జ్ఞానం సాధ్యమవుతుంది. పై పద్ధతులను వినియోగించగలిగినపుడే అది జ్ఞానస్థాయిని అందుకోగలదు. ఆ స్థాయి జ్ఞానమే వాస్తవ జీవనతత్వాన్ని ఆవిష్కరించగలుగుతుంది. లేనివన్నీ మతస్థాయిలోనే పతనమవుతాయి.

భౌతికవాదం ఏకత్వం కలది. భౌతిక జ్ఞానాధారిత తత్వానికి ద్వయీభావన లేదు. జీవివేరు-ఆత్మవేరు, భౌతిక విశ్వం వేరు-జ్ఞానంవేరు, జ్ఞానం పరమం-పరిణామం చెందదు, ఈలోకానికీ జ్ఞానానికీ సంబంధంలేదనే వాదనలన్నీ శుష్కవాదాలేగాని వాస్తవాలు కావు. భౌతికవాదం నియతం. జ్ఞానం భౌతికం కావటం అంతకన్నా నియతం. ఇందులో సంశయవాదానికి తావేలేదు.

ప్రకృతిశాస్త్రాల అభివృద్ధి శాస్త్రజ్ఞాన సమస్వయాన్ని సుగమనం చేసింది. ఆధునిక మనస్తత్వశాస్త్రం శరీరశాస్త్ర సహాయంతో 'మనస్సు' పట్ల సంప్రదాయ మార్మిక భావాలను తొలిగించింది. దానితో 'ఆత్మ' భావన అసంబద్ధమని రుజువైంది. మనస్సు వ్యక్తీకరించే భావనల సమాహారమే సనాతనులు భావించే 'ఆత్మ' అని తేల్చి వేశారు. శరీరానికి అన్యంగా జీవంగాని, ఆత్మగాని ఉనికిలో ఉండటం సాధ్యం కాదని తేల్చివేశారు. దానితోనే పాప పుణ్యఫలమైన పునర్జన్మల పరంపర ఊహేననే వాస్తవం గ్రహించిన విజ్ఞులు ఆత్మసిద్ధాంతాన్ని ఆదిలోనే తుంచివేశారు. దానిని నేటి విజ్ఞానశాస్త్రం సాధికారికంగా ధృవీకరించింది. పునర్జన్మ సిద్ధాంతం ఆధారంగా నిర్మితమైన దొంతరల అనైతిక సమాజాలన్నీ బీటలువారి మానవ సమతాభావన వెల్లివిరిసింది.

నవ్య భౌతికవాదం అధిభౌతిక అంశాలుగా భావించే వాటిని భౌతికశాస్త్రపరిధిలోకి తెచ్చింది. పదార్థం, స్థల కాలాలు, కార్య-కారణత వంటి అంశాలు భౌతికశాస్త్ర వికాసం వలన ఎక్కువకాలం మార్మికం, కాల్పనికంగా ఉండలేకపోయాయి. పరిశీలన, పరిశోధనల ద్వారా స్థలకాలాలకు సక్రమమైన వివరణ లభించింది విశ్వానికి ముందేమిటి,-ఆదిలో ఏముంది అనే ప్రశ్నలు అసంబద్ధ ప్రశ్నలైనాయి. పదార్థ-ప్రదేశ-కాలాలు మూడూ పెనవేసుకునే ఉంటాయి. కాలం, ప్రదేశం పదార్థ అస్థిత్వంతో నిమిత్తంలేకుండా ఉంటుందని సాపేక్షసిద్ధాంతానికి పూర్వం భావించటం జరిగింది. సాపేక్షసిద్ధాంతం ఈ సందేహాన్ని తీర్చింది. కాలం పదార్థ పరిణతికి సంబందించిన ప్రవృత్తి. కేవల ఉనికి ఉండదు. అలానే పరిణామరహిత అస్థిత్వానికీ అర్థంలేదు. పదార్థం నిరంతరం పరిణతి చెందుతూ వుంటుంది. దానికి సంఘటనలే మూలం. పదార్థపరిణితిలో రెండు సంఘటనల మధ్య జరిగే 'వ్యవధినే' కాలమంటాము. పదార్థం లేనిదే సంఘటనలుగాని, అవి లేనిదే 'కాలం' గాని ఉనికిలో కిరావు. అందుచేతనే పదార్థానికి ముందు ఏముంది? అనే ప్రశ్న-దానికి సంబందించిన జవాబులన్నీ అసంగతాలయ్యాయి.

ప్రదేశమనేది పదార్థం యొక్క అస్తిత్వానికి సంబందించిన విస్తృతి. రెండు బిందువుల మధ్య దూరమే ప్రదేశం. పదార్థం లేనపుడు ప్రదేశమే ఉండదు. కావున శూన్యప్రదేశం ఊహాత్మకమే. పదార్థంకూడా నిష్క్రియాపర్యంలో కాక 'పరిణితి' పొందుతుండటం దాని సహజలక్షణం. అందుకే ప్రదేశకాలాలు సాధ్యమవుతున్నాయి. విశ్వమంటే ప్రదేశకాలాలతో కూడిన ద్రవ్యవిస్తరణ అని



69

ప్పుకున్న తర్వాత, పదార్థ, ప్రదేశ కాలాలు వినా మరేమీ లేవుకాబట్టి విశ్వానికి ఆవల, ముందు, వెనుకా భావనలే ఉండవు. 20వ శతాబ్దిలోని శాస్త్రజ్ఞాన విప్లవంతో 'సృష్టి' కంతటికీ ఏదో ఉండితీరాలనే ప్రయోజనవాదం తప్పని రుజుఅనే. అవ్యాకృత ప్రశ్నలన్నింటికీ శాస్త్రీయ సమాధానాలనిచ్చి సృష్టిభావనే తప్పని నిరూపించగలిగింది.

నవ్య భౌతికశాస్త్రం అణువును ఎలక్ట్రానులు, ప్రోటాన్లుగా విడగొట్టి వాటి అంతర్గత నిర్మాణాన్ని పరిశీలించింది. దాని ఫలితంగా ప్రాచీన అధిభౌతిక భావన మసకవారి భౌతిక స్వభావాన్ని గణితశాస్త్ర బద్ధంగా కొలవవచ్చుననే విషయం నిరూపితమైంది. రేడియేషను వంటి అన్ని పదార్థరూపాలను విద్యుత్ చర్యగాను, విద్యుత్‌ను భౌతికకణాల కలయికగానూ లెక్కించే దోరణి ప్రబలింది. ఏ రూపంలోవున్నా విశ్వపదార్థమంతా ఒక్కటేనని నిర్ధారించారు. పదార్థం-శక్తి ఏకీకృత లక్షణాలు గల భౌతికవిశ్వ నేపధ్యానికి చెందిన పదార్థ దశలేనని రుజువుచేయగలిగారు.

సాపేక్ష సిద్ధాంతం ప్రదేశ కాలాల సమస్యను పరిష్కరించి వాటిని పరమంగా భావించే అర్థరహిత వాదాలను ఖండించింది. ప్రదేశ కాలాలు అంతిమసత్యాలుకావు. ఆ రెంటి పుట్టుక ఒకచోటనే. పూర్తి భిన్నంగా కనిపించినా అవి విడదీయరానంతగా కలసిపోయినవే. ప్రాథమికంగా అవి భౌతిక వాస్తవికతకు ప్రతినిధులు. అలా పదార్థం ఆ రెంటినీ తనతో బంధించింది. పరిణతి చరిత్రను కలిగి ఉంటుంది. కేవల ఉనికి, పదార్థంలేని ఉనికి పదార్థపరిణామం లేని కాలం అర్థరహితమయ్యాయి.

లాప్లాస్ నుండి గణిత శాస్త్రజ్ఞులంతా భౌతిక విశ్వపరిణామం ఎలా ప్రారంభమైనదనే ఊహలు చేశారు. ఆధునిక ఖగోళ భౌతికశాస్త్రం నెబ్యులర్ హైపోథిసీస్‌ను గణితశాస్త్రబద్ధమైన సంక్షిప్త సిద్ధాంతంగా అభివృద్ధిచేసింది. విశ్వంలోని నక్షత్రాలు, గెలాక్సీలు గ్యాసోసిస్ నెబ్యులా నుండి ఏలా ఉద్భవించాయో వివరించి- ఆ క్రమం నేటికీ కొనసాగుతున్నదని వివరించింది. దానితో సూర్యుడు దేవుడంటించిన దివిటీ అనే మత భావనకు చుక్కెదురైంది. అనంతవిశ్వాన్ని గురించిన అవగాహనే దేవునికి లేదనే భావన ప్రాచుర్యం పొంది మత గ్రంథాల విశ్వతత్వం ఊహేనని స్పష్టమైంది.

నేటి భౌతికశాస్త్రం విశ్వానికి ఆది, అంతం లేదని నిరూపించింది. భౌతిక పరిణామం వెనుకకు తిరిగేదికాదు. సూర్యుని నుండి విడుదలైన ధార్మిక శక్తి తిరిగి సూర్యుడిని చేరదు. అది ఒకే స్థిరమార్గంలో పయనిస్తూ నూతనశక్తిగా మారవచ్చు. విశ్వవ్యవస్థలోని కొన్ని ప్రత్యేక భాగాలు మరణించకపోవచ్చు. వాటిచే విడుదల చేయబడుతున్న వేడిమి వాటికి తీవ్ర నష్టం కలిగించేదికాదు. పరిణామంలో అది నూతననక్షత్రాలుగా నిర్మించబడుతున్నది. ఇదంతా యాంత్రికం. పదార్థ ఘటనా విఘటనలే. దానికెవ్వరి ప్రమేయం అవసరంలేదు. విశ్వ అనంత పరిణామంలో ఏ బాహ్యశక్తి ప్రమేయంలేదు, ఆ అవసరం కూడా లేదు. ఆ తార్కిక ముగింపుతో వచ్చిన భావనే **'మనిషి తన భవితవ్యాన్ని తానే నిర్మించుకోగలడనే'** భావన -అదే బుద్ధి జీవులు కనుగొన్న అతిపెద్ద సత్యం.



70.

# జీన్స్-3

-ఆర్.వి. సుబ్బారా

జన్యువుల సంఖ్యను బట్టి వివిధ ప్రాణులేర్పడ్డాయి. మానవ జన్యు చిత్రపటం రూపొందించాలని 18 దేశాల సహకారంతో అంతార్జాతీయంగా జినోం ప్రాజెక్టు యు.యస్.ఏ.లో 1991 లో ఆరంభమయ్యింది. దీనికి డైరెక్టరు ఫ్రాన్సిస్ కోలిన్సు (Francis Collins) మరో జినోం ప్రాజెక్టు డా.క్రేగ్ వెంటర్ (Dr.Craig Venter) ఆధ్వర్యంలో ప్రైవేట్ నిధులతో పరిశోధనచేసింది. జూన్ 26, 2000 న 21వ క్రోమోసోం ముసాయిదా పటం వెలువడింది. పూర్తి స్థాయి పటం 2003 లో రూపోందింది. నేచర్, సైన్సు జర్నల్సులో ఫిబ్రవరి, 2001లో వెల్లడించిన పరిశోధనల ప్రకారం మనిషికి 30,000 నుండి 35,000 వరకు జన్యువులు ఉన్నాయి.

ఈ మానవ శరీర కణ డీ.ఎన్.ఏ. (జన్యు) చిత్ర పటంతో జన్యువ్యాధులుగా విజృంభించే జన్యు లోపాల్ని, రోగి జన్యు పటం నుండి గుర్తించే అవకాశం కలుగుతుంది. జన్యు పరివర్తన (Mutation) ను గుర్తించి, జన్యు మార్పిడి చికిత్స చేయడానికి సహకరిస్తుంది.

జీవుల జన్యు చిత్ర పటాల వలన మనిషికి ఇతర జంతువులకు మధ్య డీ.ఎన్.ఏ. క్రమం (D.N.A. sequence) లో పోలికలు వెల్లడయ్యాయి.

చింపంజీ జన్యు పటాన్ని కాలిఫోర్నియా శాస్త్రవేత్త తర్జె ఎస్. మికిల్‌సిన్ ఆవిష్కరించారు.

అరవై లక్షల సంవత్సరాల క్రితం వానరుడికి, నరుడికి పూర్వీకులు ఒకరేనని, అయితే కాలక్రమేణా దాదాపు నాలుగు శాతం జన్యువుల్లో వచ్చిన మార్పుల వల్ల వానరుడు, నరుడు విడిపోయారని మికిల్ సిన్ తెలియజేశారు.

జన్యు చిత్ర పటాల పరిశీలనలవలన మనిషి తనలోని డి.ఎన్.ఏ. (జన్యు) క్రమంలో 99% చింపంజీలతో 85% కుక్కతో, 50% ఫ్రూట్ ఫ్లైలతోనూ, అలానే చాలా జన్యువులు ఈస్టు, బాక్టీరియాలతో పాలు పంచుకొన్నట్లు తెలిసింది. ఇది పరిణామ క్రమం మానవునిపై చూపిన ప్రభావం.

ప్రకృతి శాస్త్రవేత్త చార్లెస్ డార్విన్ (1809-1882) జీవ పరిణామ సిద్ధాంతం వానరుడు నరవానరుడుగాను, నరవానరుడు నరుడుగాను భూమిపై ప్రాణ పరిణామ క్రమంలో ఏర్పడడాన్ని తెలియ జేస్తుంది. ఆయన పుస్తకం 'ది ఆరిజిన్ అవ్ స్పీసీస్' 1859 లో ప్రచురించబడింది. ఆయన పరిణామ సిద్ధాంతం ఋజువవుతున్నది.

భూమిపై నాలుగు బిలియన్ల సంవత్సరాల క్రితం పుట్టిన ప్రాథమిక జీవి డి.ఎన్.ఏ. నుండి మనం ఏర్పడ్డామనడానికి ఇది ఆధారమవుతున్నది.

నెమటోడ్ వాంకు 18,000, ఫ్రూట్ ఫ్లైకు 13,000, క్షయ బాక్టీరియంకు 4,000, ఈస్టుకు 6,000, జన్యువులున్నాయని పరిశోధనలు తెలిపాయి.

మానవుడు జన్యువుల, పరిసరాల ఉత్పత్తిగా శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

ప్రాణుల జన్యు నిర్మాణంలో మార్పులు, చేర్పులు చేసి మనిషి అవసరాలకు వీలుగా రూపాంతరం చేయడం జీవ సాంకేతికత సాధ్యంచేసింది. వాణిజ్యానికి వీలుగా క్రొత్త లక్షణాలున్న మొక్కల్ని సృష్టించడం, జంతువులకు సరిక్రొత్త లక్షణాల్ని అందించడం సాధ్యమయ్యింది.

ఆదిమానవ జాతి 50 వేల సంవత్సరాల క్రితం ఈశాన్య ఆఫ్రికాలో నివసించి, వలసలతో ప్రపంచ మంతటా విస్తరించిన సత్యాన్ని జన్యు శాస్త్రాం ధృవీకరించనుంది.

హైదరాబాదులోని సెంటర్ ఫర్ సెల్యూలార్ అండ్ మాలిక్యులర్ బయోలజీ (సీ.సీ.ఎం.బీ.) పరిశోధనల్లో అండమాన్, నికోబార్ దీవుల్లోని పురాతన ఓంగీ, గ్రేట్ అండమానీస్ తెగల ప్రజలు ఆఫ్రికాలో 1.5 లక్షల ఏళ్ళ క్రితం నివసించిన ప్రజల వారసులని తేలింది. మలేషియాలోని ఓరంగ్ అస్లీతెగ కూడా ఆఫ్రికాలోని తొలి మానవుల సంతతేని తేలింది.

ఒక మనిషి పూర్వీకులు ప్రపంచంలోని ఏయేప్రాంతాల వారో నిర్ధారించే విధానం, బిడ్డ జన్యువుల్ని చదివి తల్లి దండ్రున్ని గుర్తించే విధానం ఆచరణకు వచ్చింది.

జన్యు శాస్త్రం కులమత ప్రాంతాలకు, రంగుకు, భాషకు అతీతంగా ఎదిగి పోతుంది.

### క్రోమసోంలు

ప్రతీశరీర కణకేంద్రకంలో కడ్డీల వంటి అకృతుల్లో క్రోమసోంలు ఉంటాయి.

ఇవి సంఖ్యలో 46 అని, 23 జతలుగా ఉంటాయని, వీటిల్లో సగం తండ్రి నుండి, సగం తల్లి నుండి బిడ్డకు సంక్రమిస్తాయని, ఇవిగాక సంతాన కణాలైన శుక్రకణం, అండం మాత్రం దేనికదే క్రోమసోంల సగ భాగాన్ని మాత్రమే కలిగి ఉంటాయని మనకు తెలుసు.

స్త్రీ పురుషులలోని 22 జతల క్రోమసోంలు ఒకే విధంగా ఉంటాయి. స్త్రీలో రెండు 'ఎక్స్' క్రోమసోంలు ఉంటే, పురుషునిలో ఒక 'ఏక్స్' ఒక 'వై' క్రోమసోంలు ఉంటాయి.

సెక్స్ ద్వారా జరిగే ప్రత్యుత్పత్తికి బిడ్డకై తల్లి తన అండం ద్వారా ఒక 'ఏక్స్' క్రోమసోలను ఇవ్వగలిగితే, తండ్రి తన వీర్య కణం ద్వారా ఒక 'ఎక్' క్రోమసోంను గాని, ఒక 'వై' క్రోమసోంను గాని ఇవ్వగలడు. తండ్రి వీర్యంలో లక్షలాది శుక్రకణాలు, సగం 'ఎక్స్' క్రోమసోంల తోను, సగం 'వై' క్రోమసోంలతోను, ఉన్నప్పటికినీ అండ ప్రవేశం చేయగలిగేది వాటిల్లో ఒక్కటే.

తండ్రి నుండి 'ఎక్స్' క్రోమసోం ఉన్న శుక్రకణం అండ ప్రవేశం చేయగలిగితే, అండంలోని 'ఎక్స్' క్రోమసోంతో కలిసి, అమ్మాయి పుడుతుంది. అలాగాక తండ్రి నుండి 'వై' క్రోమసోం ఉన్న శుక్ర కణం అండ ప్రవేశం చేయగలిగితే, అండంలో ఉండే 'ఎక్స్' క్రోమసోంతో కలిసి అబ్బాయి పుడతాడు. వీర్యంలో ఏక్స్, వై, క్రోమసోంలు గల పురుష భీజకణలు సమానంగా వుంటాయి.

అమ్మాయిలు ఎక్కువ పుడితే, అందుకు స్త్రీని తప్పుపట్టడం జరుగుతుంది. పదకొండు సంవత్సరాల వరకు భార్య అడబిడ్డలనే కనుచున్నయెడల ద్వితీయ వివాహం చేసుకొన వచ్చని మనుస్మృతి (9-81) చెబుతున్నది. మనుస్మృతి (9-137) ప్రకారం మానవుడు పుత్రుడు పుట్టగానే స్వర్గాది పుణ్యలోకాలు పొందుతాడు. పౌత్రుని జన్మము వలన ఆలోకములందు చిరకాలము ఉంటాడు. పుత్రునికి పౌత్రుడు పుట్టిన యెడల సూర్యలోకాన్ని పొందుతాడు.

పుత్ర సంతానమే తేలిగ్గా స్వర్గాన్నిస్తుంటే 'పాపచింతన'కు అర్ధమేమై ఉంటుంది?

### మానవ క్లోనింగ్

మానవ క్లోనింగ్ పై మత పరమైనవే గాక సామాజిక పరమైన అభ్యంతరాలున్నాయి.

అన్ని రకాల మనవ క్లోనింగ్‌ను నిషేధిస్తూ ఐక్యరాజ్య సమితి సాధారణ అసెంబ్లీ మార్చి9, 2005న ఒక తీర్మానాన్ని ఆమోదించింది. కాని కొన్ని దేశాలు మూలకణాల ఉత్పత్తి కోసం క్లోనింగ్‌పై పరిశోధనలు నిలువరించలేదు.

మానవ క్లోనింగ్‌లో అచ్చుగుద్దినట్లు ఒకే ఆకృతిలో మనిషి నుండి మనిషిని సృష్టించవచ్చును. బిడ్డ జ్ఞానం మాత్రం పెరిగే పరిసరాలపై ఆధారపడే ఉంటుంది. మరణించిన వారిని కూడా వారి శరీర కణాలని శీతలీ కరణతో నిలువ చేసి, వారిని తిరిగి ఆకణాలతో సృష్టించ వీలుంది.అందువలన మరణించిన ప్రాణిని బ్రతికించినట్లువుతుంది. లేదా, మరణమంటే పూర్తి మరణం కాదనుకోవలసి వస్తుంది. మరణించిన వారికోసం బెంగపడకుండా తిరిగి సృజించుకునే అవకాశం ఉండడంతో 'క్లోన్‌లతో' ప్రపంచం కిటకిటలాడవచ్చు.

'క్లోన్' పుట్టడానికి శరీరకణం, అండం అవసరమవుతున్నాయి. అలా ఒక స్త్రీ తన క్లోన్ కి పుట్టుకనిస్తే ఆ స్త్రీకి ఆమె తండ్రి నుండి సంక్రమించి ఉన్న సగం క్రోమసోంలు ఆబిడ్డ (క్లోన్)కు సంక్రమిస్తాయి. అటువంటి జన్యు నిర్మాణంతో ఆ బిడ్డ ఆమె కుమార్తెగా గుర్తించబడడం కంటే ఆమె సహోదరిగా గుర్తించబడడమే జరుగుతుంది. భర్త నుండీ ఎటువంటి కణం చేరకుండా పుట్టిన ఆ బిడ్డను ఆయన తన కుమార్తెగా స్వీకరించాలా. అనే సమస్య ఏర్పడుతుంది. అలానే విడాకులకు పూర్వం భర్త శరీర కణంనుండి క్లోన్ చేయబడిన భర్త రూపులోని మగబిడ్డ... ఆబిడ్డను కన్న తల్లి ఆదరణకు నోచుకొంటుందా అనేది ప్రశ్నే అవుతుంది. క్లోనింగ్ కై అండాన్ని దానం చేసిన తల్లి ఆ బిడ్డకు తల్లి కాలేదు.

మానవ క్లోనింగ్‌లో సామాజిక సమస్యలు ఇముడుకొని ఉన్నాయి. చికిత్సకై చేసే క్లోనింగ్ లో మూలకణ సేకరణ పిమ్మట పిండాల్ని ధ్వంసం చేయాల్సి వస్తూంది.

**డిజైనర్ బేబి 'జెమి' పుట్టుక**

బ్రిటన్ దంపతులైన మిచెల్, జేసన్‌ల మొదటి బిడ్డ 'చార్లే'. చార్లేకు గల 'డైమండ్-బ్లాక్ ష్యాన్ ఎనీమియా' అనబడే తీవ్ర రక్తహీనతకు మూలకణాల మార్పిడి చికిత్స అవసరమయ్యింది. చార్లే శరీర తత్వానికి పడేది ఎవరివద్దా లభించక చార్లేకు సరిపడే లక్షణాలతో మరోబిడ్డకు జన్మనీయడానికి వారిరువురూ సంకల్పించుకున్నారు.

బ్రిటన్ లో గల నిషేధానికి కారణంగా వారు అమెరికాలోని చికాగో 'రిప్రొడక్టివ్ జెనెటిక్ ఇన్‌స్టిట్యూట్' లో 2003 జూన్ 2వ వారంలో వారు డిజైనర్ బేబి 'జెమి' కి పుట్టుకనిచ్చారు.

టెస్ట్ ట్యూబ్ బేబి ప్రక్రియ మాదిరిగా ఉండే ఈప్రక్రియలో ముందుగానే బిడ్డ ఆడా, మగా అలానే బిడ్డ ఆకారం, బుద్ధి వికాసం బిడ్డ ఏయే జన్యువులతో జన్మించాలి అనే అంశాలు ఎంచుకునే వీలుంటుంది.

పందొమ్మిదవ శతాబ్దం బాధలేని ఆపరేషన్లకు నాంది పలికింది. క్లోర్‌ఫాం వినియోగం ఆరంభమయ్యింది. బాధని కర్మఫలమనో, దైవేచ్ఛగానో తెలిపిన మతానికి ఎదురు దెబ్బ తగిలింది.

బ్రిటన్ దేశీయుడైనా జేమ్స్ సింప్సన్ ఈ క్లోరోఫాంని 1847లో కనుగొన్నాడు.

అవయవదానాలు జరుగుతున్నాయి. కొందరు ఆలోచనా పరులు మతాన్ని ప్రక్కన పెట్టి, శరీరావయవాల దానం చేసి, ఇతరులకి చూపునివ్వడం, బ్రతుకు నివ్వడం చేస్తున్నారు. మరణించాక వారి మృత శరీరాల్ని మత పరమైన అంత్యక్రియలకు గాక వైద్య విద్యార్థుల విద్యార్జనకై

ఒప్పగించడానికి ముందుగానే వ్రాత పత్రాలు వ్రాస్తున్నారు.

కోలుకోని వ్యాధితో మరణశయ్యాపై ఉన్నవారు. కోమాస్థితిలో మరణానికి చేరవవుతున్నావారు బాధ లేకుండా చంపబడుట/ యూతనేజియ ను ఆహ్వానించన వారున్నారు. శరీరావయవ దానానికి కూడా వారు సిద్ధపడుతున్నారు. కాన ఇది ఇంకా చట్ట సమ్మతం కావలసి ఉంది.

గర్భస్రావాలు చట్ట బద్ధమయ్యాయి. కుటుంబ నియంత్రణ అమలులో ఉంది.

జన్యు శాస్త్రం జీవి పుట్టుక గుట్టు విప్పింది. డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతానికి ఊతమిచ్చింది. జీవసృష్టికి కారణం దైవమనడానికి ఇది మరో గొడ్డలి పెట్టు.

ఎవరు ఎవరి బిడ్డలో, ఎవరి పూర్వీకులు ఏయే ప్రాంతాల విస్తరించిన మానవ పుట్టుక ఆఫ్రికాలోనే అనడానికి బలం చేకూర్చనుంది. జన్యుపరీక్ష నేర పరిశోధనలకు తోడ్పడటం అందరికీ తెలిసిన విషయమే.

జన్యు పరిశోధన వలన నయంకాని జన్యు పరమైన వ్యాధుల చికిత్సకు మార్గమేర్పడింది.

పిండ మూలకణ జ్ఞానం శరీరవయవాల తయారీకి, క్లోనింగ్ చికిత్సకు దారి తీసింది. జన్యు పరంగా ఉత్తమ సంతానం కోరుకొనే వారికి ఇదొక వరం కానుంది.

శరీరకణం సంతానం కణాలైన వీర్యకణం మరియు అండం, సంయక్త బీజకణం, సంయుక్త బీజకోశం, బీజాంకురం, భ్రూణం (గర్భస్థ శిశువు), పుట్టిన బిడ్డ... అన్నీ జీవాలే ఆత్మని కల్పించిన మతం పుట్టిన నాడు ఈ శాస్త్రజ్ఞానం లేదు.

ఏ ఒక్క మతమూ ప్రాణి పుట్టుక గురించి సరైన వివరణ ఇవ్వలేక పోయింది. సరికదా, పైగా ఒక దానిని మించి మరొకటి కల్పనల్ని విరివిగా చేసింది.

దెయ్యం, సైతాను, ఆత్మ, కర్మ, పునర్జన్మ, స్వర్గం, నరకం, మోక్షం, దివ్యదృష్టి.. ఇవన్నీ మత కల్పనల్లో కొన్ని.

దెయ్యం, గాలి, చేతబడి, బాణామతి (మాస్ హిస్టీరియా) వైద్య సహాయ సౌకర్యాలు అందుబాటులో లేని వెనుకబడ్డ ప్రాంతాలలోనే హెచ్చుగా ఉందన్న సంగతి ఎరిగినదే. దీనికి అందర్నీ విజ్ఞాన వంతుల్ని చేయడం ఒకటే మార్గం.

ఈ లోకం గురించి కనీస విజ్ఞానం ఇవ్వలేని మతం పరలోకాల గురించి ఎంతో తెలిసినట్లు మాట్లాడుతుంది.

కుల మత వర్గ విభేదాలు మానవజాతి ఐక్యతకు ముప్పుగా మారాయి.

జన్యు శాస్త్రం తెచ్చి విప్లవంతో దైవం లేదా మత సాహిత్యం తెచ్చిన కర్మను. సారపు హెచ్చు తగ్గు కులాల జన్మలు, ఆత్మ త్రిలోక సంచారాలు, పరమాత్మలో లీనమవ్వడాలు తుడిచి పెట్టుకొని పోవాలి.

మనం ఒకనాటి జీవ పరిణామానికి చెందిన ఒకానొక దశలో ఆవిర్భవించి మన జాతికి జన్మనిస్తున్నాం.

జీవ పరిణామంలో జాతుల ఆవిర్భావం మొదలు కొని... జీవి పుట్టుక, పెరుగుదల, అంతం... అంతా ప్రకృతి సిద్ధమే బాహ్య కారణం లేదు.

ఏజాతి ప్రాణికైనా జన్మ జన్మల బంధానికి మూలం 'జన్యువే' కాని 'ఆత్మ' కాదు.

**ఐపోయింది.**

# డార్విన్ జీవపరిణామ సిద్ధాంతం

- మేడూరి సత్యనారాయణ

ఆధునిక విజ్ఞాన శాస్త్ర చరిత్రలో డార్విన్ (1809-1882) జీవపరిణామ సిద్ధాంతం ఒక విప్లవాత్మక ఘట్టం. మానవసృష్టికి వివిధ మతాలు ప్రవచించినట్లు దేవుడు కారణం కాదని, ప్రకృతి ఎన్నిక ద్వారా జరిగిన జీవపరిణామమే మానవావిర్భావానికి కారణమని డార్విన్ సాధికారికంగా నిరూపించి నూతన భావవిప్లవానికి పునాది ఏర్పరచాడు.

డార్విన్ కంటే ముందే జీన్ బాప్టిస్ట్ లామార్క్ (1809) జీవ జాతుల ఉత్పత్తిని వివరించడానికి 'ఉపయుక్త నిరుపయుక్త' (Use & Disuse) సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు ఒక జీవి తన జీవిత కాలంలో సంపాదించుకున్న లక్షణాలను తర్వాత తరానికి అందించడం వలన కాలక్రమంలో నూతన లక్షణాలతో నూతన జాతులు ఆవిర్భావిస్తాయని ఆయన సిద్ధాంతీకరించాడు. పరిసరాల ప్రభావాన్ని జీవ జాతుల ఉత్పత్తికి ఏకైక కారణం చేశాడు. వీజ్మన్ ఎలుకల తోకలను కత్తిరించి కొన్ని తరాల వరకు తోకలుంటూనే వున్నాయని ప్రయోగపూర్వకంగా లామార్క్ ప్రతిపాదించిన 'ఉపయుక్త, నిరుపయుక్త' సిద్ధాంతాన్ని తప్పు అని నిరూపించాడు.

పరిసరాలు కొన్ని జీవులను ఎన్నుకుంటున్నందు వల్ల నూతన జాతులుత్పన్నమౌతున్నాయని డార్విన్ ప్రతిపాదించాడు. ఎన్నిక జరగాలంటే పలు వైవిధ్య పూరిత జీవులుండాలి. జీవులలో వైవిధ్యాలు సహజమన్నాడు. జీవుల ఏ లక్షణాలైతే వాటి మనుగడకు ఉపకరిస్తాయో ఆ లక్షణాలు గల జీవులను ప్రకృతి ఎన్నుకుంటుంది. వాటిలక్షణాలు తమ తర్వాత తరానికి వారసత్వంగా లభిస్తాయి. ఏ లక్షణాలైతే జీవి మనుగడకు ఉపకరించలేవో ఆ లక్షణాలు గల జీవులు తాము సంతానోత్పత్తిదశ వరకు జీవించలేకపోవడం వల్ల తమ లక్షణాలు గల జీవులను వారసత్వంగా అందించలేక అంతరిస్తాయి. ఈ విధంగా జీవుల మనుగడకు ఉపకరించే లక్షణాలు గల జీవులే సుదీర్ఘకాలంలో ఎంపిక కావడం వల్ల నూతన లక్షణాలు గల నూతన జాతులు అవిర్భావిస్తాయన్నాడు. అయితే డార్విన్‌కు వైవిధ్యాల ఉత్పత్తికి కారణం తెలియదు. వైవిధ్యాలు సహజమన్నాడు. ప్రకృతి చాలా జీవులను తిరస్కరించి కొన్నింటిని మాత్రమే ఎంపిక చేస్తుంది. కాబట్టి, జీవులు తమ సంతానాన్ని అధిక సంఖ్యలో కంటాయన్నాడు. అధికోత్పత్తిలు సహజమన్నాడు. ప్రకృతి వరణం ద్వారా నూతన జాతులు జీవపరిణామ క్రమంలో ఆవిర్భవిస్తాయని(1859), మానవుడు కూడా ఈ విధంగా ఒక కోతిలాంటి జీవినుంచి ఆవిర్భవించాడని (1871) ప్రతిపాదించాడు. మతస్థులలో కలవరం బయలుదేరింది. బైబిలు మానవుడి సృష్టికి చెప్పిన కథనాలు అబద్ధాలుగా నిరూపితమైనాయి. చార్లెస్ డార్విన్ పై మతస్థులు దాడిని టి.హెచ్. హక్జలే తిప్పికొట్టాడు. డార్విన్ జీవపరిణామ సిద్ధాంతాన్ని శాస్త్రబద్ధంగా

సమర్థించి పటిష్ట పునాదులు ఏర్పరచాడు.

20వ శతాబ్దపు ప్రారంభ సమయంలో (1901) డివ్రీజ్ అనే శాస్త్రవేత్త జీవులలో వైవిధ్యాలకు కారణంగా ఉత్పరివర్తన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. సహజంగానే జీవులలో అకస్మాత్తుగా మార్పులు వచ్చి వైరుధ్యాలుగా స్థిరపడతాయని జన్యుశాస్త్రం ఆవిర్భవించి నిరూపించింది. డార్విన్ ప్రకృతి ఎన్నిక ద్వారా నూతన జీవుల ఉత్పత్తి సిద్ధాంతానికి జన్యుశాస్త్రం శాస్త్ర బలాన్ని అందించి డార్విన్‌కు తెలియని ఉత్పరివర్తనాలు వైవిధ్యాలకు కారణమన్నది. ఆనాటి నుండి ఈనాటి వరకు డార్విన్ పరిణామ సిద్ధాంతం అనేక సాక్ష్యాధారాలతో రుజువు అవుతున్నది. ప్రకృతిలో సహజంగా జరిగే పరిణామాలను మానవుడు సంకల్పించి తన ప్రయోజనంకోసం ఉపయోగించుకొంటున్నాడు. దాని కొరకు సంకరణ ప్రయోగాల ద్వారా నూతన వంగడాలను తను కోరిన లక్షణాలతో తయారు చేసుకుంటున్నాడు. హైబ్రిడ్ వంగడాలను మనం ఉత్పత్తి చేసి అధికోత్పత్తిని సాధిస్తున్నామంటే నూతన జాతులను ఉత్పత్తి చేస్తున్నామనే అర్థం.

కారల్ మార్క్స్ నాటికి జన్యుశాస్త్రావిర్భావం జరగనందువల్ల, వైవిధ్యాలు ఎలా ఉత్పన్నమౌతాయో ఆయనకు తెలియదు. పరిసరాల ప్రభావం వల్ల, శ్రమవల్ల మానవుడు ఆవిర్భావించాడన్నాడు. శ్రామికుల పక్షపాతి కాబట్టి శ్రమే కోతిలాంటి జీవిని మానవుడిగా తయారుచేసిందన్నాడు. దాని కొనసాగింపుగా స్టాలిన్ పరిసరాల ప్రభావంవల్ల పరిణామం సాధ్యం అనుకొని, అందుకు భిన్నంగా జన్యుశాస్త్రం జీవ కణాలలో అంతర్గతంగా జన్యువులలో వచ్చే ఉత్పరివర్తనాలవల్ల పరిణామం జరుగుతుందని వివరిస్తున్నందువల్ల జన్యు శాస్త్రవేత్తలపై నిర్బంధాన్ని ప్రయోగించాడు. లైసెంకోలాంటి కుహనా శాస్త్రవేత్తలకు మద్దతు ప్రకటించాడు.

విజ్ఞాన శాస్త్రం పెరిగేకొలది దానిని మన సిద్ధాంతాలను మార్చుకోవడానికి ఉపయోగించుకోవాలేగాని, మన సిద్ధాంతాలకోసం విజ్ఞానశాస్త్రాన్ని అదుపుచేయడం సాధ్యంకాదని చరిత్ర రుజువు చేస్తోంది. మానవుడి హేతుత్వాన్ని, స్వేచ్ఛా సంకల్పాన్ని మార్క్సిజం గుర్తించకుండా మనిషిని పరిసరాలకు బానిసను చేసింది.

మానవ ఆవిర్భావానికి ఏ దేవుడు కారణంకాదని, మానవుడు 5 లక్షల సంవత్సరాల క్రితం మాత్రమే కోతిలాంటి జీవినుండి ఆవిర్భవించాడని, మెదడు పరిణతి వల్ల మానవుడు ఆలోచించగలుతున్నాడని, హేతుత్వం మానవుడిలో ఉన్నత స్థాయిలో ఉందని, దాని చర్యవల్ల మనస్సు ఏర్పడుతున్నదని, ఆత్మలేదని, మానవ పరిణామం ఇంతటితో ఆగకుండా నిత్యపరిణామంలో ఉంటుందని, మానవ పరిణామ భవిష్యత్తును ఈనాడు మనం ఊహించి చెప్పలేమని, భవిష్యత్తులో జరిగే సంఘటనల ప్రభావం ఉంటుందని అవగాహన చేసుకోవడమే జీవ పరిణామ సిద్ధాంతం మనకు అందించే తాత్విక ఫలితాలు.

---

A free Society can be created only by free men.... a good Society can be created only by good men. - **M.N.Roy**



76

# గ్రహణాలు ఎలా వస్తాయి?

-రావిపూడి వెంకటాద్రి

విజ్ఞానం అనేది ఏ ఒక్కదేశం సొత్తూకాదు, ఏ ఒక్కజాతిసొత్తూ, మతం సొత్తూ, వర్గంసొత్తూకాదు. విజ్ఞానానికి దేశకాలావధులులేవు. అది యావత్తూ మానవజాతికి చెందింది.

ప్రాచీన భారతదేశంలో విజ్ఞానంలేదని యెవ్వరూ అనరు. ఇండియాలో వలెనే అనేక ఇతరదేశాల్లో కూడా విజ్ఞానంవుందని అంటారు.

మతానికీ, విజ్ఞానానికి అట్టే సంబంధంలేదు. అందువల్ల ప్రాచీన భారతంలో విజ్ఞానంవుంటే. ఆ ఘనత హిందూమతానికి చెందదు. విజ్ఞానం మతంగానో. మతంలో భాగంగానో సృష్టించబడలేదు.

అతీతశక్తులు లేకపోతే జ్యోతిషం యెలా నిజమవుతున్నది? అని కొందరు ప్రశ్నిస్తారు జ్యోతిషం అబద్ధమైతే, పంచాంగం ప్రకారం గ్రహణాలు పలానా రోజునే వస్తాయని ముందుగానే ఎలా చెప్పగలుగుతారు? అని ఆ ప్రశ్నను సాగదీస్తారు.

ప్రాచీన ఖగోళవిజ్ఞానం అన్ని దేశాల్లోనూ అచ్చగా అనుభవజ్ఞానం మీద అధారపడి పెరిగింది. అనాటివారు వందల, వేల సంవత్సరాలు శ్రమపడి, కొన్ని పట్టికలు తయారు చేసుకొని, వాటిని బట్టి గ్రహనక్షత్రాదుల గమనాలను కొంతవరకు గుర్తు పట్టగలిగారు. అందులో ఒక మెట్టు గ్రహణాల చక్రాన్ని (cycle of eclipses ) గుర్తించడం. లెక్కలమీద, గణాంక వివరాల (statiatics ) మీద ఆధారపడి పూర్వం వివిధ దేశాల్లోని విజ్ఞానులు సూర్య చంద్ర గ్రహణాలు చక్రికాబంధంతో జరుగుతుంటాయని లెక్కకట్టారు.

జరగబోయే గ్రహణాన్ని ముందుగానే చెప్పడం చైనావారికి నాలుగు వేల సంవత్సరాల క్రిందటే తెలుగు చైనీయుల ప్రాచీన గ్రంథం షూకింగ్‌లో క్రీ.పూ. 2137వ సంవత్సరం అక్టోబరు 22న తేదీన జరిగిన సూర్యగ్రహణం రికార్డుచేయబడింది. అందువల్ల మన పంచాంగాలు గ్రహణాలను ముందుగా చెప్పలుగుతున్నాయంటే అందులో హిందూమతం గొప్పతనం యేమీలేదు. జ్యోతిషానికి, దానికి సంబంధంకూడా లేదు.

గతశతాబ్దంలో అపోల్డర్ అనే అస్ట్రియన్ ఖగోళ శాస్త్రజ్ఞుడు ఒక గ్రంథం ప్రకటించాడు. అందులో ఆయన క్రీ.పూ. 1207 నుండి కీ.త. 2161 వరకు- అనగా 3363 సంవత్సరాలలో జరిగే 5200 చంద్రగ్రహణాలు 8000 సూర్యగ్రహణాలు లెక్కించి పొదువరిచాడు.

సూర్యుడి చుట్టూ భూమీ. భూమిచుట్టూ చంద్రుడూ తిరిగేక్రమంలో అవి మూడూ $5^{0}$ తేడాగా దాదాపు ఒకే రేఖలోవుంటాయి. ఆ రేఖలో భూసూర్యలకు మధ్య చంద్రుడువస్తే అమావాస్య అవుతుంది. (అంటే సూర్య కాంతిపడే చంద్రతలం మనకు కన్పించదు.) సూర్యచంద్రులకు మధ్య భూమి వుంటే పూర్ణిమ అవుతుంది (అంటే సూర్యకాంతిపడే సంపూర్ణ చంద్రతలం మనకు కన్పిస్తున్నది.) చంద్రుడు భూమి చుట్టూ ఒకసారి తిరిగిరావడానికి పట్టే 29.531 రోజుల్లో ఒక అమావాస్య. ఒక పూర్ణిమవస్తాయి. అంటే భూ సూర్యచంద్రులు కచ్చితమైన





సరళరేఖలోకి రాకుండా అలాంటి సరళరేఖకు 5' తేడాలో వున్నప్పుడు మాత్రమే పూర్ణిమ. అమావాస్యలు వస్తాయి (మరి కొంత కచ్చితంగా చెప్పాలంటే చంద్రుడి ప్రదిక్షణకాలం 29.5305879 రోజులు)

పైన మనం చూచినట్లు భూసూర్య చంద్రులు 5' తేడా లేకుండా, కచ్చితంగా ఒకే సరళరేఖలోకి వస్తే. ప్రతి పూర్ణిమ నాడూ చంద్రగ్రహణం, ప్రతి అమావాస్యవాడూ సూర్యగ్రహణం రావాలి. 5' తేడా వుండడం వలన అలా జరగడంలేదు. కాని, వాటి గమనాలలో కొన్ని అమావాస్యలకు, కొన్ని పూర్ణిమలకు మాత్రమే అవి ఒకే సరళ రేఖలోకి రావడం జరుగుతుంది. అప్పుడు భూ సూర్యుల మధ్యవున్న చంద్రుడి నీడ భూమి మీద పారితే (అంటే సూర్యకాంతికి చంద్రుడు అడ్డంవస్తే) చంద్ర గ్రహణమవుతుంది. అందువల్లనే సూర్యగ్రహణం అమావాస్య నాడే వస్తుంది. చంద్రగ్రహణం పౌర్ణమినాడే వస్తుంది.

భూమితో పోల్చుకొంటే సూర్యుడు చాల పెద్దగోళం. (సూర్యవ్యాసం 86500మై భూ.వ్యాసం 7927) అది భూమికి చాల దూరంలో వుంది (9,29,50000మై) చంద్రుడు చాల చిన్న గోళం. (చం. వ్యాసం 210మై) ఇది భూమికి చాల దగ్గరగా వుంది. (2,39000మై) అందువల్ల సూర్య చంద్రులు రెండూ భూమిమీద ఉన్నవారికి దాదాపు సమాన సైజుల్లో కన్పిస్తాయి (చంద్రుడికి సుమారు 400 రెట్లు వ్యాసమున్న సూర్యుడు చంద్రుడి దూరానికి సుమారు 400 రెట్ల దూరంలో వుంది)

భూమినీడ చంద్రుణ్ణి పూర్తిగా కప్పివేయ గల్గుతుంది కాబట్టి చంద్రుణ్ణి చూడగల భూలోక వాసులందరికీ చంద్రగ్రహణం కన్పిస్తుంది. చంద్రుడి బింబం సూర్యుణ్ణి పూర్తిగా కప్పలేదు. కాబట్టి భూమిమీద పరిమిత ప్రాంతంలో (177 మైళ్ళు లేక 269 కి.మీ వెడల్పున) మాత్రమే సూర్యగ్రహణం కన్పిసుంది. పూర్ణసూర్య గ్రహణం మహా కనిపిస్తే 250 10000 కి.మీ ప్రదేశంలో కన్పిస్తుంది. ఆ గ్రహణకాలం కూడా, మహా అయితే 7½ నిమిషాలు. పూర్ణ చంద్రగ్రహణం రెండు గంటలుంటుంది. 17 గంటలదాక కొనకసాగే అవకాశం వుంది. ఐతే జరిగినచోటనే పూర్ణసూర్య గ్రహణం జరగాలంటే 350 సంవత్సరాల వ్యవధి కావాలి

మొత్తంమీద సూర్యగ్రహణాల సంఖ్య కంటె చంద్ర గ్రహణాల సంఖ్య తక్కువ. సూర్య చంద్ర గ్రహణాల నిష్పత్తి 3:2. అయితే, ఒకేచోట తీసుకొంటే అక్కడ సూర్య గ్రహణాల సంఖ్య కంటె చంద్ర గ్రహణాల సంఖ్య తక్కువ వుంటుంది.

గ్రహణాలన్నిటినీ వరసవారీగా పేరిస్తే, ప్రతి గ్రహణమూ 6585⅓ రోజులకు తిరిగి వస్తుందని తేలుతుంది. ఈ కాలాన్నే పూర్వం చాల్డియనులు, ఈజిప్షియనులు "సారోస్" అనేవాళ్ళు అంటే యూ రోజున చంద్ర గ్రహణమో. సూర్య గ్రహణమో సంభవిస్తే. తిరిగి అలాంటిదే 18 సం॥ 10 లేక 11 రో. 8 గంటల కాలానికి జరుగుతుంది (మధ్య లీప్స సంవత్సరాలను బట్టి తేదీ ఒకరోజు తేడావస్తుంది. కాలం లెక్కిసే కచ్చితంగా 6585⅓ రోజులు). కలం కాగితం వుంటే వేల సంవత్సరాల వరకు ఇలా గ్రహణాలను లెక్కించవచ్చు అంటే 20 సంవత్సరాల క్యాలెండర్లు దగ్గరవుంటే, ఆ పని 4వ తరగతి విద్యార్థి చేయవచ్చు.

ఇలాంటివి 70 సూర్య గ్రహణాలున్నాయి అవి మొత్తం 1260 సంవత్సరాలలో (18-70) పూర్తయి చక్రికా బంధంలో తిరిగి ప్రారంభమవుతాయి.

సారోస్ వ్యవధిలో, రోజులో మూడవ వంతు తేడా వున్నందువల్ల 6585 రోజుల్లో తర్వాత జరగబోయే గ్రహణప్రదేశం ఆకాశంలో క్రమంగా పడమరకు జరుగుతుంది. అంటే గ్రహణకాలానికి 18 సం॥ 10రో. 8 గం॥ లేక 11 రో. 8 గంటలు కలుపుకొంటూ వుంటే గ్రహణకాలాన్ని ముందుగా చెప్పవచ్చుననేది గ్రహిస్తే, అది పంచాగకర్తల గణితజ్ఞానం ఫలితమేననీ, అందులో 'దివ్యజ్ఞత' లేదనీ తేలుతుంది.

అయితే విజ్ఞానాన్ని కూడా రహస్యంగా దాచుకొని, జ్ఞానాన్ని బెదరగొట్టి దోపిడి సాధనంగా దాన్ని వుపయోగిస్తూ రావడంవల్ల అవి మనకు 'గొప్ప' విషయాలుగా దర్శనమిస్తున్నాయి. రైలు ఎన్ని గంటలకు రాగలదో చెప్పడం వల్ల రైలు మన జీవితం మీద జ్యోతిషం చెప్పే ఫలితాలవంటి ప్రభావాలను కలిగిస్తుందనడం అవివేకం. ఇదిగో ఇంత సేపటికి సూర్యోదయం జరుగబోతోందని చెప్పడానికీ ఆ సూర్యుడు మన జీవితాలను తలక్రిందులు చేసేయబోతోందని చెప్పడానికి తేడాన మనం గమనించాలి.

ఈ శతాబ్దంలో (1900-2000) జరిగే పూర్ణ సూర్యగ్రహణాలు మొత్తం 60 అందుల 3 భారతదేశంలో కన్పిస్తాయి. 1980 ఫిబ్రవరి 16 సాయంత్రం 3-45 ప్రాంతంలో సంభవించి సూర్యగ్రహణాన్ని గురించి యీ దేశంలో పత్రికలు యెంత భీతికల్పించినవో మనకు తెలుసు. ఆ సైకిల్‌లోని గ్రహణం గతంలో 3-1-1908న పసిఫిక్ ప్రాంతంలో, 14-1-1926న సుమత్రా-ఫిలిప్పీనుల ప్రాంతంలో 25-1-1944న దక్షిణ అమెరికాలో, 5-2-1962న పసిఫిక్ ప్రాంతంలో జరిగింది. తిరిగి 26-2-1998న అమెరికా ప్రాంతంలో సంభవిస్తుంది. ఇలా 18 సం॥ 10 లేక 11రో. 8గంటలకొకసారి గ్రహణాలు చక్రికాబంధంలో జరుగుతాయని మొదట కనుక్కొన్నవారు ప్రతిభావంతులే. కాని, ఇలాంటివాటిని ఆధారంచేసుకొని భవిష్యత్తు శాసించే జ్యోతిషం సరైనదని రుజువుచేయబూనడం కేవలం వంచన.

---

**During the last thousand years, when India lived a life of shame, humaliation and stagnation, other parts of the world experienced not less than three revolutions, making three successive stages of human progress. India also must make that experience, if she is to come abreast with the advanced members of the human family. Should that take a thousand years, others would, during that time, march much farther ahead, and the process of human progress accelrates in proportion to its advance. So in order to catch up with the time lost, India must live in a few years the life lived by others over a period of thousand years.** **- Scientific Politics. M.N.Roy.**





# పాతికేళ్ళ హేతువాది

–డాక్టర్ బీరం సుందరరావు

హేతువాది పత్రికకు
పాతికేళ్ళ పండుగంట
ఆటంకాలధిగమించి
జయగీతం పాడెనంట

చీరాల కేంద్రంగా
చినుకువోలెమొలకెత్తి
ప్రవాహమై సాగెనంట
ప్రగతిదారి చూపెనంట

ఛాందసభావాలకు
చరమగీతి పాడెనంట
పాతదనం పాతరేసి
ప్రశ్నించుట నేర్పెనంట.

వాస్తు జ్యోతిషంలో
వాస్తవాన్ని చెప్పెనంట
వేదాల గుట్టు విప్పి
యదార్ధం చాటెనంట.

సామాన్యజనంలోన
శాస్త్రీయ దృష్టిపెంచె
మూఢనమ్మకాలను తుంచి
ఆలోచన వెలిగించె

రావిపూడి వెంకటాద్రి
రాచబాట వేసినారు
రచనలెన్నొ చేసివారు
రజతవాణి వినిపించిరి

అక్షరాలు ఆరబోసి
ఆలోచన కలిగించెను
వ్యాసాలను ప్రచురించి
ఆచరణను రగిలించెను.

అభ్యుదయం కోరునట్టి
హ్యూమనిస్టు లంత కలసి
నాటి నుండి నేటివరకు
మంచి బాట చూపినారు

రావిపూడి, రామమూర్తి
ఇన్నయ్యా, వెనిగండ్ల
ఆవుల, అచ్యుతరాం
వీరన్న, భీమన్న
కొల్లా, ప్రఫుల్ల చంద్ర
సుబ్బరాజు, సుబ్బమ్మ
రచనలన్నో చేసినారు
రాచబాట వేసినారు.
కత్తి, చార్వాక, కుర్రా
ముప్పాళ్ళ, మేడూరి
కోటపాటి, పూర్ణచంద్ర
గోగినేని, మాకినేని
గణేశం, షేకుబాబు
రావి, నార్నె, హరిబాబు
హజరత్, చేగిరెడ్డి
ఆచార్యా సుజరే
హేమహేమిలంత కలసి
వ్యాసాలను రాసినారు
కొత్తదనం కోరివారు
వాస్తవాలు చాటినారు
రావిపూడి మాష్టారూ
ప్రతిసంచిక దిద్ది తీర్చె
అహర్నిశలు శ్రమియించి
మార్పులెన్నొ అందు కూర్చె!
'హేతువాది' ప్రతి సంచిక
విజ్ఞానపు విపంచికే
శాస్త్రీయత చాటినట్టి
ప్రగతి భావాలకు వేదిక!
పాతికేళ్ళ హేతువాది
మీది, మాది అందరిది
ఆగకుండ సాగినట్టి
అరుదైనా పత్రికయిది.
'హేతువాది' మాసపత్రిక
తెలుగునాట వెలుగునింపె
రావిపూడి మానస పుత్రిక
వెలుగు బాట మనకుచూపె

(పాతికేళ్ళుగా నిరాటంకంగా నడుస్తున్న
"హేతువాది" మాసపత్రికకు
రజతోత్సవ శుభాకాంక్షలతో)

వార్తలు

# జంటనగరాల హేతువాదసంఘం

హైదరాబాదు హేతువాద సంఘం అధ్వర్యంలో- 9,10 జూన్,2007, తేదీలలో ప్రెస్‌క్లబ్, బషీర్‌బాగ్‌లో హేతువాద అధ్యయన తరగతులు మహాసభలు విజయవంతంగా జరిగాయి.

9వతేదీ శనివారం ఉదయం ప్రారంభమైన హేతువాద అధ్యయన తరగతులకు **సి.ఎల్.ఎన్ గాంధీ** అధ్యక్షత వహించారు, ఆంధ్రజ్యోతి దినపత్రిక ప్రధాన సంపాదకులు, కె. రామచంద్ర **మూర్తి** ముఖ్య అతిధిగా వచ్చి తరగతులను ప్రారంభించారు. హైదరాబాద్ హేతువాద సంఘ ఉపాధ్యక్షులైన **గుమ్మా వీరన్న** రచించిన **'హేతువాదం- స్వరూపస్వభావాలు'** అనే పుస్తకాన్ని **కె.రామచంద్ర మూర్తి** ఆవిష్కరించారు. వారు ప్రసంగిస్తూ హైదరాబాదులో చేప ప్రసాదం పంపిణీ కార్యక్రమం వంటి మూఢ విశ్వసాలు తగ్గుముఖం పట్టడానికి హేతువాద సంఘం వంటి సంస్థల కృషి ప్రధాన కారణమన్నారు.

హైదరాబాద్ హేతువాద సంఘాధ్యక్షులు **సి.ఎల్.ఎన్. గాంధీ** మాట్లాడుతూ, సమాజంలో విద్యావంతులు సైతం మూఢ విశ్వాసాలను నమ్ముతూ ప్రచారం చేయడం శోచనీయమని హేతువాద భావాల వ్యాప్తి జరిగిననాడే సమాజం వాస్తవమైన ప్రగతిని సాధించగలదని అన్నారు.

భారత హేతువాద సంఘాధ్యక్షులైన **కుర్రా హనుమంతరావు** ప్రసంగిస్తూ హేతువాద లక్ష్యం మానవవాదమని, ప్రజల భావాల్లో మార్పు రానంతవరకు సమాజంలో ఆశించిన మార్పు రాదన్నారు, **మానవ సమస్యలు- మానవవాదం** అనే అంశంపై ప్రసగించారు. ఆం.ప్ర. రాష్ట్ర హేతువాద సంఘ అధ్యక్షులైన పెన్మెత్స సుబ్బరాజు **సైన్సు, మతం** అనే అంశంపై సుదీర్ఘంగా ప్రసగించారు. సైన్సుపై, శాస్త్రవేత్తలపై మతాలు జరిపిన దాడిని, మతాల చరిత్రను వివరించారు.

**విశ్వతత్వం** గురించి రాష్ట్ర సంఘ ప్రధాన కార్యదర్శిగా వున్న **మేడూరి సత్యనారాయణ** వివరించారు. **ప్రజాస్వామ్యం- పరిణామాలు** గురించి మానవవికాస వేదిక అధ్యక్షుడైన **బి.సాంబశివరావు** ప్రసంగించారు. జనవిజ్ఞాన వేదిక ప్రతినిధులైన **టి.ఎస్. రావు** మూఢ విశ్వాసాలను సైన్సు ప్రచారం ద్వారా యేవిధంగా అరికట్టవచ్చునో వివరించారు.

అధ్యయన తరగతులను ముగిస్తూ హేతువాద,మానవవాద ఉద్యమాల ద్వారా ప్రజలలో భావ విప్లవాన్ని సాధించిననాడే సమాజం పురోగమిస్తుందని **గుమ్మావీరన్న** పేర్కొన్నారు.

10వతేదీ ప్రారంభమైన హైదరాబాద్ హేతువాద సంఘ ద్వితీయ మహాసభకు **మేడూరి సత్యనారాయణ** అధ్యక్షత వహించారు.

**గుమ్మావీరన్న**, పెన్మెత్స సుబ్బరాజు, నార్నె వెంకట సుబ్బయ్య ప్రభృతులు ప్రసగించారు. హేతువాద సాహిత్యాన్ని ప్రజలలోకి తీసుకెళ్లడం ద్వారా ప్రజల భావాల్లో మార్పు వస్తుందని



82

అభిప్రాయపడ్డారు. గత పాతికేళ్లుగా వివిధ అంశాలపై వందకుపైగా గ్రంథాలను హేతువాద సంఘం సృష్టించిందని, "హేతువాది" పత్రిక నిరంతరాయంగా నిర్వహిస్తూ వచ్చే ఆగస్టులో 'హేతువాది' రజతోత్సవాలను జరుపుకుంటుంగని తెల్పారు.

మెదక్ జిల్లా హేతువాద సంఘ కన్వీనర్ శ్రీనివాసాచారి వందన సమర్పణ చేసారు. ఈక్రింది నూతన కార్యవర్గ ఎన్నికతో సభలు ముగిసాయి.

1 అధ్యక్షులు – సి.ఎల్.ఎన్. గాంధీ, 2. ఉపాధ్యక్షులు – గుమ్మా వీరన్న

3 ప్రధాన కార్యదర్శి– యం. చంద్రశేఖర్, 4 కోశాధికారి – బుద్ధ విశాల్

కార్యవర్గ సభ్యులు – యం. రాజేశ్వర రావు, డి.రాజశేఖర్, తుమ్మా భాస్కర్, శ్రీమతి దేవకీ జ్యోతి తదితరులున్నారు.

రిపోర్ట్ : **యం.చంద్రశేఖర్**

ప్రధాన కార్యదర్శి, జంటనగరాల హేతువాద సంఘం

---

# మేనేజింగ్ ఎడిటోరియల్

**'హేతువాది'** రజతోత్సవాలను జరుపుకుంటున్న సంతోష సమయాన 'హేతువాది'కి ఆర్థికపరిపుష్టిని అందించి స్వర్ణోత్సవాలవైపు పయనించేందుకు 'హేతువాది' పాఠకులు, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ బాధ్యులు, కార్యకర్తలు, అభిమానులు, సానుభూతిపరులు సహకరించ వలసిందిగా మనవి చేసుకుంటున్నాం. 'హేతువాది'కి విరివిగా జీవితచందాదారులను చేర్పించి, నూతన సంవత్సరచందాదారులను చేర్పించవలసిందిగా విజ్ఞప్తి చేసుకుంటున్నాం.

ప్రజలలో స్వతంత్ర ఆలోచనను ప్రేరేపించి హేతువాద వైఖరితో ఆలోచించి మానవవాదం మార్గంలో పయనించేందుకు మార్గాన్ని సగమం చేయడానికి హేతువాదులంతా హేతువాద సాహిత్య ప్రచారాన్ని క్రియాశీలకంగా చేపడతారని ఆశిస్తున్నాం. 'హేతువాది' సక్రమనిర్వహణకు 'హేతువాది' పాఠకుల చందాలను పునరుద్ధరించేందుకు ప్రతిగ్రామం, పట్టణంనుండి కార్యకర్తలు కృషి చేయవలసిందిగా కోరుకుంటున్నాం.

గత 25 సంవత్సరాలుగా 'హేతువాది'ని నిరాటంకంగా ప్రచురించేందుకు సహకరించిన పాఠకులు, దాతలు, ప్రకటనకర్తలు, సానుభూతిపరులందరికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం. భవిష్యత్తులో ఇతోధిక సహకారాన్ని అందిస్తారని, 'హేతువాది'ని స్వర్ణోత్సవాలవైపు పయనింప చేస్తారని ఆశిస్తున్నాం.

కృతజ్ఞతలతో...

**మేడూరి సత్యనారాయణ**

## 'హేతువాది' రజతోత్సవాల నిర్వాహణకు విరాళాల జమలు

| | | |
|---|---|---|
| డి. పరమానందం | గుంటూరు | 1,000/- |
| రావూరు అర్జునరావు | విజయవాడ | 1,000/- |
| హను, | ఏడూళ్ళ బయ్యారం, ఖమ్మం జిల్లా | 500/- |
| డా॥ డి. బుచ్చయ్య | పెద్దాపురం | 500/- |

'హేతువాది'కి నూతన చందాదారుల జమలు

| | | |
|---|---|---|
| ఎస్.ఎన్.భాషా, | ఒంగోలు | 100/- |
| పాలెపు కాంతిలిల్లీ పుష్పం, | నల్లబాడు | 100/- |
| యం. లెనిన్‌బాబు, | వేంపెంట | 100/- |
| గొపవరం రామసుబ్బారెడ్డి, | గోపవరం | 100/- |
| ఎన్. అంజయ్య, | విజయవాడ | 100/- |
| జి. లక్ష్మీపతి, | బి.కొత్తపేట | 100/- |
| యం. వెంకటేశ్వరరావు, | పొదిలి | 100/- |
| ఎన్. వెంకటేశ్వరదాసు, | మందమర్రి | 100/- |
| మూర్తిగారి జనార్ధన్, | భువనగిరి | 100/- |
| కె. కిష్టయ్య, | తూప్రాన్ | 100/- |
| డి.వి.ఆర్.కె.రావు, | చినఅమరం | 100/- |
| గంధం బంగారు, | కోదాడ | 100/- |
| ఎస్.ఎ.రవూఫ్, | గూడూరు | 100/- |
| ఆర్. ఖాదర్‌ఖాన్, | సికింద్రబాదు | 100/- |
| ఇ. అల్లాబక్ష్, | కదిరి | 100/- |
| యం.వి.సుబ్బారావు, | కందుకూరు | 100/- |
| ఎన్. కిషన్, | లక్సెట్టిపేట | 100/- |
| కె. పోచన్న, | లక్సెట్టిపేట | 100/- |
| డా॥ రావి శ్రీనివాసరావు, | మచిలీపట్నం | 100/- |
| కె. కుటుంబరావ, | మచిలీపట్నం | 100/- |
| సేవాశ్రమం, | పెద్దాపురం | 500/- |
| విద్వాన్, మాచిరాజు శివరామరాజు | | 100/- |
| తాటి చినసుబ్బారావు, | కోటపాడు | 100/- |
| డి.వి.ఆర్.కె. రావు, | | 100/- |
| జె.ఎల్.రెడ్డి, | ఢిల్లీ | 100/- |
| ఎ. రామమోహనరావు, | విజయావాడ | 100/- |
| చింతా రామారావు, | కవులూరు | 100/- |

| | | |
|---|---|---|
| లైబ్రరియన్, శాఖ గ్రంథాలయం, | నందిగామ | 100/- |
| వై. జగన్మోహనరావు, | విజయవాడ | 100/- |
| పి.పి. మణి, | బత్తలపల్లి. | 100/- |
| ఎ. ప్రభాకరరెడ్డి, | కొల్లిపర | 100/- |
| బి. బాపిరెడ్డి, | గుడివాడ | 200/- |
| డా॥ ఎన్. మన్‌రాజ్‌సింగ్, | హైదరాబాదు | 100/- |
| యం. సత్యం, | బన్నారం | 100/- |
| చాగంటి అమరారెడ్డి, | పల్లగిరి | 100/- |
| యం. వెంకట్రావు, | చిలుకూరు | 100/- |
| డి.వి.ఎన్. ఆచార్య. | హైదరాబాదు | 100/- |
| కె. కిష్టయ్య, | తూప్రాన్ | 100/- |
| పి. సుబ్బారెడ్డి, | హైదరాబాదు | 100/- |
| యం. భరత్‌కుమార్, | హైదరాబాద | 100/- |
| టి. సూర్యనారాయణ, | విజయవాడ | 100/- |
| బి. టీరప్ప, | హైదరాబాదు | 100/- |
| బి. నారాయణరెడ్డి, | గరిడేపల్లి | 100/- |
| బి.కె. బాస్కరన్, | కల్లుపల్లి | 100/- |
| చింతా సుబ్బారావు, | కవులూరు | 100/- |
| వి. శాయికృష్ణ, | ఖానాపూర్ | 100/- |
| హను, | ఏడూళ్ళబయ్యారం | 100/- |
| **జెట్టి సాంబశివరావు,** | **తెనాలి** | **500/-** |
| ఆకురాలు గోపాలకృష్ణ, | తెనాలి | 100/- |
| కె. ప్రభుదాసు, | ఒంగోలు | 100/- |
| డా॥ డి. బుచ్చియ్య, | పెద్దాపురం | 100/- |

## విజ్ఞప్తి

**'హేతువాది'** ఈ ఆగస్టు రజతోత్సవ సంచికతో **25 సంవత్సరాలు** పూర్తి చేసికొని **11-12 ఆగస్టు, 2007**తేదీలలో రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లులో రజతోత్సవాలను జరుపుకుంటున్నది. ఈ రజతోత్సవాల నిర్వహణకు, రజతోత్సవ సంచిక ప్రచురణకు, హేమా పబ్లికేషన్స్, చీరాల చేపట్టిన రావిపూడి రచనల సంపుటాల ప్రచురణకు విరాళాలను సేకరించి అందించి 'హేతువాది' రజతోత్సవాలను విజయవంతం చేయవలసిందిగా 'హేతువాది' పాఠకులు, అభిమానులు, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘు బాధ్యులు, కార్య కర్తలకు సవినయంగా మనవి చేసుకుంటున్నాం. ఈ రజతోత్సవాలలో పాల్గొని విజయవంతం చేయవలసినదిగా కోరుకుంటున్నాం.

– **మేడూరి సత్యనారాయణ,** మేనేజింగ్ ఎడిటర్, హేతువాది.

రజతోత్సవం జరుపుకుంటున్న "హేతువాది"
స్వర్ణోత్సవాలు జరుపుకోవాలని ఆశిస్తూ...




# రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్

పర్చూరు రోడ్, ఇంకొల్లు - 523 167.

ప్రకాశం జిల్లా. (ఏ.పి)

| | |
|---|---|
| అధ్యక్షులు | : వత్సవాయి నారాయణరాజు |
| ఉపాధ్యక్షులు | : షేక్ బాబు |
| ప్రధాన కార్యదర్శి | : కుర్రా హనుమంతరావు |
| సంయుక్త కార్యదర్శి | : దారా అబ్రహాం లింకన్ |
| కోశాధికారి | : కరి హరిబాబు |

87

"హేతువాది" రజతోత్సవం జరుపుకుంటున్న
సందర్భాన అభినందనలతో....



# డా॥ జాకీర్ హుస్సేన్

"అమ్మ" చిన్నపిల్లల హాస్పటల్, ఒంగోలు.

# శ్రీమతి కృష్ణప్రియ,

లెక్చరర్ - పాలీటెక్నిక్ కాలేజి, ఈతముక్కల.

ప్రకాశంజిల్లా

89

90

రజతోత్సవం జరుపుకుంటున్న "హేతువాది"
స్వర్ణోత్సవాలు జరుపుకోవాలని ఆశిస్తూ...



# గుత్తా వెంకటసుబ్బయ్య

మాజీ చైర్మన్, ప్రకాశం జిల్లా పరిషత్

భాగ్యనగర్, ఒంగోలు.

"హేతువాది" రజతోత్సవాల సందర్భంలో
ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి అభినందనలతో....



# చుండూరి రవిబాబు

**ఒంగోలు,** ప్రకాశంజిల్లా

"హేతువాది" రజతోత్సవం జరుపుకుంటున్న
సందర్భాన అభినందనలతో....



# నామినేని మోహనరావు

మాజీ చైర్మన్, సూపర్‌బజార్

**ఒంగోలు,** ప్రకాశంజిల్లా



94

96

10

"హేతువాది" రజతోత్సవాల సందర్భంలో
ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి అభినందనలతో....



# అంబటి సుధాకరరావు

అడ్వకేట్,

**ఒంగోలు,** ప్రకాశంజిల్లా

రజతోత్సవం జరుపుకుంటున్న "హేతువాది"
స్వర్ణోత్సవాలు జరుపుకోవాలని ఆశిస్తూ...




శుభాకాంక్షలతో....

# వత్సవాయి నారాయణరాజు

## V.N.R. ట్రాన్స్‌పోర్ట్, ఇంకొల్లు.






100

10

"హేతువాది" రజతోత్సవాల సందర్భంలో
ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి అభినందనలతో....



# డా॥ వై. భానుప్రసాద్
# భారత్ నర్సింగ్ హోమ్
## భద్రాచలం



104

"హేతువాది" రజతోత్సవాలను
రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లులో
జరుపుకుంటున్న సందర్భంలో...



శుభాకాంక్షలతో....

**గురిజాల సీతారామయ్య**
శ్రీమతి గురిజాల రాజేశ్వరి మెమోరియల్ ట్రస్టు,
తెనాలి

"హేతువాది" రజతోత్సవాల సందర్భంలో
ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి అభినందనలతో....



## గోరంట్ల రాఘవయ్య
కోటపాడు,
జె. పంగులూరు మండలం, ప్రకాశం జిల్లా.

రజతోత్సవం జరుపుకుంటున్న "హేతువాది"
స్వర్ణోత్సవాలు జరుపుకోవాలని ఆశిస్తూ...



**సి.ఎల్.ఎన్. గాంధీ**

జాయింట్ కమీషనర్, ఆర్.టి.ఎ.

**శ్రీమతి జి. రాధారాణి**

హైదరాబాదు.



102

"హేతువాది" రజతోత్సవాల సందర్భంలో
ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి అభినందనలతో....



# రావి దంత వైద్యశాల
# RAAVI DENTAL CLINIC

**మచిలీపట్నం,**

కృష్ణా జిల్లా.

రజతోత్సవం జరుపుకుంటున్న "హేతువాది"
స్వర్ణోత్సవాలు జరుపుకోవాలని ఆశిస్తూ...



శుభాకాంక్షలతో....

**సి.ఎస్.రావు**, బెంగుళూరు
**సి.ఎ.ప్రసాద్**, హైదరాబాదు
**సి. రవికుమార్**, యు.ఎస్.ఎ.

"హేతువాది" రజతోత్సవాల సందర్భంలో
ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి అభినందనలతో....



# కరణం రవీంద్రబాబు,

కాంట్రాక్టర్

బాపట్ల,

గుంటూరు జిల్లా.



110

రజతోత్సవం జరుపుకుంటున్న "హేతువాది"
స్వర్ణోత్సవాలు జరుపుకోవాలని ఆశిస్తూ...



# నార్నె వేణుగోపాలరావు

రాజ్యలక్ష్మి స్టోన్ క్రషర్స్,

**చీమకుర్తి,**

ప్రకాశం జిల్లా.

"హేతువాది" రజతోత్సవాల సందర్భంలో
ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి అభినందనలతో....



# యన్. చౌదరిబాబు

డైరక్టర్

గౌతమి కాలేజిస్

విజయవాడ - గూడవల్లి.



112

115

రజతోత్సవం జరుపుకుంటున్న "హేతువాది"
స్వర్ణోత్సవాలు జరుపుకోవాలని ఆశిస్తూ...



# డి. కోటేశ్వరరావు

కార్పోరేషన్ బ్యాంక్,
కందుకూరు.

"హేతువాది" రజతోత్సవాల సందర్భంలో
ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి అభినందనలతో....



# నర్రా కోటయ్య
## హైదరాబాదు



112

118

"హేతువాది"
రజతోత్సవ మహాసభలు
జరుపుకొనే దశకు ఎదిగినందుకు ఆనందిస్తూ...



# డా॥ విజయరాఘవరావు

60 అడుగులరోడ్,
**ఒంగోలు.**



# RATIONALIST ASSOCIATION OF INDIA

**RAI is organised to carry out and fulfill the following Aims and Objects.**

a) To Promote the spread of Rationalism and Humanism in all essentials of life.
b) To uphold human values derived from Rationalist and Humanist approach to life.
c) To adopt Rationalism as a methodology which applies reason to modern scientific and other disciplines of knowledge to arrive at the life-stance of Humanism.
d) To uphold Humanism as a life-stance that treats man as responsible for all his acts and holds that man is the maker of his own destiny.
e) To convert people to Rationalism and Humanism by persuasion and conviction and not by force or, undemocratic authoritarian means.
f) To enlighten humankind to excerise their freedom in all walks of life, transcending race, nation, caste, class and sex or any other denomination.
g) To aim at Humanocracy not as a governmental term, but as a social term and idea which strives for overall enlightenment in the people as human beings.
h) To encourage scientific out-look, to spread the philosophical consequences of modern science, and to promote the spirit of New Renaissance.
i) To maintain Securlarist, Nontheist, Physical Realist and non-sectarain stand and reject religious, obseurantist, fundamentalist, communalist and supernatural points of view.
K) To keep alive the already existing full membership of this Association in the international Humanist and Ethical Union and also its founder membership in the Indian Humanist Coordination Committee.
l) To help formation of a network of Rationalist Associations all over India, i.e., States, Union Territories, Districts, Cities, Towns and Villages etc.,
m) To publish periodicals, books, booklets and other literature for realisation of the Aims and Objects of the Association.
n) To organise meetings, symposia, seminars, study camps, training classes, lectures, conferences, conventions etc., for the promotion of the Aims and Objects of the Association.
o) To acquire, own, hold and dispose off properties
p) To accept, bequests and donations from India and Abroad for the benefit of the Association.
q) To carry out any other objectives which are not inconsistent with the Aims and Objects of the Association.

**Types of Membership**

**Patron Member Rs. 5000/-** **Life Member Rs. 2,500/-**
**Active Member Rs. 25/- p.a.** **Ordinary Member Rs. 10/- p.a.**

President :
**R. VENKATADRI**
Editor : Hetuvadi
Chirala - 523 157.
Ph : (08594) 233403

Gen. Secretary :
**A. BAPA RAO**
Viveka Vidyalayam
Chirala - 523 157.
Ph : (08594) - 233815



12

**Contribute Donations to promote rationalism and humanism**

# Hema Foundation : Chirala

**HETUVADA MANAVAVADA FOUNDATION :** Regd. No. 304/1997

A/C No. 1159 of Corporation Bank, Chirala - 523 155. (A.P.)

Hema Foundation is organised to carry out and fulfill the following Aims and Objects.

a) To Promote Rationlism and Humanism in all essentials of life.

b) To fund such publications, periodicals, organisations, centres, institutions and conventions as would serve the cause of Rationalism and Humanism and devote their attention to develop free inquiry and guard human values.

c) To finance lectures, seminars, conferences and study camps for the promotion of Rationalism and Humansim and to give awards, prizes and stipends to persons who work for spreading Rationalist and Humanist ideas.

d) To enlighten humankind to exercise their freedom in all walks of life, transcending the barriers which divide and discriminate humankind in the name of religion, race, nation, class, caste and sex or any other denomination.

e) To aim at Humanocracy not as a governmental term but as a social term which strives for overall enlightenment in the people as human beings.

f) To encourage scientific outlook and propagate the philosophical consequences of ever growing knowledge both of which promote the spirit of New Renaissance.

g) To maintain Rationalist, Humanist, Secularist, Atheist, Physical Realist (Materialist) and Non-Sectarian stand and reject religious, obscurantist, fundamentalist and communalist points of view.

h) To facilitate constructions for Rationalist and Humanist offices and centres.

i) To acquire such properties and funds as would further the cause of Rationalism and Humanism.

K) To receive such donations from India and Abroad which would permit the Hema Foundation to extend the reach of its objectives.

l) To acquire and dispose off properties for the benefit of the Foundation.

m) To carry out any other objectives which are not inconsistent with the aims and objects of the Foundation.

<u>Types of Membership</u>

Donar Member Rs. 25,000/-

Patron Member Rs. 10,000/-

Ordinary Member Rs. 5,000/-

**R. VENKATADRI**
President :
Editor : Hetuvadi
Chirala - 523 157.
Ph : (08594) 33403

**K. HARI BABU**
General Secretary
Inkollu - 523 167.
Ph : (08594) - 244410



127

"హేతువాది" రజతోత్సవాల సందర్భంలో
ఎడిటర్ రావిపూడి వెంకటాద్రి గారికి అభినందనలతో....



# ఎస్.యం. సుభాని

సీనియర్ అసిస్టెంట్,

డి.ఇ.ఓ. ఆఫీసు,

**ఒంగోలు.**

124

హేతువాది రజతోత్సవ సంచికకు శుభాకాంక్షలు తెలియజేస్తున్న

చదవండి! **ఆరోగ్యమే మహాభాగ్యం** చదివించండి!

తెలుగు పత్రిక రంగంలో విన్నూత ప్రయోగంగా....
పూర్తి ఆరోగ్య సంక్షేమ పత్రికగా అందరి ప్రశంసలందుకుంటోన్న....

# మన ఆరోగ్యం

కుటుంబ ఆరోగ్య సంక్షేమ మాస పత్రిక

[illegible] 10/- [illegible]

**చందాదారులుగా చేరండి - చేర్పించండి!**

'మన ఆరోగ్యం' పత్రిక వెల రూ. 10/-. పన్నెండు సంచికలకు రూ. 120/- అవుతుంది. కానీ చందాదారులకు రూ. 100/- ప్రతినెల పత్రికను పోస్ట్‌ఖర్చులు భరించి పంపే సౌకర్యాన్ని కల్పించాము. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటూ మీ వంతు సహాయ, సహకారాలు 'మన ఆరోగ్యం' పత్రికకు అందించండి.

మీరు సంవత్సర చందాదారులుగా చేరుతూ రూ. 100/-లు యమ్.ఓ.లేదా డ్రాఫ్ట్ గానీ 'శ్రీషణ్ముఖేశ్వరి ప్రచురణలు' పేరిట పత్రిక చిరునామాక పంపించండి. బంధుమిత్రులకు మీ ప్రేమ పూర్వక కానుకగా 'మన ఆరోగ్యం' పత్రిక సంవత్సర చందా మీరే కట్టి అభిమానం పొందండి, వారిని ప్రోత్సహించండి.

మన ఆరోగ్యం పత్రిక యాజమాన్యం, సంపాదక వర్గం ఇది సామాజికబాధ్యతగా భావిస్తోంది. ఇందులో ఆరోగ్య విషయాలను అందించే వైద్యనిపుణుల కూడావారి సామాజిక బాధ్యతగానే భావిస్తున్నారు. పాఠకులు కూడా ఈఅంశాన్ని తవ వంతు సామాజిక బాధ్యతగానే భావించి మాకు సహకరించగలరని మనవి చేసుకుంటున్నాం.

**చిన మస్తాన్,**
డోర్. నెం. 15/116, మేదర్ బజార్,
చిలకలూరిపేట, గుంటూరు జిల్లా
చందాదారులను చేర్పించుటకు
మా ఏజెంట్‌గా నియమించడమైనది.

ఇట్లు మీ
Ln. **వి.ఎల్. వరప్రారెడ్డి**
(ఎడిటర్ పబ్లిషర్)

సంప్రదించవలసిన చిరునామా :
**శ్రీ షణ్ముఖేశ్వరి ప్రచురణలు**
డోర్.నెం. 28-3-51, సంజీవయ్య కాలనీ,
అరండల్‌పేట, విజయవాడ -520002

**Ph. (O) 0866 244320 (R) 2436936 Cell 9440172936**

# 'హేతువాది' రజతోత్సవాలు

| వేదిక : హ్యూమనిస్ట్ భవన్ రాడికల్ హ్యూమనిస్ట్ సెంటర్, ఇంకొల్లు - 523 167. | తేదీలు : 11, 12 తేదీలు ఆగస్టు, 2007 |
|---|---|

**ది.11-8-2007 శనివారం ఉదయం గం.10-00ల నుండి**

## 'హేతువాది' రజతోత్సవాలు ప్రారంభం

సభాధ్యక్షులు : **చుంచు శేషయ్య,** మాజీ అధ్యక్షులు, ఏ.పి.ఆర్.ఏ.

ప్రారంభోపన్యాసం : **కె. దేవానంద్,** IAS.,
కలెక్టర్, ప్రకాశంజిల్లా.

**రజతోత్సవ సంచిక ఆవిష్కరణ**

ఆవిష్కర్త : **కోటపాటి మురహరిరావు,** ట్రెజరర్, ఆర్.ఏ.ఐ.

ఉపన్యాసకులు : **కుర్రా హనుమంతరావు,** అధ్యక్షులు, ఆర్.ఏ.ఐ.
**పెన్మెత్స సుబ్బరాజు,** అధ్యక్షులు, ఏ.పి.ఆర్.ఏ.

మధ్యాహ్నం గం. 12-00 లకు

విషయం : **హేతువాద ఉద్యమ చరిత్ర**

ఉపన్యాసకులు : **మేడూరి సత్యనారాయణ,** ప్రధానకార్యదర్శి, ఏ.పి.ఆర్.ఏ.

సంపాదక ప్రస్తావన : **రావిపూడి వెంకటాద్రి,** ఎడిటర్, హేతువాది

భోజన విరామం

మధ్యాహ్నం గం. 2-00 ల నుండి

సభాధ్యక్షులు : **కుర్రా హనుమంతరావు**

విషయం : **భౌతిక వాస్తవికవాదం**

ఉపన్యాసకులు : **ఆలూరి ప్రఫుల్లచంద్ర,** హేతువాద మానవవాద రచయిత, తెనాలి.
**కరి హరిబాబు,** ప్రధానక్యాదర్శి, హేమా ఫౌండేషన్
**గుమ్మా వీరన్న,** జంటనగరాల హేతువాద సంఘం

సాయంత్రం గం. 4-00 ల నుండి

విషయం : **సైన్సు-తత్వం**

ఉపన్యాసకులు : **మేడూరి సత్యనారాయణ**
**నరాల చక్రధరరెడ్డి,** లెక్చరర్, జి.జె.కాలేజి, కర్నూలు
**డి. రాంబాబు,** సైంటిస్ట్, హైదరాబాదు



129

సాయంత్రం గం. 6-00 ల నుండి

**రావిపూడి వెంకటాద్రి గురించి డాక్యుమెంటరీ ప్రసారం**

సి.డి. ఆవిష్కరణ : **సి.ఎల్.ఎన్.గాంధీ**, జాయింట్ కమీషనర్, ఆర్.టి.ఏ.

ప్రదర్శన : **సురేష్**, తెనాలి

రాత్రి భోజనానంతరం ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ కార్యవర్గ సమావేశం

**ది.12-8-2007 ఆదివారం ఉదయం గం. 9-00ల నుండి**

సభాధ్యక్షులు : **కరి హరిబాబు**

**రావిపూడి రచనల సంపుటం "హ్యూమనిజం" ఆవిష్కరణ**

**ఆవిష్కర్త :**

**జి.ఆర్.ఆర్.బాబు**, అంతర్జాతీయ రాయబారి, ఐ.హెచ్.ఇ.యు.

**ముఖ్య అతిథి :**

**ఎన్.చౌదరిబాబు**, డైరెక్టర్, గౌతమికాలేజెస్, విజయవాడ, గూడవల్లి

**రావిపూడి రచనల సంపుటం "మార్క్సిజం" ఆవిష్కరణ**

**ఆవిష్కర్త :**

**వై. వెంకటరెడ్డి**, రిటైర్డ్ ప్రిన్సిపాల్, గవర్నమెంట్ కాలేజెస్

**ముఖ్య అతిథి :**

**సి.ఎస్.రావు**, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్, బెంగుళూరు.

విషయం : **హేతువాదం - హ్యూమనిజం (మానవవాదం)**

ఉపన్యాసకులు : **కుర్రా హనుమంతరావు**
**పెన్మెత్స సుబ్బరాజు**
**సి.ఎల్.ఎన్.గాంధీ**

విషయం : **నియంతృత్వం - స్వేచ్ఛావాదం**

ఉపన్యాసకులు : **ఆలూరు ప్రఫుల్లచంద్ర**
**అంచా బాపారావు**, ప్రధాన కార్యదర్శి, ఆర్.ఏ.ఐ.
**జి.వీరన్న**

భోజన విరామం



130

